# అఖిలపక్ష మహాసభ 1928 : భారతరాజ్యాంగ సూత్రములను నిర్ణయించుటకు మహాసభ వారిచే నియమింపబడిన సంఘమువారి నివేదిక

చెన్నపురి, 1928

Record no. 434

# Akhilapakṣa mahāsabha 1928 : Bhāratarājyāṅga sūtramulanu nirṇayiñcuṭaku mahāsabha vāricē niyamimpabaḍina saṅghamuvāri nivēdika

Cennapuri, 1928

Record no. 434

## Bibliographic Record Target

అఖిలపక్ష మహాసభ 1928 : భారతరాజ్యాంగ సూత్రములను నిర్ణయించుటకు మహాసభ వారిచే నియమింపబడిన సంఘమువారి నివేదిక / అనువాదకుడు ఓగేటి వెంకటసుబ్బయ్యశాస్త్రి.- 3. ముద్రణము.- చెన్నపురి : ఆంధ్రపత్రికా ముద్రాలయము, 1928.

376 p. :map ;18 cm.
Record no. 434

Akhilapakṣa mahāsabha 1928 : Bhāratarājyāṅga sūtramulanu nirṇayiñcuṭaku mahāsabha vāricē niyamimpabaḍina saṅghamuvāri nivēdika / anuvādakuḍu Ōgēṭi Veṅkaṭasubbayyaśāstri.- 3. mudraṇamu.- Cennapuri : Āṃdhrapatrikā Mudrālayamu, 1928.

376 p. :map ;18 cm.
Record no. 434

# అఖిలపక్ష మహాసభ

**1928**

భారతరాజ్యాంగ సూత్రములను
నిర్ణయించుటకు మహాసభ
వారిచే నియమింపబడిన
సంఘమువారి నివేదిక

అను వాదకుడు:
ఓగేటి వెంకటసుబ్బయ్యాశాస్త్రి, బి. ఏ.

అఖిలభారత కాంగ్రెస్ సంఘ
కార్యదర్శిచే ప్రకాశితము

ద్వితీయ ముద్రణము

చెన్నపురి:
ఆంధ్రపత్రికా ముద్రాలయమునందు
ముద్రితము

వెల రూ. ౧-౦-౦ మాత్రమే.

# అఖిలపక్ష మహాసభ
## 1928
### సంఘమువారి నివేదిక

# విషయసూచిక

అఖిలపక్ష మహాసభాధ్యక్షు లగు

# డాక్టర్ ఎమ్. ఏ. అన్సారీగారికి

అధ్యక్షమహాశయా!

బొంబాయిలో 1928 వ సంవత్సరము మే 19వ తారీఖున సమావేశమైన అఖిలపక్షమహాసభ భావి భారతదేశ రాజ్యాంగమును నిర్ణయించుటకు మా సంఘమును నియమించెను. తదాజ్ఞానుసారము మేము విచారణ జరపి వ్రాసిన నివేదికను తమకు సమర్పించుచున్నాము. ఆలస్యమైనందుకు క్షమింపవలెను. మా ఆలస్యమునకు కారణము లిదివరకే మనవి చేసి యుంటిని. తాము దయయుంచి నివేదికను సమర్పించుటకు ఇంకను కొంత కాలము గడువొసంగియుంటిరి.

చిత్తగింపవలెను.

అలహాబాదు,
10-8-1928

మోతీలాల్ నెహ్రూ,
అధ్యక్షుడు.

# ఉపోద్ఘాతము

సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వము

భారతదేశమున సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వస్థాపనమునకు తగిన రాజ్యాంగవిధానమును తయారుచేయుటకై మమ్ము నియమించిన అఖిలపక్షమహాసభవారికి మా నివేదికను సమర్పించుచున్నాము. సభవారిచే మాకొసంగబడిన ఆజ్ఞాపత్రములో 'బాధ్యతాయుతప్రభుత్వ' మను పదమునకు అధినివేశప్రతిపత్తి యని అర్థముచేసి తద్రాజ్యాంగవిధానముల ననుసరించుటకు కారణము లీనివేదికలో ప్రథమాధ్యాయమున విపులముగా చర్చింపబడినవి. నివేదికమూలములో 'బాధ్యతాయుతప్రభుత్వము'నకును అధినివేశస్వాతంత్ర్యమునకును మే మేభేదములను కల్పింపలేదు. రెండును ఒక్కటియే యని భావించితిమి. మా ఆజ్ఞాపత్రము బాధ్యతాయుతప్రభుత్వము భారతదేశమున కవసరమా కాదా యని చర్చించి సిద్ధాంతము చేయుమని కోరుట లేదు. దీనికి కారణము సభవారి కా యవసరము కలుగకుండుటయే. సభలో పాల్గొనినవారిలో కొందరు సంపూర్ణ

స్వాతంత్ర్యమును కోరిరి. కాని సంపూర్ణ అధినివేశ స్వాతంత్ర్యమునకు తక్కువ యెవ్వరును కోరినట్లు మాకు తెలియదు. ఆంగ్లసామ్రాజ్యాంతర్గతమగు స్వతంత్రజాతుల తోపాటు భారతదేశముగూడ స్వాతంత్ర్యము నొందవలె నను విషయమున భారతీయులలో భేదాభిప్రాయము లేవియు లేవు. కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, ఐరిష్ ఫ్రీస్టేట్ మొదలగు రాజ్యముల స్వాతంత్ర్యమును భారతదేశము పొందుటకు తగియున్నదని దేశమునందన్ని పక్షములవారు, అన్నిజాతులవారు తలంచుచున్నారు. ఇది యెప్పుడో లభించిన చాలునని వారి యుద్దేశము గాదు. తత్క్షణము లభింపవలె ననియు, కాలవిలంబమువలన నష్టము వాటిల్లు ననియు వారి నిశ్చయము. కావున సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వము నాధారముచేసికొని మేము చేసిన సిఫారసులకు కారణములను సమర్థించుట యనవసరము.

అభ్యంతరములు

కాని భారతదేశమునకు బాధ్యతాయుతప్రభుత్వ మిప్పుడియ్యవల్లగాదని కొందరు అధికారులును, అసలే వల్లగాదని మరికొందరును అభ్యంతరములు చెప్పుచున్నారు. వీరివాదములనే అనేకులు అనేకరూపముల చెప్పుచుందురు గావున నీ యుపోద్ఘాతమున బాధ్యతాయుతప్రభుత్వ సిద్ధాంతమును,



సూర్యుని మంచువలె, నావరించియున్న కువాదములను కుతంత్రములను పటాపంచలు చేయుటకు గడంగుచున్నాము. ఈ వాదము లేవన:—

(1) బాధ్యతాయుతప్రభుత్వ మనగా అధినివేశ ప్రతిపత్తి కాదు. దానికి కొరవడు రాజ్యాంగవిధానము.

(2) అధినివేశస్వాతంత్ర్యము నిచ్చుటకు ఆంగ్ల పార్లమెంటు కంకణము కట్టుకొనలేదు.

(3) అల్పసంఖ్యాకుల సమస్యలును, సాంఘికవిభేదములును సంపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వమున కాటంకముగా నున్నవి.

(4) మనము భారతదేశమును రక్షించుకొనలేని హీనస్థితియందున్నాము.

(5) భారతసంస్థానముల సమస్య పరిష్కరింపబడలేదు.

(6) పాశ్చాత్త్యవర్తకులును, ఆంగ్లేయోన్నతాధికారులును భారతదేశమునకు స్వాతంత్ర్యము లభించినచో తమకు నష్టము కలుగు నని భయభ్రాంతు లగుచున్నారు.

రాజ్యాంగశాస్త్రజ్ఞు లందరు నీ పదమున కర్థము బాగుగా నెరింగియే యున్నారు. దీనిని సూత్రప్రాయముగా

అధినివేశ ప్రతిపత్తి యన నేమి?

నిర్వచించుట కొంచెము కష్టము కావచ్చునుగాని, అధినివేశస్వాతంత్ర్యము ననుభవించు దేశముల రాజ్యాంగ చరిత్రయు, రాజ్యాంగాభివృద్ధియు గమనించినవారికి దీనిస్వరూపము తెలిసియే యున్నది. 1926 వ సం॥న జరిగినసామ్రాజ్యసభలో (Imperial Conference, 1926) ఆంగ్లదేశమునకును, అధినివేశరాజ్యములకును సంబంధబాంధవ్యము లీ క్రిందివిధమున నిర్వచింపబడినవి.

“ఇవన్నియు ఆంగ్లసామ్రాజ్యాంతర్గతమగు స్వతంత్రరాజ్యములు. వీనిలో నొకటి తక్కువ యనికాని, ఒకటి యెక్కువ యనికాని భేద మేమియు లేదు. అన్నియు సమానములే. స్వదేశీయవ్యవహారములయందువలె, విదేశములతోడి సంబంధమునందుకూడ నివి స్వతంత్రములే. అందరును ఆంగ్లరాజునకుమాత్రము లోబడియుండవలెను. స్వతంత్రజాతులసమూహమనందగు ఆంగ్లసామ్రాజ్యమున గలప్రతిదేశము స్వేచ్ఛగలిగి యొకసభ్యత్వస్థానమువహించియుండును.” (కీత్ గారు రచించిన బాధ్యతాయుత ప్రభుత్వమను గ్రంథమునుండి, రెండవసంపుటము, పుట 1224.)

ఈవాక్యమునకు వ్యాఖ్యానము చేయుచు కీత్ పండితుడు మహత్తర మగు నీభావములను వెలిబుచ్చిన వారి యభిప్రాయములు ప్రశంసార్హములైనను ఆచరణయందు



మాత్ర మిట్లు జరగుటలేదని వ్రాసియున్నాడు. మేము కూడ ఈవాక్యముయొక్క అభిప్రాయమునే గ్రహించెదము. ఆచరణలో సంభవించుకష్టముల నన్నిటిని స్వతంత్ర భారతదేశ మెదుర్కొని, యితర అధినివేశరాజ్యములవలె పరిష్కరించుకొనగల దని మేము దృఢముగా నమ్ముచున్నాము.

బాధ్యతాయుత ప్రభుత్వ మన నేమి?

అధినివేశరాజ్యము లన్నిటిలోను బాధ్యతాయుత ప్రభుత్వము కలదు. బాధ్యతాయుత మనగా కార్యనిర్వాహకవర్గమువారు ప్రజాప్రతినిధి శాసనసభలకు బాధ్యులైయుండుట, ప్రతిరాజ్యముయొక్క ‘స్వతంత్రత,’ ‘రాజకీయాధికారము’ వ్యక్తమగునది యీ మార్గముననే. ‘బాధ్యతాయుతప్రభుత్వము’నకు వేరువిధముగా అర్థము చెప్పువారిని మేము చూచియుండలేదు. శాసనసభాధికారమును తిరస్కరించుటగాని, తగ్గించుటగాని నిరంకుశప్రభుత్వములయందు తప్ప తక్కిన రాజ్యములయందు దెచ్చటను జరగుచుండుటలేదు.

ఆగస్టు 1917 ప్రకటన

ఆగస్టు 1917 వ సంవత్సరమున చేయబడిన ప్రకటన నూతగా గొని భారతదేశము క్రమక్రమాభివృద్ధి నొంది చిట్టచివరకు స్వాతంత్ర్య గమ్యస్థానము చేరవలెనని మన ప్రతిపక్షులు చెప్పుచున్నారు. భారతప్రభుత్వ చట్టములో

గూడ చేర్పబడినమాట లిపిలో యని వారు చెప్పెదరు. భారతజాతీయమహాసభకు చేరిన సభ్యులము ఈ సంకు చితభావము నెన్నటికిని ఆమోదింపలేదు. రెండవది ఈ భావముల నొప్పుకొనినవారముకూడ 1917-19 సంవత్స రములలో నిట్టి ప్రకటనల గావించిన ఆంగ్లరాజనీతివిశార దులు భారతస్వాతంత్ర్యసిద్ధి కాటంకములు గలుగజేయ వలెనను సంకుచితభావముతో నిట్టిపదములను వెదకి కూర్చిరని నమ్మజాలకుంటిమి. 1924 వ సంవత్సరము ఫిబ్ర వరి 8-వ తారీఖున భారతప్రభుత్వమున హోంమెంబ రుగా నున్న సర్ మాల్కంహెయిలీగారు బాధ్యతా యుతప్రభుత్వమునకును, సంపూర్ణఅధినివేశప్రభుత్వమున కును భేదము తీయుచు శాసనసభలో నిట్లుపన్యసించిరి.

"సంపూర్ణ అధినివేశస్వాతంత్ర్య"మను పదమునకు అర్థము విచారించిచో, బాధ్యతాయుతప్రభుత్వముకన్న నది కొంచెము విశాలమైనదని మీరెఱుంగగలరు. కార్య నిర్వాహకవర్గము శాసనసభలకు సంపూర్ణముగా బాధ్య మైయుండుటయే కాక, అధినివేశప్రతిపత్తికి ముఖ్యలక్షణ మగు శాసనసభాస్వాతంత్ర్యాధికారము ఈరాజ్యములయందు పరిస్ఫుట మగుచున్నది. బాధ్యతాయుతప్రభుత్వములలో శాసనసభలకంత యధికారముండకపోవచ్చును; సంపూర్ణ అధినివేశస్వాతంత్ర్యము బాధ్యతాయుత ప్రభుత్వము



యొక్క ఫలమై యుండవచ్చును. బాధ్యతాయుతప్రభు త్వము క్రమశః అధినివేశస్వాతంత్ర్యముగా మారును గనుక మొదటిది రెండవదానికి సోపాన మనందగును."

మాల్కం హెయిలీగారి యీ యుపన్యాసమును ప్రమాణముగాగొని భారతప్రభుత్వోద్యోగులు క్రొత్త వాదపుపద్ధతి నవలంబించిరి. ఆంగ్లరాజనీతిజ్ఞులు కొందరు తమ యుపన్యాసములయం దీభావములనే వ్యక్తపరచిరి. ఆంగ్లదేశమునందలి పత్రికలలో ప్రముఖులు వ్రాసిన వ్యాస ములం దీయభిప్రాయములే ప్రతిధ్వనించెను. భారతదేశ మున నుద్యోగముచేసి తమ దేశమునకు మరలినఉన్నతో ద్యోగులు వ్రాసిన గ్రంథములయం దీ సంకుచితభావ ములే ప్రకటింపబడెను. కాని భారతీయులు వీని నొప్పు కొనరైరి. తత్క్షణమే భారతశాసనసభ్యులును, ఇతర ప్రజలును ఈభావములను తీవ్రముగా ఖండించిరి.

అధినివేశప్రతిపత్తికిని బాధ్యతాయుత ప్రభుత్వమునకును భేదములేదు

అధినివేశస్వాతంత్ర్యమునకును, బాధ్యతాయుత ప్రభుత్వమునకును హెయిలీగారు చేసిన యీ కృత్రిమ భేదము, 1917 - 19 వ సంవత్సరము లలో ప్రకటనలగావించిన యాంగ్లేయ రాజనీతిజ్ఞులు చేయనెంచినది కాదని చెప్ప సాహసించుచున్నాము. 1927 వ సంవత్సరము ఆగష్టు 20 వ తారీఖున తాముచేసిన ప్రకటనయొక్క అభిప్రా

యము సంకుచిత శాసనాధికారము గలిగిన బాధ్యతాయుత ప్రభుత్వమే యనియు, దానినే భారతీయు లొప్పుకొనవలసిన దనియు, వారు భారత దేశమున కేమైన నాహ్వానము నంపిరా? భారతదేశమునకు సంపూర్ణ అధినివేశప్రతిపత్తికన్న తక్కువయగు బాధ్యతాయుత ప్రభుత్వమును ప్రసాదించెద మని వారియుద్దేశ మెన్నటికిని నై యుండదు. ఆంగ్లరాజనీతిజ్ఞుల యభిప్రాయ మదియే యని చెప్పసాహసించుట వారికి బుద్ధిపూర్వక కాపట్యము నారోపించుట తప్ప వేరుకాదు. ఇదియే నిజమగుచో భారతదేశమునకు అధినివేశ స్వాతంత్ర్యమును ప్రసాదించెదమను పార్లమెంటుసభవారి ఋషివాక్యములను నమ్మియున్న భారతరాజకీయకక్షులు కూడ పార్లమెంటుసభయందు విశ్వాసమును సంపూర్ణముగా గోల్పోయెదరు. మనరాజుగారు గవర్నరుజనరల్‌గారి కొసంగిన విచారణాపత్రములో (Instrument of inrtructions) 'భారతదేశము ఇతర అధినివేశరాజ్యములతో పాటు స్వాతంత్ర్యముపొందుటకు' అనియున్నమాటలు తన వాదమును బలపరచుకొనుట కుపయోగించునని హెయిలీ యూహించెనుగాని ఋజువుచేయలేదు. ఆజ్ఞాపత్రములోని మాటలు హెయిలీగారి వాదము నెన్నటికిని బలపరుపజాలవు. పైగా ఆంగ్లరాజనీతిజ్ఞుల మనములయందు బాధ్యతాయుత ప్రభు



త్వమునకును, అధినివేశస్వాతంత్ర్యమునకును భేద మేమియులేదను మావాదమును బలపరుచుచున్నవి. మాల్కం హెయిలీగారి సంకుచితప్రభుత్వవిధానమునకు భారతదేశ మెన్నటికిని ఒప్పుకొనజాలదు. మనకొసంగబడు ప్రభుత్వవిధానమునందు శాసనసభలకు సంపూర్ణ మగు అధికారము లుండవలెను.

భారతదేశపు హక్కులు

భారతదేశమునకు సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వ మొసంగబడు నని పార్లమెంటుసభవారి ప్రకటనకు ఉదారబుద్ధితో వ్యాఖ్యానము చేసిన నెంతబాగుండెడిది? అప్పు డిట్టి తగాదాలు రావుగదా! అథవా హెయిలీగారి వాక్యములే సత్యమైనచో నిట్టి సందిగ్ధ ప్రకటనల గావించిన రాజనీతిజ్ఞుల గౌరవమునకు భంగము కలుగజేయుటయు, భారతీయులచే నిరాకరింపబడుటయు తప్ప వేరు ఫలిత మేమైన నుండునా? భారతదేశ మెంత యాందోళనచేయగా పార్లమెంటువారీప్రకటనగావించిరో ఆలోచించినచో, ఇతర అధినివేశరాజ్యములతో పాటు భారతదేశముకూడ అంతర్జాతీయసభలో సభ్యత్వమును గలిగి, సంధిపత్రములలో సంతకము చేయగలిగిన స్వాతంత్ర్యాధికారము గలిగియుండె ననువిషయము నాలోచించినచో, ఆంగ్లపార్లమెంటు భారతదేశమునకు ఇతర

అధినివేశరాజ్యములతో పాటు సమానహక్కుల నియ్యదలచె ననుట కేసందేహములును ఉండబోవు. 1924-వ సంవత్సరమున భారతప్రభుత్వసభ్యు డగు మాల్కాం హెయిలీగారు చేసిన కృత్రిమవిభేదముల వలన భారతీయుల హక్కుల కాటంకము లేమియు రాబోవు. ఇప్పుడు హెయిలీగారి వాదమును పరీక్షింతము. అతడు చెప్పినట్లు బాధ్యతాయుత ప్రభుత్వములలో శాసనసభల యధికారము తగ్గియుండు ననుమాట సత్యమైనచో అధినివేశ స్వాతంత్ర్యము బాధ్యతాయుతప్రభుత్వముయొక్క ఫలిత మెట్లగును? శాసనసభాధికారములపై నిరోధములు తొలగిన తరువాత, బాధ్యతాయుత ప్రభుత్వమంత మొందింపబడి, అధినివేశప్రభుత్వము స్థాపింపబడు ననుట సమంజసముగా నుండును. ఇట్లుచేయుట భారతదేశముతో చెర్లాటలాడుటయై యున్నది. ఈ ప్రయత్నములవలన భారతీయులకును, ఆంగ్లేయులకును జరగుచున్న తీవ్రవాదోపవాదములు తగ్గుటకుమారుగా హెచ్చి, రెండు దేశములకు వైషమ్యమును వృద్ధిపరచును. మరియు స్వతంత్ర కార్యనిర్వహణశక్తి యలవడనివార మగుటయే కాక, సాంఘిక ఆర్థికవిషయములందు గూడ మన యభివృద్ధి ఆటంకపరుపబడును. సర్ మాల్కమ్ హెయిలీగారి యుపన్యాసమునకు మారుగా, శ్రీ జార్జిసార్వభౌముడు



1919-వ సంవత్సరము డిసెంబరు 23-వ తారీఖున చేసిన ప్రకటనను ప్రమాణముగా మేము చూపుచున్నాము. అందులో శ్రీవారు 1919 సంవత్సరపుసంస్కరణచట్టము 'ఇకముందు సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వమునకు దారి చూపు'ననియును, 'భారత ప్రజలను తమ కార్యములను స్వయముగా నిర్వహించుకొని, తమశ్రేయమునురక్షించుకొనగలవారినిగా చేయు' ననియు నున్నది. 1920 సం. లో భారతశాసనసభలకు ఎన్నికలవిషయమున వ్రాయుచు కీత్ పండితుడు 'భారతదేశము సంపూర్ణస్వాతంత్ర్యమును గడించి, ఇతర అధినివేశరాజ్యములతో మాత్రమే కాక ఆంగ్లదేశముతోడను సమానస్థానమును వహించు రోజులను సూచించుచున్నవి' అని నుడివెను. పూజనీయములును, పవిత్రములును నగు పార్లమెంటు మహాసభవారి వాక్యములను వ్యర్థపదములుగా చేయ నుద్దేశింపబడిన భారతప్రభుత్వసభ్యుని మాటలు పరిగణింపదగినవి కావని మా యభిప్రాయము.

కావున మాసిఫారసులకు ప్రాతిపదికగా నున్న రెండు ప్రధానసూత్రముల నిచ్చట తెలుపుచున్నాము. (1) సంపూర్ణ అధినివేశప్రతిపత్తికి నేమాత్రము తగ్గిన రాజ్యవిధానమునకైనను భారతీయు లొప్పుకొనరని మేమేకీభవించుచున్నాము. (2) భారతదేశములో సత్వ

రముగా స్థాపింపబడు రాజ్యవిధానము ఇతర అధినివేశ రాజ్యములతోపాటే యుండవలెనుగాని కోరవడరాదు.

ప్రజాప్రతినిధి ప్రభుత్వము భారతదేశ పరిస్థితుల కేమాత్రమును తగియుండ దని చెప్పు అనేక అభ్యంతరములను మే మెరింగియే యున్నాము.

అధినివేశస్వాతంత్ర్యమున కభ్యంతరములు (1) ప్రజాప్రతినిధిప్రభుత్వము పనికిరాదా?

ప్రతినిధుల నెన్నుకొనుట భారతీయుల సంప్రదాయము కాదనియు బాధ్యతాయుత ప్రభుత్వము లేకుండ స్వపరిపాలన యుండవచ్చుననియు కొందరు చెప్పెదరు. ఆంగ్లదేశములో తప్ప తక్కిన పాశ్చాత్త్యదేశము లన్నిటిలోను ప్రజాప్రతినిధి ప్రభుత్వము విఫలమైనదనియు, ఇట్టితరుణమున నీవిధానమును భారతదేశమున ప్రవేశపెట్టుట ప్రమాదకరమనియు వారు చెప్పుటకు వెనుదీయరు. కొంద రిట్లు ప్రలపించినను నిరంకుశవిధానమును నాశముచేసిన ప్రతి పాశ్చాత్త్యదేశమును ఏదోవిధమగు ప్రజాప్రతినిధి ప్రభుత్వమునే స్థాపించుట చోద్యముగదా! విపరీత రాజ్యాంగవిధానము నవలంబించిన రష్యా, ఇటలీవారిపద్ధతులను మనముకూడ నవలంబింపవలెనని 'వీరుకోరరుగదా! పాశ్చాత్త్యదేశములు మాత్రమే ప్రజాప్రభుత్వమును స్థాపింపదలచుట లేదు. ప్రాచ్యులలో జపాన్, టర్కీ, పారసీకము ప్రజాప్రతినిధి



ప్రభుత్వములనే యవలంబించినవి. ప్రజాప్రతినిధిప్రభుత్వము మన సంప్రదాయములకు విరుద్ధ మని యొప్పుకొన్నచో వేరుమార్గ మేదైన కలదా?

వీరు కొన్ని విపరీతపద్ధతులను సూచించెదరు. భారతసంస్థానములలోని పద్ధతులమీఁద భారతదేశమంతయు

విపరీతపద్ధతులు

చిన్నచిన్న ఖండములుగా చేసి పరిపాలింపవలెనని వా రందురు. ఈ విషయమున సర్ వాల్టర్ లారెన్సు అనునత డిట్లు వ్రాయుచున్నాఁడు. 'నవీన భారతరాజ్యాంగనిర్మాతలకు నిశ్చితమగు ప్రాతిపదిక యుండవలెను. భారతీయులకు దురవగాహమై, పక్షపాతవిరహితులును సమర్థులు నగు ఆంగ్లేయాధికారులచే నడపబడినప్పుడే అంత తృప్తికరముగా నుండని రాజ్యవిధానమును వికారరూపము నొందించి యవలంబించుటకంటె భారతసంస్థానములలోని దేశీయ పద్ధతుల నవలంబించుట శ్రేయోదాయకము కదా! (The India that we served. అను గ్రంథమునుండి, పుట 289,) ఇట్టిమాటల యర్థమును గ్రహించుట దుర్లభము. ఆంగ్లభూమిలోని కొన్నిరాష్ట్రములను సంస్థానాధీశుల కొసంగవలె ననికాని; ప్రభుత్వమున శిష్టు లగు వారిలో నుండి కొందరను సంస్థానాధీశ్వరులనుగా చేసి దేశమును పరిపాలింపవలెనని కాని, దీనిలో ధ్వని లేదు

కదా! ఇట్లుచేసినచో భారతీయులకోరికలప్రకారము రాజ్యాంగవిధానముతయారుచేయుట వట్టిబూటకమనియు, పార్లమెంటు మాటలు శుద్ధ అబద్ధము లనియు తేలును. భారతదేశములో ఆంగ్లపరిపాలన యేమాత్రమును లాభకారి కాలేదని భారతచరిత్రకారుడు వ్రాయదగి యుండును. కొన్ని మాసములక్రిందట ప్రఖ్యాతివహించిన ఆంగ్లటోరీపత్రిక యొకటి భారతప్రభుత్వము మొగల్ చక్రవర్తుల సంతతివారిని ఢిల్లీసమ్రాట్టుగా నియమింపవలెనని సూచించెను. ఇట్టి యభిప్రాయములు గణనీయములు కావని వేరుగా చెప్పనవసరము లేదు.

ఆంగ్ల-భారత సహకారము

భారతదేశములో కొంతకాలము రాష్ట్రాధిపత్యము వహించి ఉపకారవేతనముల ననుభవించుచున్న కొందరు, ఆంగ్ల-భారతసహకార మను క్రొత్తపద్ధతి నభిమానముతో జూచుచున్నారు. భారతీయులు యావత్కాలము నూటికి 50 వంతునగాని, అంతకన్న హెచ్చుగాని ఉద్యోగములను ఆంగ్లేయుల కియ్యనొప్పుకొనినచో భారతసమస్యాపరిష్కార మగునని వారి యూహ. మరికొందరు ప్రస్తుత రాజ్యాంగమున క్రిందిసంస్కరణలు చేసిన చాలునని చెప్పుచున్నట్లు మాకు తెలియుచున్నది. ఇవి



యేవన (1) శాసనసభాప్రతినిధులనుండి కొందరుమంత్రుల నియమించి, అధికారులను మాత్రము రాజుగారు నియమింపవలెను. ఈ అధికారులు శాసనసభలకు కాక రాజుగారికి బాధ్యులై యుండవలెను. (2) రాష్ట్రములలో శాసనసభలు త్వరపడి శాసనములు చేయకుండ రెండవ శాసనసభలను నిర్మించుట. (3) కేంద్రప్రభుత్వములో నేమియు మార్పు చేయరాదు. (4) కేంద్రభారతసభాసభ్యు లిప్పటివలె ప్రమాదకరము లగు చట్టములు చేయకుండ వారి శాసనాధికారమును కొంతవరకు తగ్గించుట.

భారతదేశములో కొందరును, ఆంగ్లదేశములో కొందరును, ఈసంస్కరణములను రాజకీయాభివృద్ధి యని తలచిన తలపవచ్చును. కాని బాధ్యతాయుత ప్రభుత్వమునకును దీనికిని సహస్రాంశము భేదమున్నదని మా యభిప్రాయము.

రాజకీయాధికారము ప్రజలకు సంక్రమింపవలెను

భారతదేశమునకు బాధ్యతాయుతప్రభుత్వము, అనగా అధినివేశస్వాతంత్ర్య మిచ్చుట కెన్ని యభ్యంతరము లున్నను ప్రస్తుత సంకరప్రభుత్వమునకును, సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వమునకును మధ్యమార్గ ముండబోదు. విషయ మాలోచించిన కొలది

నిది రాజ్యాంగములో భారతీయు లుండుటయా తెల్లవారుండుటయా యనుసమస్య కాదనియు, రాజ్యాంగమే సంపూర్ణముగా మారవలెననియు మాకు దృఢమగుచున్నది. గవర్నరుజనరల్‌గారి కార్యనిర్వాహకసభలో సభ్యులందరును భారతీయులే యైనను, రాష్ట్రప్రభుత్వములలోని సభ్యులుకూడ భారతీయులే యైనను తెల్లనిరంకుశవర్గము యొక్క స్థానమున నల్లనిరంకుశవర్గము వచ్చుటయేకాని వేరులాభ ముండబోదు. ఒకరిమనస్సు నొప్పించుటకు మేమిట్లు వ్రాయుటలేదు. అధికారము ఆంగ్లప్రజల హస్తములనుండి భారతప్రజలకు సంక్రమింపవలెనని మాయభిప్రాయ మని గమనింపదగును.

ఇండియా కార్యదర్శి

ప్రస్తుతము ఆంగ్లప్రజలు భారతదేశ ప్రభుత్వము నెట్లు నిర్వహించుచున్నారు? ఆంగ్ల జనసామాన్యమునకు భారతదేశమును గురించి యేమియు తెలియదు. తెలిసికొనుటకు అవకాశముగూడ లేదు. పార్లమెంటు మహాసభకు కొందరు ప్రతినిధుల నెన్నుకొనుటతో తమ పని పూర్తియైన దని వారు తలతురు. ఈసభ్యులకు గూడ భారతదేశముయొక్క సంగతు లేమియు తెలియవు. వారు భారతకార్యదర్శిమీద భార మంతయు మోపి యతడు చేసినదానికి తల యూచుచుందురు. భారతకార్యదర్శి



యెట్టివాడు? భారతపరిస్థితు లతనికైనను బాగుగా తెలియునా? అతడును భారతపరిస్థితులను స్వయముగా నెరింగినవాడు కాడు. ఇతరులసలహా ననుసరించి చేయవలసినవాడే. భారతప్రభుత్వము గాని, యతనిక్రింది యుద్యోగులు గాని, ఇండియాసంఘసభ్యులు గాని అతనికి సలహా లొసంగుచుందురు. వేయేల? భారతప్రభుత్వమంతయు ఇండియాకార్యాలయ బృందముమీద నాధారపడి యున్నది. ఈ బృందము భారతదేశమున కన్నివిధముల నష్టము చేసి, అభివృద్ధి నాటంకపరచుచున్నది. ఇండియాప్రభుత్వమువారినికూడ స్వేచ్ఛగా నేపనిని వీరు చేయనియ్యరు. కావున భారతదేశమునకు ముఖ్యావసరము ఈ బృందముయొక్క విచ్ఛేదము. ఇండియాకార్యదర్శిశృంఖలములనుండి భారతప్రభుత్వము విముక్తమైనతరువాత ఆంగ్లయెన్నికదారులనుండి ప్రభుత్వము భారతయెన్నికదారులహస్తగతము తప్పక కావలెను. అనేకవేలమైళ్ల దూరమునుండి, స్వయముగా కార్యభారము వహింపజాలక, పెత్తనము నితరులమీద వదలివేయు ప్రభుత్వము భారతదేశమును పరిపాలించుచున్నది. భారతదేశచరిత్రయందింత దుస్స్థితి మన కెన్నడును పట్టియుండలేదు. ఏదేశమందైనను ఈపద్ధతి అనర్థకారణమే. కాని యిన్నిభాషలు, ఇన్నిమతములు, ఇన్ని

సాంఘిక రాజకీయ ఆర్థికసమస్యలుగలిగిన భారతదేశమున అనర్థదాయకమును, అస్వాభావికమును నగు నిట్టి రాజ్యవిధానమును చిరకాలము మనము భరించుట దుర్ఘటము. ఇన్నివందల సంవత్సరములనుండి యెట్టులో భరించితిమి. ఇప్పుడన్ననో ప్రజలకు గాఢమగు దేశభక్తిగలిగినది. ఆత్మగౌరవము కాపాడుకొనవలెనను ఇచ్ఛ జనించినది. తమ శక్తిసామర్థ్యములయెడ విశ్వాసము కలిగినది. స్వాతంత్ర్యమును బడయవలెనని గాఢమగు కోర్కె లుదయించినవి. ఇంక నీదుర్భరస్థితినిమనప్రజలు భరింపజాలరు. ఆంగ్లప్రజల నుండి భారతప్రజలకు సర్వాధికారములు సంక్రమించునట్టి బాధ్యతాయుతప్రభుత్వమునే ప్రజ లొప్పుకొందురు గాని యింకొకవిధానమును వా రొప్పుకొన రని మేము దృఢముగా నమ్ముచున్నాము.

**భారతసంస్థానములు**

1924 వ సంవత్సరమున సర్ మాల్కొం హెయిలీ గారు గావించిన యుపన్యాసములో భారతస్వాతంత్ర్యము నాటంకపరచెడి వనేకప్రశ్న లున్నవి. మనప్రతిపక్షులు విస్సన్న చెప్పినది వేదమన్నట్టు చిలుకపలుకులవలె వాని నుచ్చరించెదరు. భారతదేశములోని బ్రిటిష్ పరిపాలిత భాగములకుమాత్రమేనా అధినివేశస్వాతంత్ర్యము, సంస్థానములకు కూడనా? అని హెయిలీ ప్రశ్నించెను. ఈ



విషయమును సమగ్రముగా నొక యధ్యాయములో చర్చించితిమి. పాఠకులుసావకాశముగా తిలకించెదరుగాక!

**అల్పసంఖ్యాకులు**

అల్పసంఖ్యాకులగు సంఘములవారిగతి యేమని మాల్కొం హెయిలీగా రడిగిరి. అతనివలె నీవిషయమునకు మేము అనవసరముగా ప్రాధాన్యము నియ్యదలపలేదు. ధైర్యముతో పరిష్కరింపవలసినవిషయమని తలచుచున్నాము. సార్వజనికహక్కులని మేము వ్రాసిన 19 సూత్రములయందును, శాసనసభ్యులసంఖ్య నిర్ణయించుటయందును, బాగుగా నాలోచించి వీరి హక్కులను రక్షించినాము. ఒక్కవిషయముమాత్రము చెప్పవలసియున్నది. ఒక్కభారతదేశములోనే ఈసమస్య పొడసూపిన దని తలపరాదు. మహాసంగ్రామానంతరము ఇతరదేశములలోగూడ ప్రజ లీసమస్యను పరిష్కరించుకొనవలసిన వారైరి. కాని యెచ్చటను సంపూర్ణస్వాతంత్ర్యసంపాదన కభ్యంతర మగు కారణముగా దీని నెవ్వరును చెప్పియుండలేదు. ఈవిషయమున మేముకొన్ని సూచనల జేసినాము. కాని అల్పసంఖ్యాకులకును, అధికసంఖ్యాకులకును, అందరకు సమ్మత మగు వేరొక విధానమును అఖిలపక్ష మహాసభవారు నిర్ణయింప గలిగినచో, మా సిఫారసులను మార్చుకొనుటకుగాని, వదలుకొను

టకుగాని యేయభ్యంతరమును లేదు. ఏ యొడంబడిక నైనను విశాలజాతీయభావముతో నాలోచింపవలయును గాని సంకుచిత సాంఘికదృష్టితో విచారింపరాదు.

సాంఘిక రాజకీయ పరిస్థితులు

మాల్కంహెయిలీ గారును, అతనివంటి మరి కొందరును ఇంకొకప్రశ్న వేయుచున్నారు. "భారతదేశమునకు స్వాతంత్ర్య మియ్యదగిన రాజకీయ సాంఘిక పరిస్థితులు భారతదేశమున ప్రస్తుత మున్నవా? కాలపరిపక్వమై సాంఘికరాజకీయాభివృద్ధి కలిగినప్పుడు గదా ప్రజలు స్వాతంత్ర్యమును నిర్వహింపగలిగెదరు" అని వారనెదరు. సర్ మాల్కం హెయిలీగారే తమయుపన్యాసమున నీప్రశ్నను చర్చించి యొకవిధముగా ప్రత్యుత్తరమొసంగిరి. వారివాక్యము లిట్లున్నవి.

'ఈవిషయ మనుల్లంఘనీయ మైన దని నేను తలచుటలేదు. ఎన్నికదారులలో నధికసంఖ్యాకులు విద్యావంతులైనదాక రాజకీయాభివృద్ధి యాగియుండవలెనని కూడ నేను తలపను. ఆంగ్లదేశములో నేమిట్లాగి యుండలేదు. కొలదిమందినైనను, విద్యాధికులకు ప్రజాసామాన్యమున గల పలుకుబడి చాలఅధికమని నేనుగ్రహించుచున్నాను. కాని దేశములో సాంఘికాభివృద్ధికంటె రాజకీయాభివృద్ధి అత్యధికముగా జరగిన దనిమాత్రము నా యభి



ప్రాయమై యున్నది.' ఈవిషయమున నాలోచింతము. మనకే జాతీయప్రభుత్వ మున్నయెడల సాంఘికముగా నిట్టి దురవస్థలో నుండియుండము. విదేశీయప్రభుత్వమగుటచేతను, ఏమిచేసిన నెవరికి కోపమువచ్చునో, దాని వలన తమ కేమి ముప్పు వాటిల్లునో యనుభీతివలనను, సర్వాంగసుందర మగు భారతసంఘము రాజకీయముగ గూడ బలిష్ఠముగనుండు ననుకారణమువలనను ప్రస్తుత పరిపాలకులు సంఘసంస్కరణమందు పాల్గొనక మన యధోగతికి కారకు లయిరి. సాంఘికాభివృద్ధి హెచ్చుగా జరగ నవసరము లేదని మేము చెప్పుటలేదు. చాల అవసరమే. కాని ప్రస్తుత సాంఘికవ్యవస్థ బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనమునకు ఆటంకము కా దనియు, బాధ్యతాయుతప్రభుత్వము స్థాపింపబడిన గాని సాంఘికాభివృద్ధి కలుగనేరదనియు మావాదము. ప్రభుత్వాధికారము భారతీయులవశమున నున్నగాని సక్రమసాంఘిక పునర్నిర్మాణ విధాన మమలులో నుంచుటకు వీలులేదని మేము తలచుచున్నాము. ఈ సందర్భమున నొక్కవిషయము చెప్పవలసియున్నది. భారతదేశమునందలి విద్యాధికులు అనేక సంవత్సరములనుండి సంఘసంస్కరణమం దభిమానము వహించి, అనేకసంస్థలను నెలకొల్పి చాల ప్రశస్తమైన పనిని చేయగలిగిరి. మన విదేశీయ విమర్శకు లీప్రయత్న

ములను పరిగణింపక మనలోనున్న చెడుగులను మాత్రమే గ్రహించి మంచిని త్రోసివేయుచున్నారు. భావిబాధ్యతాయుతప్రభుత్వము విద్యావ్యాపకమును గాని, నిమ్నజాత్యుద్ధరణమును గాని, గ్రామముల ఆర్థికసాంఘిక పునర్నిర్మాణమును గాని చేయ పూనుకొన దని మేము నమ్మజాలము. సంస్కరణప్రభుత్వములో శాసనసభలకు అధికారములు హెచ్చులేకపోయినను, కోశసమృద్ధి శూన్యమైనను, శాసనసభ్యులు ప్రజల విద్యాభివృద్ధియెడల చాల శ్రద్ధవహించి పనిచేయుచుండుట వ్యక్తమే.

పాశ్చాత్త్య వాణిజ్యము— ఉద్యోగములు

తరువాత మనము విచారింపవలసిన విషయము పాశ్చాత్త్యవాణిజ్యమును గురించియైయున్నది. 'భారతదేశములో కోట్లకొలది ద్రవ్యముపెట్టుబడి పెట్టి, దానిని అనుక్షణము వృద్ధిచేయ నుద్దేశించుచున్న పాశ్చాత్త్యవర్తకులు మనము త్వరలో రాజ్యవిధానమును మార్చ నుద్దేశించితి మేమో తెలిసికొన హక్కుగలిగియున్నారు.' ఈవిధముననే 'ప్రభుత్వోద్యోగములయందు నూతనముగా ప్రవేశించువారుకూడ అడుగుటకు హక్కుగలిగియున్నారు.' అని మన ప్రభువులు చెప్పెదరు. భారతదేశములో ద్రవ్యము పెట్టుబడిపెట్టినవా రింత కంపము నొందుటకు కారణ మేమియో మాకు బోధపడుటలేదు.



న్యాయసమ్మతముగా వర్తకము చేయువారిని ఆటంకపెట్టుటకు చట్టములు మన మెందుకు చేయుదుము? భారతవాణిజ్యమువలెనే పాశ్చాత్త్యవాణిజ్యము కూడ గొప్పవ్యాపారమునకు తప్పనిసరి యగు ఇబ్బందుల నందవలసి వచ్చెను. ఇకముందుకూడ ఈ యిబ్బందులు తప్పవు. పాశ్చాత్త్యప్రభుత్వములు గూడ సాహుకార్లకును పనివారికిని వచ్చు తగాదాలను సంపూర్ణముగా నాపుదలను చేయలేకపోయినవి. ఐనను పాశ్చాత్త్యవాణిజ్యములో నేశాఖకైనను ప్రత్యేకసౌకర్యము లవసర మని వారు తలచుచో, తమ కష్టసుఖములను తెల్పినంత మాత్రముననే భావి భారతరాజ్యాంగమును శాంతియుతముగా పరిష్కరింప నుద్దేశించిన భారతప్రజలు వానినాలోచించెదరు. సివిల్, మిలిటరీ ఉద్యోగుల విషయమున మానివేదికలో నింకొకభాగమున చేసినసూచనలను పాఠకులు పరిశీలించెదరుగాక! భారతస్వాతంత్ర్య సంస్థాపనాసమయమున నీ యుద్యోగులకు న్యాయముగా రావలసిన జీతములు పించెనులు మొదలగువానికి తగుహామీ యియ్యబడునని తెలియజేసినాము. ఇచ్చట లీసంఘ (Lee Commission)మును గురించి యొకమాట చెప్పవలసియున్నది. ఈసంఘము భారతీయులు వద్దు వద్దని మొరపెట్టుచున్నను ఏర్పాటు చేయబడెను. దాని సిఫారసులను

శాసనసభవా రొప్పుకొనకపోయినను ప్రభుత్వమువా రవలంబించిరి. ముందు ఉద్యోగులను నియమింపవలసిన పద్ధతులు, వారికి జీతములు భత్యములు, ఉపకారవేతనములు మొదలగు విషయములను నూతన రాజకీయపరిస్థితులనుబట్టి సమగ్రముగా పరీక్షించి నిర్ధారణచేయుట యవసరము. భావిబాధ్యతాయుత ప్రభుత్వమున ఉద్యోగులు, ఆంగ్లేయు లైనను, భారతీయు లైనను, ఇతర అధినివేశములతోపాటు సత్కరింపబడుదురే కాని వేరువిధముగా చూడబడుదు రనుతలంపునకు నవకాశ మేమియు గాన్పించదు.

భారతసేన

భారతదేశ సంరక్షణమును గురించి చర్చించి యింతటితో నీయుపోద్ఘాతమును ముగింతుము. మాల్కం హెయిలీగా రీవిషయమున నిట్లు నుడువుచున్నారు. "సంపూర్ణ అధినివేశ ప్రతిపత్తికి ముఖ్యావసరము ప్రభుత్వమునకు సంపూర్ణముగా లోబడియున్న సేన యని వేరుగా చెప్ప నవసరము లేదు. భారతదేశము స్వతంత్రముగా సేనను నిర్వహింపగల దని చెప్పినవా రింతవఱ కెవ్వరును లేరు. ఇకముం దైనను బలీయమైన సేన నిర్మింపబడు నన్న యాశలు గానరావు." ఈవిషయమును గుఱించి కీత్ పండితు డిట్లు నుడివియుండెను. 'దేశీయసేనాపతులకు



లోబడియున్న భారతసేనను దేశసంరక్షణకు మాత్రమే కాక సరిహద్దురాష్ట్రముల సంరక్షణకుగూడ వినియోగింపవచ్చును. కాని యింతవఱకు కలిగిన యభివృద్ధి మిక్కిలి స్వల్పము. దీనికి రెండు కారణములు గలవు. సేనను భారతీయుల కొప్పజెప్పుట ఆంగ్లేయ సర్వసేనాధిపతులు మున్నగు అధికారుల కెంతమాత్రము ఇష్టము లేకపోవు టొకటి. రెండవది భారతీయులకని నిర్ణయింపబడిన యుద్యోగములకు తగిన భారత యువకులు రాకుండుట. గొప్ప ఉద్యోగములలో ప్రవేశింపదలచినవారు పుష్కలముగా వేతనములు దొరకెడి ఇండియన్ సివిల్ సర్వీస్‌లో చేరుదురుగాని సేనలో ప్రవేశింపరు. మఱియు సేనలో భారతీయులపై గల సవతితల్లిప్రేమ, అనుమానములు సివిల్ ఉద్యోగములలో లేవు. ఏది యెట్లున్నను బలీయమగు సేనాదళములు లేనిది బాధ్యతాయుత స్వపరిపాలనము జయప్రదముగా కొనసాగు ననుమాట కల్ల.'

ఇది సత్యమే కాని తగు సేనాబలము లేనియెడల భారతదేశ మధినివేశస్వాతంత్ర్యమున కర్హము కాదను వాదమును మే మొప్పుకొనము. మొదటిది భారతదేశములో బలీయమగు సేనను క్రొత్తగా సృష్టింప నవసరములేదు. ఇదివరకే యున్నది. రెండవది చరిత్రాత్మకముగా నాలోచించినచో మన విమర్శకులు చెప్పునది సత్యము కాదని బోధపడక మానదు.

మా వాదమును బలపఱుచుటకు, సర్ శివస్వామి అయ్యర్ గారు భారత శాసనసభలో ఫిబ్రవరి 19, 1924 సంవత్సరమున చేసిన యుపన్యాసము నుల్లేఖింప సాహసించుచున్నాము. శివస్వామిఅయ్యర్ గారు భారతసేనా సమస్యలలో నిధి గావున వారి యభిప్రాయములు చాల మాననీయములై యున్నవి. వారి ట్లుపన్యసించిరి:—

'నాకు తెలిసినంతవఱకు అధినివేశ రాజ్యములకు స్వాతంత్ర్య మొసంగబడినప్పుడు, వానిలో నొక్కరాజ్యము కూడ స్వయంరక్షణము చేసికొనగల స్థితియందుండ లేదు. స్వాతంత్ర్యము లభించిన చాల సంవత్సరములవఱకు అవి తమరక్షణమునకు సేనలను భరింపజాలక పోయెను. మనమో, మొదటినుండియు మన సేనలను భరించుచుంటిమి. మన సేనలను మాత్రమేకాక ఆంగ్ల సేనలనుగూడ వల్లమాలిన జీతము లిచ్చి భరించుచుంటిమి. అధినివేశస్వతంత్రరాజ్యములకన్న మన మెక్కుడుబాధ్యతలను వహించుచుంటిమి. సేనలకు జీతము లిచ్చి భరించుట మాత్రమే కాక, సేనానాయకులును, సేనాపరిపాలనయు, భారతీయుల వశమున నున్నగాని మనము సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వమునకు తగ మని మాల్కంహెయిలీగారనుచున్నారు. దీనిలో కొంత సత్యము లేకపోలేదు. ఐనను, అధినివేశ స్వతంత్ర రాజ్యములవిషయమున నీ పరతు చెప్పబడియుండలేదు. దేశమున కల్లోలములు జరగకుండ తగిన కట్టుదిట్టము లుండవలెనని కోరినమాట వాస్తవమే. అది యెప్పుడు? స్వాతంత్ర్య మొసంగిన కొన్ని సంవత్సరములకు. శత్రువు దేశముపై దండెత్తివచ్చినప్పుడు రక్షించుకొను బాధ్యత అప్పటికిని ఇప్పటికిని అధినివేశరాజ్యములపై లేదు. నావికాదళమువిషయమున అసలే లేదు.'



సేనవిషయమై సిఫారసులు

ఆంగ్లేయాధికారులజీతములకును, భత్యములకును ఉపకారవేతనములకును, తగు హామీల నొసంగి సేనను భారతీయులవశము చేయవలసిన దని సిఫారసు చేసితిమి. భారత శాసనసభలో సేనలపక్షమున బాధ్యతవహించిన యొక మంత్రి యుండినచో సేనకును శాసనసభకును అన్యోన్యత యుండుటయేకాక, పుష్కలముగా ధనసాహాయ్యము గూడ జరగుచుండును. ప్రస్తుతము సేనల కగుఖర్చు శాసనసభవారివశమున లేదు. దానివిషయమున సభ్యులు చర్చించుటకు కాదుగదా, నోరు మెదలించుటకు గూడ వీలులేదు. శాసనములో నీవిషయమున 'గవర్నరుజనరలు సెలవొసంగిననే తప్ప సేనలకగు ఖర్చును శాసనసభవారు చర్చింప వీలులేదు.' అని స్పష్టముగా నున్నది. సేనలో హెచ్చుగా భారతీయులను చేర్చుకొనుటకు '8 యూనిట్ స్కీమ్'తప్ప వేరుప్రయత్న మేమియు నిటీవల జరగియుండ

లేదు. ఈపద్ధతిని స్కీన్‌కమిటీవారు తీవ్రముగా ఖండించుటచే నిదియు వదలివేయబడినది. భారత యువకులను సాంఢ్‌హర్స్టు సేనాకళాశాలకు పంపి తర్ఫీదై వచ్చిన తరువాత అధికారులనుగా నియమించుపద్ధతివలన నెన్నాళ్లకు సేన భారతీయులవశ మగునో ఊహింప శక్యము కాదు. సాంఢ్‌హర్స్టుకళాశాలకు పంపుటకు ఇప్పటికంటె హెచ్చుయువకులు దొరకరని మేము నమ్మజాలము. విద్యార్థులను స్వీకరించుపద్ధతి చాల సంకుచితముగా నున్నది. తగుప్రయత్నములు చేసినచో భారతదేశములోనే మనయువకులు మంచిశిక్షణను బొందుట కవకాశములు కలవు. ఇతరవిషయములందువలె సేనయందును, భారతదేశ మన్యులపై నాధారపడకుండ స్వయంశక్తిమీదనే యాధారపడియుండునట్లు చేయుట బాధ్యతాయుత ప్రభుత్వముయొక్క ప్రథమకర్తవ్యము. ఈ సూత్రము ననుసరించి భారతదేశమునం దచ్చటచ్చట కొన్నిశిక్షణకళాశాలలు స్థాపింపవలసినట్లుగా మేము సిఫారసు చేసితిమి. దేశక్షేమమునకై యెల్లప్పుడును శ్రద్ధ వహించి పనిచేయుట కనేకపద్ధతుల నాలోచించి 'దేశసంరక్షక సంఘ' మను సంఘము నొకటి స్థాపింపవలెనని కూడ వ్రాసితిమి.

---

# నివేదిక

# మొదటి అధ్యాయము

---

ఈనివేదికను సమర్పించుచున్న మాసంఘమును బొంబాయిలో 1928 సం.ము మే 19 వ తారీఖున సమావేశమైన అఖిలపక్షమహాసభవారి క్రిందితీర్మానానుసారముగా నేర్పాటు గావించిరి.

నెహ్రూ సంఘము

“భారతదేశమునకు తగిన రాజ్యాంగవిధానము యొక్క ప్రధానసూత్రములను బాగుగా నాలోచించి జులై 1 వ తారీఖులోగా మాకు నివేదించుటకు శ్రీయుత మోతీలాల్ నెహ్రూ (అధ్యక్షుడు), సర్ తేజబహద్దూర్ సప్రూ, సర్ ఆలీ ఇమామ్, శ్రీయుత ప్రధాన్, శ్రీయుత షుఆబ్ ఖురాషీ, శ్రీయుత సుభాష్ చంద్ర బోస్, శ్రీయుత మాధవరావ్ ఆనీ, శ్రీయుత ఎమ్. ఆర్. జయకర్, శ్రీయుత ఎన్. ఎమ్. జోషీ, సర్దార్ మంగళసింగు గార్లతోకూడిన సంఘము నొకదాని నేర్పాటుచేయుటకు సభవారు తీర్మానించుచున్నారు; తయారుచేసిన ముసాయిదా దేశములోని ముఖ్యసంస్థాపనలకు ఈ సంఘము

పంపవలెను; మరియు హిందూమహమ్మదీయ సఖ్యము విషయమున మద్రాస్ కాంగ్రెసు మహాసభవారు చేసిన తీర్మానమును, హిందూమహాసభ, ముస్లిమ్‌సమితి, సిక్కుసంఘము, ఢిల్లీ అఖిలపక్ష సమావేశమునందు పాల్గొనిన యితర రాజకీయసంఘముల తీర్మానములను ఇకముందు ఈసంఘమువారికి సూచింపబడు సలహాలను ఈసంఘము వారు సంపూర్ణముగా విచారింపవలెను; మరియు ఢిల్లీలో సమావేశమైన అఖిలపక్షసభవారిచే నేర్పాటుచేయబడిన వివిధోపసంఘముల సిఫారసులను తగురీతి నాలోచింపవలెను.

ఈసంఘమువారు తయారుచేసిన నివేదికనుచర్చించుటకు అఖిలపక్షమహాసభ మరల ఆగస్టు మొదటివారమున సమావేశమగును.

ఈసంఘమువారి కార్యక్రమమును వివరించుటకు పూర్వము సంఘనియామకమునకు కారణభూతములైన కొన్ని సందర్భములను క్లుప్తముగా తెల్పుట సంభావ్యము.

**క్లుప్తచరిత్ర**

డిసెంబరు 1926 సం.న గౌహాతీపట్టణమునజరగిన భారతజాతీయ మహాసభ కడుంగడు విషాదపరిస్థితుల యందు కూడెను. హిందువులకును మహమ్మదీయులకును



**గౌహాతికాంగ్రెసు మహాసభ**

మాననీయు డగు శ్రద్ధానందయోగి యొక కరకుతురకచే పొడిచిచంపబడె ననువార్త సభవారికిని దేశమునకును మితిలేనిసంతాపము కలుగజేసెను. మరియు దేశమందంతటను ప్రబలిన హిందూమహమ్మదీయవైషమ్యములు తీక్ష్ణరూపమునుదాల్చి ప్రజల నట్టుడికిన ట్లుడికించెను. ఈ పరిస్థితులయందు సమావేశమైన మహాసభ హిందువులకును మహమ్మదీయులకును పొత్తు కుదుర్పుటకై యీక్రింది తీర్మానము చేసెను.

'జాతీయమహాసభా కార్యనిర్వాహకవర్గమువారు హిందూమహమ్మదీయ నాయకులతో సంప్రతించి విషాదకరములయిన ప్రస్తుతవైషమ్యములను మాన్పుటకు తగిన కర్తవ్యములను సూచించి, 1927 సం.ము మార్చి 31 వ తారీఖులోగా అఖిలభారత కాంగ్రెసుసంఘమువారికి నివేదికను సమర్పింపవలెను.'

ఈ యాజ్ఞలకుబద్ధుడై జాతీయమహాసభాధ్యక్షుడును కార్యనిర్వాహకవర్గమువారును చాలమంది హిందూమహమ్మదీయ నాయకులను, శాసనసభ్యులను కలసికొని సంప్రతించిరి.

1927 సం.రం మార్చి 20 వ తారీఖున కొందరు మహమ్మదీయప్రముఖులు ఢిల్లీలో సభ గావించి హిందూ

మహమ్మదీయుల పరతులు

సోదరులయొప్పుదలకై కొన్ని తీర్మానములను గావించుకొనిరి. 'ముస్లిమ్ పరతు' లని ప్రసిద్ధిగాంచినయీతీర్మానములయందు అన్ని రాష్ట్రీయశాసనసభలలోను, భారత శాసనసభలోను సంయుక్తనియోజక వర్గముల పద్ధతి యీక్రిందిపరతులకు లోబడి ఆమోదింపబడెను.

(1) సింధు ప్రత్యేకరాష్ట్రముగా చేయబడవలెను.

(2) పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రము, బెలుచిస్థానము ఇతరరాష్ట్రములతోపాటు పరిగణింపబడవలెను.

(3) పాంచాలము నందును, వంగదేశమునందును ప్రాతినిధ్యము జనసంఖ్యనుబట్టి యుండవలెను.

(4) భారతశాసనసభ్యుల మొత్తము సంఖ్యలో మహమ్మదీయప్రతినిధులసంఖ్య మూడవ వంతునకు తగ్గియుండరాదు.

ఈ పరతులు కాంగ్రెసునకు పంపబడినతోడనే, కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గమువారాలోచించిసంయుక్తనియోజకవర్గసిద్ధాంతమును మహమ్మదీయు లామోదించినందులకు వారిని ప్రశంసించుచు త్వరలో బద్ధసఖ్యము కుదురునని యాసించిరి. హిందూమహమ్మదీయ నాయకు



లతో సంప్రతించుట కొరక ఉపసంఘమునుకూడ వారేర్పాటు గావించిరి.

కాంగ్రెసుకార్య నిర్వాహకవర్గము

జాతీయమహాసభా కార్యనిర్వాహకవర్గమువారు 1927 సంవత్సరము మే 15 నుండి 18 వ తారీఖువరకు బొంబాయిలో మరలనొకసభ గావించి హిందూ మహమ్మదీయ సఖ్యమును గురించి పెద్దతీర్మానమును జేసిరి. మహమ్మదీయులపరతులపై నిది యాధారపడియుండెను, గాని అంతకంటె వివరముగా నుండెను. మరియు కొన్ని ఇతర విషయములుగూడ నీతీర్మానములో చేర్పబడెను.

అఖిలభారత కాంగ్రెస్ సంఘము

ఆతారీఖులనే బొంబాయిలో సమావేశమైనఅఖిల భారతకాంగ్రెసుసంఘము ఆ తీర్మానములనే కొలది మార్పులతో నంగీకరించెను. సింధు రాష్ట్రవిభజన సాంఘిక ప్రాబల్యము మీద నాధారపడక, అన్నిరాష్ట్రములకును వర్తించువిశాలజాతీయభావముమీద నాధారపడవలె నని సభలో నున్న హిందూనాయకులపక్షమున మార్పు కోరబడెను. తీర్మానములోని పదములను సవరించుటవలన హిందూమహాసభా ప్రతినిధుల యభ్యంతరము తొలగెను. తీర్మాన మేకగ్రీవముగా నంగీకరింపబడెను.

ఈఅఖిలభారతకాంగ్రెసుసంఘసభలోనే స్వరాజ్య విధానము నొకదానిని నిర్మించుటకొకసంఘమును స్థాపింప వలె నని ప్రప్రథమమున తీర్మాన మామోదింపబడెను. ఆతీర్మాన మిట్లున్నది.

"భారతశాసనసభయందు గల ప్రజా నియోజిత సభ్యులతోడను, రాష్ట్రీయశాసనసభ్యులతోడను వివిధ పార్టీ నాయకులతోడను, కలసి సంప్రతించి సార్వజనిక హక్కులపై నాధారపడియుండెడు స్వరాజ్యవిధానమును నిర్ణయించుటకు ఈసభవారు కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారిని కోరుచున్నారు."

1927 వ సంవత్సరము అక్టోబరులో అ.భా. కాం. సంఘము హిందూమహమ్మదీయ సఖ్యమునుగురించి మరి యొక తీర్మానమును గావించెను గాని యది సాంఘిక మతవిషయములను గురించిన దయి యుండెను.

చెన్నపట్టణమున జరగిన కాంగ్రెసు మహాసభ హిందూమహమ్మదీయసమస్యను సమగ్రముగా నాలోచించి, ఈ రెండు మత సంఘముల రాజకీయ సాంఘికహక్కులను గురించియు, ఇతర హక్కులను గురించియు పెద్దతీర్మానము చేసెను. ఆసంవత్సరమునందే అంతకు

మద్రాసుకాంగ్రెసు స్వరాజ్య విధానము



పూర్వము అ. భా. కా. సంఘము నిర్వచించిన సిద్ధాంత మున కనుగుణముగా మద్రాసు కాంగ్రెసు తీర్మానము తయారుచేయబడెను. స్వరాజ్యవిధానమును తయారు చేయువిషయమున మహాసభ యీక్రింది తీర్మానమును ఆమోదించెను.

"దేశమునం దన్ని రాజకీయ పక్షములవారును ఏకమై స్వరాజ్యవిధానము నొకదానిని నిర్మింపవలె నని కోరుచున్న కోర్కెను గమనించియు, కాంగ్రెసువర్కింగు కమిటీవారివిషయమున పంపిన ప్రశ్నపత్రమునకువచ్చిన ప్రత్యుత్తరములను,సూచనలను, చిత్తువిధానములనుబాగు గా నాలోచించియు, ఈమహాసభవారు కాంగ్రెస్‌కార్య నిర్వాహకవర్గమువారి నొకస్వరాజ్యవిధానమును తయారు చేయవలసినదిగా కోరుచున్నారు. ఈ ప్రయత్నములో కార్యనిర్వాహకవర్గమువా రితర సభ్యులను చేర్చుకొన వచ్చును. దేశములో రాజకీయ,సాంఘిక,వాణిజ్య,కార్మిక ప్రతిష్ఠాపనలతో నవశ్యము సంప్రతింపవచ్చును. సార్వ జనిక హక్కులమీద నాధారపడియుండు నీస్వరాజ్య విధానమును మార్చిలోగా ఢిల్లీనగరమున గాని, యితర నిర్ణీతస్థలమునందు గాని అఖిలభారతకాంగ్రెస్‌సంఘసభ్య లును, పైనుదాహరింపబడిన సంస్థలప్రతినిధులును,భారత శాసనసభలలోను, రాష్ట్రీయసభలలోనుగలప్రజానియో

జితసభ్యులును కలసిన సభాముఖమున చర్చించుటకు నివేదింపవలెను.

కాంగ్రెసుమహాసభవారీతీర్మానము నామోదించినవెంటనే ఇండియన్ లిబరల్ ఫెడరేషన్ వార్షిక సమావేశము బొంబాయినగరమున జరగినప్పుడు ముస్లిమ్ షరతులకు కారణభూతులగు ప్రముఖులను అభినందించుచు ఈక్రిందితీర్మానము ఆమోదింపబడెను.

"హిందువులకును మహమ్మదీయులకును కలిగిన తీవ్రవిభేదములను తొలగించి సమరసభావమును కలుగజేయుటకు ఆతురతచూపిన మహమ్మదీయప్రముఖులనీసభవా రభినందించుచున్నారు. మరియు నీ ప్రణాళికలోని షరతులను సమరసభావమున చర్చించి ఒడంబడిక కుదుర్చుటకై త్వరలో నీసంఘములచే నెన్నుకొనబడిన ప్రతినిధులసభ జరగవలె నని యీ సభవారు సూచించుచున్నారు."

మితవాదులీతీర్మానమును జేసిన కొలదిరోజులకు ముస్లిమ్ సమితివారు కలకత్తానగరమున సమావేశమై భారతజాతీయ మహాసభా కార్యనిర్వాహక వర్గమువారితోడను, ఇతర ప్రతిష్ఠాపనల ప్రతినిధులతోడను కలసి సంప్రతించి మహమ్మదీయుల హక్కులు సంరక్షింపబడు



విధమున పైనజెప్పిన ఢిల్లీషరతుల ననుసరించి యొక స్వరాజ్యవిధానమును తయారుచేయవలసినదిగా తమ కార్యనిర్వాహకవర్గమువారిని కోరిరి.

ఆహ్వానింపబడిన సంస్థలు

మద్రాసు కాంగ్రెసు తీర్మానానుసారముగా కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారు భారతదేశమునందలి వివిధప్రతిష్ఠాపనల నాహ్వానించుచు లేఖలనంపిరి. వానిలో కొన్నింటి నీక్రింద నిచ్చుచున్నాము.

మితవాదులసభ (లిబరల్ ఫెడరేషన్)
హిందూమహాసభ
అఖిలభారతముస్లిమ్‌సమితి
కేంద్రఖిలాఫత్ సంఘము
కేంద్రసిక్కు సంఘము
అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్
బర్మీస్ సంఘము
హోమ్‌రూల్ లీగ్
రిపబ్లికన్ లీగ్
భారతశాసనసభలో జాతీయవాదుల పక్షము
భారతశాసనసభలో స్వతంత్రపక్షము
భారతసంస్థానప్రజలసంఘము
భారతసంస్థానప్రజల మహాసభ

భారతసంస్థాన పీపిల్సుసంఘము
ఆంగ్లోభారతసంఘము
కలకత్తాభారతసంఘము
పార్సీకేంద్రసంఘము
జొరాస్ట్రియన్ సంఘము
పార్సీరాజకీయసభ
పార్సీ పంచాయతీ
భారతక్రైస్తవుల అఖిలభారతసభ
దక్షిణభారత వాణిజ్యసంఘము
ద్రావిడ మహాజనసభ
అయోధ్య, ఆగ్రా, బీహార్,
బెంగాల్, మద్రాస్ భూస్వాముల సంఘములు.

దరిమిలాను బొంబాయి సభాసమావేశకాలమున బొంబాయి బ్రాహ్మణేతర పక్షమువారికిని, జాతీయ బ్రాహ్మణేతరపక్షమువారికిని, బొంబాయి కమ్యూనిస్టు పార్టీకిని, బొంబాయి కర్షక కార్మిక పక్షమువారికిని ఆహ్వానము లంపబడెను.

ఢిల్లీ అఖిలపక్ష మహాసభ

వీనిలో చాలవరకు ఢిల్లీలో 1928 వ సంవత్సరం ఫిబ్రవరి 12 వ తారీఖున జరగినసభకు ప్రతినిధుల నంపెను. ఈసభ ఫిబ్రవరి 22 వ తారీఖువరకు సమావేశమై అనేక విషయములను చర్చించెను.



భారతదేశమున కెట్టి రాజ్యాంగవిధాన మవసర మను ప్రశ్నను సభవారు ప్రప్రథమమున చర్చించిరి. సభలో నున్నకొందరు అధినివేశప్రతిపత్తిని స్థాపించుట యోగ్య మనిరి. మరికొందరు మద్రాస్ కాంగ్రెస్ మహాసభ సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మాన మామోదించినదిగనుక దాని నాధారము చేసికొని రాజ్యాంగ విధానమును నిర్మింపబూనుట సమంజస మని తలచిరి. కాని అంతటి యున్నతాశయము నను సభలోని అన్నిపక్షములవారును అంగీకరింపజాల మనిరి. కావున నీరెండు పక్షములవారికిని ఇష్టమగువిధమున నొక మధ్యమార్గము కనిపట్టుట యవసరమయ్యెను. డొమినియన్ ప్రతిపత్తికిని సంపూర్ణ స్వాతంత్ర్యమునకును ఎంతో తారతమ్యము లేదు. మొదటిది రాజుగారి యధికారము నొప్పుకొనును. రెండవది రాజుగారితో అవసరము లే దనును. కార్యనిర్వాహకవర్గమునందే వీనికి నిజమయిన భేదము కలదు. ఈ కార్యనిర్వాహకవర్గము యొక్క స్వరూపమును నిర్ణయింపకుండ భారతదేశరాజ్య విధానముయొక్క సామాన్యసూత్రములను నిర్ణయించుట సభవారికి సమంజస మని తోచెను. కావున సంపూర్ణ స్వాతంత్ర్యవాదులు తమ ప్రచార కార్యక్రమమును సాగించునట్లును, అధినివేశ స్వాతంత్ర్యవాదులు తత్సిద్ధికై ప్రయత్నములు సల్పునట్లిద్దరు నంగీకరించి 'సంపూ

బాధ్యతాయుత ప్రభుత్వము' స్థాపింపవలె నని తీర్మానించిరి. సభవారి ప్రథమతీర్మాన మి ట్లున్నది:—

'భారత దేశమునకు నిర్ణయింపబడు ప్రభుత్వము సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వమై యుండవలెను.'

మరియు ఢిల్లీ అఖిలపక్ష మహాసభవారు రాష్ట్ర పునర్నిర్మాణమును గురించియు, నియోజక వర్గములను గురించియు, సభ్యత్వస్థానముల ప్రత్యేకించుటను గురించియు తీర్మానముల నామోదించిరి. 1928 సం.ము ఫిబ్రవరి 22 వ తారీఖున మహాసభ యీ క్రింది విషయములను గురించి విచారించి నివేదించుట కొక సంఘమును నియమించెను. (1) రాజ్యాంగవిధానములో ఒక శాసనసభ చాలునా, రెండు శాసనసభ లుండుట యవసరమా? (2) వోటింగు అధికార మెవ్వరి కుండవలెను (3) సార్వజనికహక్కుల నిర్ధారణ (4) కార్మికులయొక్కయు, కర్షకుల యొక్కయు హక్కులు (5) భారతసంస్థానములతో సంబంధము.

ప్రథమసంఘము

ఈ సంఘముపై కార్యభార మంతయు మోపి మహాసభ తాత్కాలికముగా విరమించెను. ఈసంఘము గూడ నిర్ణీతసమయములోగా వారి నివేదికను మహాసభవారికి సమర్పించెను. దీనిని చర్చించుటకై అఖిల



పక్షమహాసభ ఢిల్లీలో 1928 సం.ము, మార్చి 8-వ తారీఖున సమావేశమయ్యెను. ఇంతలో ముస్లిమ్‌సమితి యొక్క కార్యనిర్వాహకవర్గము సభ గావించి అఖిలపక్ష మహాసభవారి నిర్ణయములను త్రోసివైచెను. ఇంతటితో తృప్తినొందక వీరు కలకత్తా ముస్లిమ్‌సమితిసభలో కావించిన తీర్మానముల నన్నిసంస్థలును ఆమోదించునట్లు తమ ప్రతినిధులు ప్రచారము చేయవలె ననియు, రాజ్యాంగ విధాన నిర్మాణమునకు గడంగుటకు పూర్వము తమకృషి యొక్క ఫలితమును ముస్లిమ్‌సమితి కార్యనిర్వాహక వర్గమునకు నివేదింపవలె ననియు తీర్మానించిరి.

ముస్లిమ్‌సమితియొక్క యీ తీర్మానము అఖిల పక్షమహాసభవారికి ప్రతిబంధక మయ్యెను. ఆ తీర్మానానుసారముగా, వారి యితర సూచనలు సంపూర్ణముగా నొప్పుకొనబడినగాని, మరల సమితి కార్యనిర్వాహకవర్గమువారితో సంప్రతించినగాని సంఘము నివేదిక నాలోచింప వీలులేదని స్పష్టముగా నుండెను.

ఈపరిస్థితులలో 1928 వ సంవత్సరము మార్చి 8వ తారీఖున అఖిలపక్ష మహాసభ సమావేశమయ్యెను. సాంఘిక ప్రాతినిధ్యము విషయమున వివాదము హెచ్చుగా జరగెను. హిందూ మహాసభవారును, ముస్లిమ్ సమితివా

మార్చి 8 వ తేదీ మహాసభ

రును సింధురాష్ట్ర విభజనను గురించియు, అధిక జనసంఖ్యాకసంఘములకు స్థానములను ప్రత్యేకించుటనుగురించియు నొకతీర్మానమునకు వచ్చుటకు వీలు లేకపోయెను. సిక్కులుగూడ రెండవదానికి అనంగీకారమును జూపిరి. కావున మార్చి 11 వ తారీఖున మహాసభ రెండు ఉపసంఘముల నేర్పాటు గావించెను. మొదటియుపసంఘము సింధురాష్ట్రమును బొంబాయినుండి విభజించినయెడల వచ్చు ఆర్థికచిక్కులను వివరించి వానినిపరిష్కరించుటకు ఉపాయములను జూపుటకును, రెండవది దామాషాపద్ధతిమీద ప్రాతినిధ్య (Proportional Representation) మెంతవరకు వీలగునో నిర్ణయించుటకును నై యుండెను.

ఫిబ్రవరి 22 వ తారీఖున నిర్ణయింపబడినసంఘము వారి నివేదికను మహాసభ యాలోచించుటకు ముస్లిమ్ సమితితీర్మానము ప్రతిబంధక మయ్యెను. కావున నివేదికనుమాత్రము ప్రచురించి దానియొక్క ప్రతులను సభాప్రతినిధులకు పంచిపెట్టవలెనని నిర్ణయించిమహాసభమరల సమావేశమగుటకు 1928 వ సం.రం మే 19 వ తారీఖును వాయిదా వేసికొనెను.

ఏప్రియల్ మొదటివారములో హిందూమహాసభ జబల్ పురమున సమావేశమై ముస్లిమ్‌సమితివారి షరతులకు విరుద్ధమగు తీర్మానముల నామోదించెను.



బొంబయి అఖిల పక్షసభ

తీవ్రసాంఘిక వివాదముల తోడను చిక్కుల తోడను దట్టముగా నావరింపబడి భారతరాజకీయాకాశమున తెన్నుగానని పాంథులకు దారి చూపు విద్యుల్లత యొక్కయైనను లేని యీ విషమసమయమున మే 10 వ తారీఖున బొంబాయిలో అఖిలపక్ష మహాసభ మరల సమావేశమయ్యెను. హిందువులును మహమ్మదీయులును తమ కోర్కెలను రేఖామాత్రమైనను తగ్గించుకొన నిచ్చగింపలేదు. ఈ నిరుత్సాహమునకు తోడు ఢిల్లీలో సింధు విభజనమును గురించియు, దామాషాపద్ధతిని ప్రాతినిధ్యమును గురించియు విచారించుట కేర్పరుపబడిన సంఘములు నివేదికలను పంపలేదు.

ఇట్టి తరుణమున వివిధమతములకును వివిధపక్షములకును సామరస్యము కుదురుట దుర్ఘటముగా నగపడినందున, సాంఘిక సమస్యలను సమగ్రముగా నాలోచించి భారత రాజ్యాంగమున వివిధమతములవారికిని తగిన స్థానమును నిర్ణయించుటకు అన్నిపక్షముల ప్రతినిధులును కలసిన చిన్నసంఘ మొకటి తోడ్పడవచ్చు నని సభవారికి తోచెను. అందువలన ఈ నివేదికప్రారంభమున నుల్లేఖింపబడిన తీర్మానము అప్పుడు చేయబడెను.

సంఘము బాగుగ్గా పనిచేయవలె ననిన నంతపెద్దదిగా నుండరాదుగదా! కనుక దేశములో నన్ని సంఘముల ప్రతినిధులును దీనిలో నుండుటకు వీలు లేకపోయెను. ఐనను దేశములోని ముఖ్యపక్షముల నాయకులను దీనిలో చేర్చుటకు ప్రయత్నము జరగెను. సర్ ఆలీ ఇమామ్, షు ఆబ్ ఖురాషీగార్లు మహమ్మదీయాభిప్రాయమును వ్యక్తపరచుటకు నియోగింపబడిరి; ఎమ్. ఆర్. జయకర్, ఎం. ఎస్. ఆనీగార్లు హిందువుల యభిప్రాయమును; జి. ఆర్. ప్రధాన్‌గారు బ్రాహ్మణేతరాభిప్రాయమును; సర్దార్ మంగళసింగుగారు సిక్కుసమితిని; సర్ తేజబహద్దూర్ సప్రూగారు జాతీయపక్షమును; ఎన్. ఎమ్. జోషీగారు కార్మికపక్షాభిప్రాయమును వ్యక్తపరుచుటకు నియోగింపబడిరి.

నెహ్రూసంఘము

సభవారెన్నుకొనినపదిమంది సభ్యులలో జయకర్‌గారు తాము సభ్యుడుగా నుండుటకు వీలు గాదనిరి. కార్మికుల హక్కులను గురించి యాలోచించినప్పుడు మాత్రము సభలో నుండుటకు తనకు వీలగునని జోషిగారనిరి. ఇట్లు చెప్పినను వారొక్కసభలోనైనను పాల్గొనజాలకపోయిరి. జబ్బువలన సర్ ఆలీ యిమామ్‌గారు ఒక్క సభకుమాత్రమే రాగలిగినను, మా కా సమయ



మున చాల తోడ్పడెను. అప్పుడప్పుడు మేము వారిని సందర్శించి మా సందేహములను బాపుకొనుచుంటిమి. ప్రధాన్‌గారు జూన్ 12 వ తారీఖువరకు జరగినసభలలో మాత్రము పాల్గొనిరి.

ఆలస్యమునకు కారణములు

జులై 1 వ తారీఖులోగా నివేదికను తమకు సమర్పింపవలసిన దని మహాసభవా రాజ్ఞాపించిరి. మేమును సకాలమున విచారణను పూర్తిచేయుటకు మాచేతనైనన్ని ప్రయత్నములను జేసితిమి. కాని నిర్ణీతకార్యక్రమము ననుసరించుట మిక్కిలి దుర్ఘటమయ్యెను. జూన్ 5 వ తారీఖునుండి విచారణ పూర్తియైనదాక మేము ప్రతిరోజును సమావేశమై చాలకాలము చర్చించితిమి. ఇతర పెద్దలతో సంప్రతించుట గాక 25 సభలను గావించితిమి.

సంపూర్ణస్వాతంత్ర్యమా? అధినివేశ ప్రతిపత్తియా?

మాసంఘము చిన్నదైనను దానిలో వివిధ రాజకీయ పక్షముల నాయకులును, వివిధమతముల ప్రతినిధులు నుండిరి. దేశములో వివిధ ప్రతిష్ఠాపనలు చేసిన విరుద్ధతీర్మానములను బాగుగా నాలోచించి సమన్వయము చేసి యందరకు నిష్టమగు రాజ్యాంగ విధానమును తయారుచేయవలసిన దని మమ్ములను నియమించుచు నిచ్చిన యాజ్ఞాపత్రములో నుండెను. కాని

సంపూర్ణముగా కాకపోయినను కొంతవరకైనను ఒడంబడిక కుదురుటకు రెండు ప్రబలప్రతిబంధకము లుండెను. వీనిలో మొదటిది కాంగ్రెసువారును, ఇతర పక్షములవారును చేసిన తీర్మానములు. మద్రాసులో కాంగ్రెసు మహాసభ సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానము నామోదించెను. ఇతరసభలు అధినివేశప్రతిపత్తి కావలె నని తీర్మానించెను. రెండవప్రతిబంధక మే దనగా వివిధసంఘములవారు దేశక్షేమకరము లగు మార్గముల నాలోచింపక తమతమ సంఘముల ప్రత్యేకపు హక్కులకొరకు ప్రయత్నించుచుండిరి.

వీనిలో మొదటిదానిని మేము ప్రప్రథమముననే పరిష్కరింపవలసినవార మైతిమి. అధినివేశప్రతిపత్తియా? సంపూర్ణస్వాతంత్ర్యమా? అను విషయమును సభవారు స్పష్టము చేయవలసినయవసరమును తప్పించుకొనుటకై ఢిల్లీఅఖిలపక్షమహాసభలో రెండు విధముల నర్థము చేయదగిన 'సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వము' అను పదమును వాడిరి. ఈ విషయము మొదట తేలినగాని చిత్తురాజ్యాంగ విధానము యొక్క ప్రాతిపదికనుగూడ నిర్ణయింపవీలులే దని సంఘమువారు తలచిరి. కొందరు సభ్యులు ఢిల్లీలో నవలంబించిన పద్ధ

సంపూర్ణస్వాతంత్ర్యమును అధినివేశ ప్రతిపత్తియు



తినే యవలంబించుట మేలనిరి. కాని యధికసంఖ్యాకులు మొదట దీనిని నిర్వచించి తరువాత నితరపనిని ప్రారంభించుట యుక్తమని తలచిరి. ఇన్ని పక్షములవారు, ఇన్ని మతములవారు పాల్గొనుచున్న సంఘములో నందరకు ఇష్టమైనది అధినివేశప్రతిపత్తియే. వేరొక ఆశయము నందరు నొప్పుకొనజాలకపోయిరి. కావున అఖిలపక్షమహాసభవా రుపయోగించిన 'సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వముపై నాధారపడిన రాజ్యాంగవిధానము' అనువాక్యమునకు అధినివేశ స్వతంత్ర రాజ్యములవంటి రాజ్యవిధానమని సంఘమువారు వ్యాఖ్యానము చేయవలసి వచ్చెను. మే మీ గ్రంథములో ప్రతిపాదించిన సూత్రములు అధినివేశస్వతంత్రరాజ్యమునకే తగియున్నవి. అయినను వానిలో చాలవరకు సంపూర్ణ స్వతంత్రరాజ్యమునకుగూడ అనువర్తించును. మే మొక సంఘముగాగూడి యీ రాజ్యాంగవిధానమును నిర్ణయించుటవలన భారతదేశములో నందరకు వాంఛనీయమైన గరిష్ఠవిధానమునే నిర్ణయించితి మని యూహింపవలయును గాని, మా సంఘములోని కాంగ్రెసువాదులు గాని, కాంగ్రెసు మహాసభవారుగాని తమగమ్యస్థానమును సంకుచితపరచుకొనిరని యూహింపజనదు. సంపూర్ణస్వాతంత్ర్యమే భారతీయుల యాశయ మని నమ్మువారు దానికై ప్రయత్నించుటకు

సంపూర్ణమైన హక్కు గలిగియున్నారు. ఇట్లన్ని పక్షముల వారు కలసి సంప్రతించి నిర్ణయించిన సర్వపక్షసమాదరణీయమైన గరిష్ఠాశయమును భారతీయులందరుభావిభారత రాజ్యాంగమునకు ప్రాతిపదికగానంగీకరించితద్విధానమున పాల్గొని జయప్రదముగాకొనసాగించెద రని నమ్ముచున్నాము. దీని నొప్పుకొనుటవలన ప్రత్యేకవ్యక్తులును,సంఘములును తమ స్వతంత్రాభిప్రాయములను,మహదాశయములను, సంకుచితపరుచుకొన నవసర మేమాత్రము లేదు.

సాంఘిక విభేదములు

భారతరాజ్యాంగ పునర్నిర్మాణమునకు సాంఘిక విభేదములు నిజముగా ప్రబల ప్రతిబంధకములు కావు. స్వల్పవిషయము లయ్యు నివి మహత్తరమైన సమస్యలకన్న విస్తారముగా సామాన్య ప్రజల దృష్టి నాకర్షించి రాజకీయాభివృద్ధి కాటంకము లగుచున్నవి. ఇందువలన పరస్పరవిరుద్ధములగు తీర్మానములు, సిఫారసులు, లక్షోపలక్షలు మనకంటబడుచున్నవి. అన్నిటినిమనము మన్నింపవలసినదే. కాని మద్రాసుకాంగ్రెసు, ముస్లిమ్‌సమితి తీర్మానములు హిందూమహాసభ, సిక్కుసమితి తీర్మానములకు విరుద్ధములుగా నున్నప్పుడు వీనిలో మనము వేనిని గ్రహింపవలెను; వేనిని త్రోసివేయవలెను? వేనిని కూడ సంపూర్ణముగా గ్రహించుటకు వీలు లేదు. ఈ పర



స్పరవిరుద్ధము లగు ననేక తీర్మానముల నాలోచించి భారత దేశమునకు తగిన రాజ్యాంగ విధానమును తయారుచేయు మని మహాసభవారు మమ్ము కోరుటవలన మాస్వబుద్ధిని, విచక్షణతాజ్ఞానమును బాగుగా నుపయోగించి, అందరి హక్కులను రక్షించు ప్రణాలికను నిర్ణయింపవలసినట్లు స్పష్టమగుచున్నది. మాసిఫారసు లెంతప్రశస్తములైనను, ఎంత యాచరణ యోగ్యములైనను దేశములో ముఖ్యపార్టీల యామోదము పడయనిది వ్యర్థము లేకదా! కావున పరిస్థితులను చక్కగా విచారించి అందరకు అనుకూలమగు ప్రాతిపదికను నిర్ణయించుటమీదనే రాజ్యాంగ నిర్మాణముయొక్క విజయ మాధారపడి యుండును. ఈ ప్రాతిపదికను నిర్ణయించుటకు సంఘమువారు చాల కృషి సల్పిరి. అనేక హిందూ మహమ్మదీయ నాయకుల సలహాలను పుచ్చుకొనిరి. ఈప్రముఖులు మాయధ్యక్షుని యాహ్వానముపై సభకు దయచేసి యనేకవిధముల తోడ్పడి యమూల్యదేశోపకార మొనర్చిరి. మాకృషియొక్క ఫలితము ముందు అధ్యాయములలో పొందుపరచుచున్నాము. దేశమునం దన్ని పక్షములు దీని నుదారబుద్ధితో గ్రహించి అన్యోన్య కలహములవలనను, అవిశ్వాసములవలనను అధోగతియందున్న భారత దేశమును పునరుద్ధరించెద రని కోరుచున్నాము.

వందనములు

అధ్యక్షుని యాహ్వానమును శిరసావహించి వచ్చి మా కత్యంతము తోడ్పడిన శ్రీయుత డాక్టరు అన్సారీ, పండిత మదనమోహనమాలవ్యా, మౌలానాఅబ్దులు కలమ్అజద్, సి. వై. చింతామణి, మౌల్విషాఫీదావూదీ, డాక్టర్ ఎస్. డి. కిచ్లూ, సచ్చిదానందసింహా, మున్షీ ఈశ్వరశరణ్, డాక్టర్ ఎస్. మహమ్మద్, చౌదరీ ఖలీఖజ్ జమాన్, టి. ఎ. కే. షేర్వానీగార్లకు మావందనము లర్పించుచున్నాము. కాంగ్రెస్ అధ్యక్షుడగు డాక్టరు అన్సారీగారు మూడుసార్లు మావద్దకు వచ్చి, మాకు చిక్కులు సంభవించినప్పు డెల్ల చాల సాయపడినందులకు ప్రత్యేకముగా మేము వారి నభినందింపవలసి యున్నది. కాంగ్రెస్ మహాసభా కార్యదర్శి మేము విచారణ జరపినంత కాలము మావద్దనే యుండి, కావలసిన వివరములను దెల్పుచుండెను. అనుబంధమున ముద్రింపబడినవివరములను తయారుచేయుటయే కాక సంఘమున కనేకవిధముల తోడ్పడి కృతకృత్యులైన జవాహర్లాలుగారికి మామనఃపూర్వక వందనము లర్పించుచున్నాము.

---

# రెండవ యధ్యాయము

---

సాంఘికసమస్య

భారతదేశమున ప్రధానసాంఘికసమస్య హిందూమహమ్మదీయ సమస్యయే. ఇతరసంఘములును ఇటీవల స్వలాభాపేక్షచే ప్రత్యేకపు హక్కులను, రక్షణములను అడుగుచున్నవి. అల్పసంఖ్యాకులలో పాంచాలమునదలి సిక్కుసంఘము ప్రాముఖ్యమును వహించినది. వీరి హక్కులను గమనింపకుండజాలము. దక్షిణాపథమున హిందువులలో బ్రాహ్మణులును, బ్రాహ్మణేతరులును తగవు లాడుకొనుచుండెదరు. ఇట్టిసమస్య లున్నను మహమ్మదీయులకును, హిందువులకును గలిగిన భేదభావములను పోగొట్టి సఖ్యము కుదుర్చుటయే ప్రధానవిషయము. ఈ రెండుసంఘములు కలసి భారతదేశమున నూటికి 90 వంతు లున్నారు. 1921 సంవత్సరపు జనాభా ప్రకారము వివిధసంఘములవారు ఈ క్రిందివిధమున నుండిరి.

| | | |
|---|---|---|
| హిందువులు | నూటికి | 65.9 |
| మహమ్మదీయులు | ,, | 24.4 |

| | | |
|---|---|---|
| బౌద్ధులు (బర్మాలో) | నూటికి | 4.6 |
| కొండజాతులవారు | ,, | 2.8 |
| క్రైస్తవులు | ,, | 1.2 |
| సిక్కులు | ,, | 1.2 |
| జైనులు | ,, | 0.2 |
| ఇతరులు | ,, | 0.2 |
| | | 100.0 |

అంతకు పూర్వము తీసికొనబడిన జనాభా లెక్కలనుబట్టి చూచిన హిందువులును, జైనులును క్రమముగా తగ్గుచుండగా నితరవర్ణములవారు క్రమముగా హెచ్చుచు వచ్చిరని తెలియగలదు. మహమ్మదీయులు చాల హెచ్చు కాలేదు కాని క్రమముగా నభివృద్ధి యగుచువచ్చిరి. 1881 సంవత్సరమునుండి యిప్పటివరకు నీ రెండుసంఘములలో కలిగిన యభివృద్ధి క్రిందిపట్టికవలన తెలిసికొనదగును.

| | 1881 | 1891 | 1901 | 1911 | 1921 | |
|---|---|---|---|---|---|---|
| హిందువులు | 72.0 | 70.1 | 68.3 | 66.9 | 65.9 | —6.5 |
| మహమ్మదీయులు | 72.6 | 22.4 | 23.2 | 23.5 | 24.1 | +1.1 |

భారత దేశముయొక్క మొత్తము జనాభానుబట్టి యా సంఖ్యలు నిర్ణయింప బడినవి. మహమ్మదీయుల యభి



వృద్ధిని ప్రత్యేకముగా నాలోచించినచో వారు గతదశాబ్దములలో నూటికి 3.1 చొప్పున వృద్ధిమైరని తెలియగలదు. ఈ 10 సంవత్సరములలో హిందువులు కొంచెము తగ్గిరి.

పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రము, పాంచాలము, వంగదేశములలో తప్ప నితర రాష్ట్రము లన్నిటిలోను మహమ్మదీయులు అల్పసంఖ్యాకులై యున్నారు. తక్కువ మహమ్మదీయజనసంఖ్యగల యీరాష్ట్రము లన్నిటికంటె సంయుక్తరాష్ట్రములలో మహమ్మదీయులు హెచ్చుగా నున్నను, ఇచ్చటనైనను నూటికి 15 వంతులకన్న నధికము లేరు. వీరైనను ఆరాష్ట్రములలోని అన్ని భాగములలోను లేరు. ఉత్తరభాగమున పట్టణములలోనివసించుచున్నారు.

పాంచాలములో మహమ్మదీయులు నూటికి 55.3, వంగదేశములో నూటికి 54.0, సింధులో నూటికి 73.4, కలరు. పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రము, బెలుచిస్థానములలో చాలమట్టుకు వారే.

క్రొత్తగా భారతదేశమునకువచ్చి యీ జనాభా లెక్కలను పరిశీలించువారు మహమ్మదీయులు స్వయంరక్షణము చేసికొనగలస్థితియందున్నా రనియు నితరుల సాయముపై వా రాధారపడియుండ నవసరము లేదనియు తలతురు. నిజముకూడ నిదియే. భారతదేశములో న

సంఘములలోను రక్షణ యవసరము లేనివారు హిందువులును, మహమ్మదీయులును మాత్రమే. నూటికి 10 వంతుననున్న తక్కిన సంఘములకు రక్షణయవసరమా? లేక 90 వంతులున్న హిందువులకును మహమ్మదీయులకును రక్షణ మవసరమా?

కాని సాంఘికవివాదములలో న్యాయాన్యాయ, కార్యాకార్య విచక్షణాజ్ఞానము నశించును గదా! ఈ తగాయిదాలు ప్రస్తుతమున మన దేశమున కెట్టిదురవస్థను దెచ్చిపెట్టినవో చూడుడు. ఇతరసంఘములు తమ హక్కులకు భంగము కలుగజేయుదురను దురభిప్రాయముచే ప్రతి సంఘము ప్రత్యేకరక్షణలను కోరుచున్నది. ప్రజల మనములయందు పాదుకొనిన యీ దురభిప్రాయములను తొలగించుట కుపాయము లాలోచించుటయే ప్రస్తుత సమస్యమై యున్నది. సర్వాధికారములును తమకే యుండవలెననియు, నితరసంఘములను వెనుకకు ద్రోయవలెనను నుద్దేశముతో ప్రతిసంఘము ఆత్మరక్షణకై గగ్గోలుపెట్టుటయు, ఏసంఘమున కాసంఘము తన బాగును చూచుకొని పరశ్రేయమునకు భంగము కలుగజేయఁగూడ దను మతమును ఆయాసంఘనాయకులు అవలంబించియుండకపోవుటయుసంతాపకరము. విజ్ఞానస్వాతంత్ర్యముపై నాధారపడు రక్షణములే నిజమగురక్షణములు



గాని, ప్రత్యేకనియోజకవర్గములును, స్థానములను ప్రత్యేకించుటయును కృత్రిమరక్షణములు. అవి వాంఛనీయములుకావని మాయభిప్రాయము. ఈపద్ధతులవలన తాత్కాలికశాంతి యేర్పడినను స్థిరమగుశాంతి కలుగనేరదు.

మహమ్మదీయులు హిందువులకన్న తక్కువగానుండుటవలన నధికసంఖ్యాకులు తమ్ము బాధించెదరను అనుమానముచే వారొక వింతమార్గమును సూచించిరి. కొన్ని రాష్ట్రములలో హిందువులు హెచ్చుగను మరి కొన్ని రాష్ట్రములలో మహమ్మదీయులు హెచ్చుగానుండునట్లు రాష్ట్రవిభజనచేయుట సమంజసమనివారనిరి. వారి కోర్కుల నిచ్చుట మేము విమర్శింపము. ప్రస్తుత విపరీత సాంఘికపరిస్థితులలో నిట్టికోర్కులు ధర్మముగా నగపడవచ్చును. కాని మేము సూచించు పద్ధతులకును వీనికి నేయంతరమును లేదు. ఇతరులపై నధికారము చేయుటయే తగురక్షణమని తలచుచో నింతకంటె ప్రశస్తమైన పద్ధతి యుండబోదు. ఇతర రాష్ట్రములలో హిందువులు అధికసంఖ్యాకులుగా నున్నను, వంగదేశము, పాంచాలము, సింధు, బెలుచిస్థానము, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రములలో తక్కువగా నున్నారు. మొత్తముమీద తామ అధికముగానున్నను ఈ రాష్ట్రములలో మహమ్మదీయులవలన నేమికీడు మూడునో యని హిందువులు భయమందుచున్నారు.

ఒకసంఘ మింకొకసంఘముపై నధికారము నెరపుటకు మే మొప్పుకొనజాలము. దీనిని సంపూర్ణముగా నాపుచేయుట సాధ్యముకాకపోవచ్చును. కాని సాధ్యమైనంతవరకు ఒకరివలన నింకొకరి కిబ్బందులు కలుగకుండ చేయుటకు మేము ప్రయత్నించుటయవసరము. సంపూర్ణ మతస్వాతంత్ర్యమును, విజ్ఞానస్వాతంత్ర్యమును ప్రతిసంఘమునకు చేకూరెనేని సాంఘికసమస్య పరిష్కార మగుటకేసందియమును లేదు.

సంఘ సభలు

పై యుద్దేశములను మనమునం దిడుకొని మేము ఏడవ అధ్యాయమున నిర్వచించిన సార్వజనిక హక్కులలో ప్రతివ్యక్తికిని సంఘమునకును సంపూర్ణమతిస్వాతంత్ర్యమును, తమ స్వకీయాభిప్రాయములను ఉద్దేశములను బహిరంగముగా తెలుపుటకు సర్వస్వాతంత్ర్యము నొసగితిమి. పెద్దసంఘముల విజ్ఞానాభివృద్ధి నరయుచుండుసంఘసభ లుండుట శ్రేయస్కరమా యనుసూచన నొకదానినికూడ మేము చర్చించితిమి అది యేదన, 10 లక్షల జనాభాగల సంఘములకు కొన్ని నిర్ణీత ధర్మములను నిర్వర్తించుకొరకు 25 మంది సభ్యులకు హెచ్చుకాకుండ నొకసంఘ ముండవలెను. దాని కీ క్రిందియధికారము లుండవలెను.



(1) ప్రాథమిక విద్యాబోధను సక్రమ మార్గముల నడపుట. పాఠశాలలు, అనాథశరణాలయములు, ధర్మశాలలు, వసతిగృహములు, వితంతుశరణాలయములు మున్నగు సంస్థలను తనిఖీచేయుట.

(2) భాషలను, లిపులను అభివృద్ధి పఱచుట.

ఈ సంస్థలకు ధనసాహాయ్యమును, విద్యార్థి వేతనములను ఒసంగవలసిన దని ప్రభుత్వమువారి కీసంఘసభలు సిఫారసు చేయవచ్చును. రాష్ట్రీయప్రభుత్వములు గాని, కేంద్రప్రభుత్వము గాని శాసనసభలయంగీకారముపైని కావలసిన ధనసాహాయ్యము చేయవచ్చును.

ఈయధికారములుగల సంఘసభలు స్థాపింపబడిన యెడల విపరీతసాంఘికవైషమ్యములు తొలగి సవ్యమైన సాంఘికాభివృద్ధి కలుగు నేమో యని మాలో కొందర మభిప్రాయపడితిమి. కాని యితరసభ్యులును, మేము విచారించిన పెద్దలును, ఇట్టివి యెంతమాత్రమును పనికిరావనిరి. వీనివలన ప్రజలకు సాంఘికదురభిమాన మేర్పడు ననియు, జాతీయత కాటంకము గలుగు ననియు వారు తలచిరి. కావున నీ సూచనలను నిరాకరించితిమి.

ఇప్పుడు రాజకీయరంగములో సాంఘికసమస్యా పరిష్కారమున కాటకములుగానున్న నాల్గు విషయము

లను చర్చింతము. ఇవి(1)నియోజకవర్గములు(2) స్థానములను ప్రత్యేకించుట (3) సింధురాష్ట్రవిభజన(4) పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రములలోను, బెలుచిస్థానములోను ప్రభుత్వస్వరూపము.

ప్రత్యేక నియోజకవర్గములు హానికరములు

ప్రత్యేక నియోజక వర్గములు ప్రమాదకరములనియు, వానిని రద్దుచేయుట శ్రేయస్కర మనియు నందరును గ్రహించియే యున్నారు. కాని మహమ్మదీయులలో కొందరు వీనిని చాలలాభకరములని పట్టుకొని ప్రాకులాడుచున్నారు. మరికొందరు ఇతర శ్రేయములకై వీనిని వదలుకొన నిష్టపడుచున్నారు. ప్రత్యేకనియోజకవర్గములు జాతీయాభివృద్ధికి ప్రతిబంధకము లని యందరు గ్రహించినను అల్పసంఖ్య గల సంఘముల కివి యింకను హెచ్చుగా హానికరము లని యందరు నెరుంగరు. ఇవి అధికసంఖ్యాకులను అల్పసంఖ్యాకులతో నిమిత్తము లేనివారినిగా చేయును. కావున ఎల్లప్పుడు నధికసంఖ్యాకు లల్పసంఖ్యాకులకు వ్యతిరేకముగా సమ్మతుల నిచ్చుచుండుట సంభవించును. మనపక్షమున హెచ్చుజన మున్నారుకదా! ఈయల్పసంఖ్యాకులు మనల నేమి చే[illegible]ల రనుభావ మధికసంఖ్యాకసంఘమున కేర్పడుటవలన నెప్పుడును నీరెండుపక్షములకు సామరస్యము కలుగనేరదు. ప్రత్యేక నియోజకవర్గములవలన మనకు కలిగిన



యనర్థ మిప్పటికే వ్యక్తమయినది. కాని కీచులాడుకొనచున్న హిందువులకును, మహమ్మదీయులకును మధ్యవర్తులైన యాంగ్లేయుల సారథ్యమున నీ దుస్స్థితియొక్క నిజస్వరూపము పరిస్ఫుటము అగుటలేదు. ప్రత్యేక నియోజకవర్గము లెప్పుడును అధికసంఖ్యాకులకు లాభకరములు. కేవల స్వసాంఘికపక్షపాతులీపద్ధతివలన పెంపొందుచున్నారు. కాని వారి గర్జనలకు అధికసంఖ్యాకు లెన్నటికిని బెదరరు. వారికి నష్టమేమియు లేదు, లాభమే. కావున సరసమగు ప్రజాప్రతినిధిప్రభుత్వ ముండవలెనన్నచో ప్రత్యేకనియోజకవర్గములు రద్దు చేయబడవలెను. సంయుక్త నియోజకవర్గములే వాంఛనీయములు.

ఇటీవల సింహళద్వీపమునకు రాజ్యాంగవిధానమును నిర్ణయించుట కేర్పడిన సంఘ మాద్వీపమునగూడ నిట్టిసూచననే చేసియుండెను.

పశ్చిమోత్తరపరగణా, బెలుచిస్థానము

పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రములోను, బెలుచిస్థానమునను ఇతరరాష్ట్రములవంటి ప్రభుత్వ మేర్పాటు చేయవలె నని మాయభిప్రాయము. భారతదేశమునందలి రాష్ట్రమ[illegible]యు ప్రజాప్రతినిధిప్రభుత్వమున సమానముగా పాల్గొనవలె నని మాయుద్దేశము. అఖిలపక్ష

సమావేశమువా రిదివరకే దీని నొప్పుకొనిరి. ధర్మ మగు నీకోర్కె నెదిరించువారు హెచ్చుగా లే రని మాకు తెలియుచున్నది.

ఇంక మనము విచారింపవలసిన విషయములు రెండు కలవు. ఒకటి బొంబాయిరాజధానినుండి సింధును విభజించుట. రెండవది, శాసనసభలలో స్థానములను ప్రత్యేకించుటను గురించి. ఇవి యొకసంఘమునకు సంబంధించిన విషయములు మాత్రమే కావు; భారతీయు లందరకు సంబంధించినవిషయములు. వీనిలో శాసనసభ్యత్వ స్థానములను ప్రత్యేకించు విషయమును ముందరి అధ్యాయములో చర్చింపగలము. ప్రస్తుతము సింధురాష్ట్రవిభజనకు సంబంధించిన సాంఘికసమస్యనుగూర్చి వ్రాసెదము.

సింధురాష్ట్రవిభజనకు కారణములు

అనేక కారణములవలన సింధుదేశసమస్య మన రాజకీయములలో ప్రధానస్థానము నలంకరించుచున్నది. కొన్నిసంవత్సరముల క్రిందట సింధుదేశమును బొంబాయి రాష్ట్రమునుండి విడదీయవలె నని చెప్పినవారే యిప్పు డాటంకములను చెప్పుచున్నారు. ఇదివర కవసరము లే దనినవా రిప్పు డది తప్పక కావలె ననుచున్నారు. యావద్భారత దేశమును ఈ స్వల్పవిషయమున నాందోళనపడుచున్నది. ప్రజాభిప్రాయ మింత శీఘ్రముగను,



ఆశ్చర్యకరముగను మారుటవలన సాంఘికవైషమ్యములు ప్రజల విచక్షణతాజ్ఞానము నెట్లు వికృతి నొందింపగలవో స్పష్టమగుచున్నది. 1917 వ సంవత్సరమునభారతజాతీయ మహాసభ సింధును ప్రత్యేక రాష్ట్రముగా నొప్పుకొని నప్పటినుండియు మొన్నమొన్నటివరకు నది సమంజసముకాదని చెప్పినవారే లేరు. తీవ్రసాంఘికదూషణము, ప్రతిదూషణము, ప్రబలిన యీరోజులలో నీ వాదోపవాదముల నసలే పాటింపక సమస్యను సాధ్యమైనంత నిష్పాక్షికబుద్ధితో విచారించుటకు ప్రయత్నించుటయే సవ్యమగుమార్గము. కాని దురదృష్టవశమున ప్రజల మనస్సులలో నీరాగద్వేషాది విషబీజములు బాగుగా నాటుకొనినవి. వానిని పెకలించుట దుర్ఘటము.

'సాంఘిక' రాష్ట్రములను నిర్మించుట తమకిష్టము లేదని సింధుహిందువులపక్షమున కొందరు వాదించుచున్నారు. నిజమే, సింధుమహమ్మదీయులకోర్కెలు సరియైన భాషలో కూర్పబడియుండలేదు. సాంఘికపద్ధతి ననుసరించియే వారు తమకు రాష్ట్రముకావలెననికోరిరి. మరియు ఇతర అనవసరవిషయములతో నీకోర్కె జతచేయబడెను. ఇట్టితీర్మానము హిందువులకు కోపకారణమగుటలో విపరీత మేమియులేదు. తమ వాదమును నిరూపించుపద్ధతిలో లోపము లున్నయెడల వాదములోనే లోపములున్నవని

యనుట సమంజసమా? 'సాంఘిక' రాష్ట్రమును క్రొత్తగా నిర్మించుట కిది ప్రయత్న మెన్నటికిని కాదు. సింధులో మహమ్మదీయులు హెచ్చుగా నున్నారు. దానికిమన మేమి చేయగలము? భారత దేశములో వివిధ రాష్ట్రములయందు జనాభా యిప్పు డున్న ట్లుండుట కనేక కారణములున్నవి. ఇప్పుడు క్రొత్త రాష్ట్రమును నిర్మించినను నిర్మింపకపోయినను సింధుదేశమున మహమ్మదీయులే హెచ్చుగా నుండవలెనుగదా! అధికసంఖ్యాకుల యభిప్రాయమును మన్నింపకపోతిమా, స్వయంనిర్ణయసూత్రమునకు విరుద్ధముగా ప్రవర్తించినవార మగుటయే కాక అధికసంఖ్యాకుల యభిప్రాయమునకు వ్యతిరేకముగా ప్రవర్తించి వారి కోపమునకు గురియైనవారముకూడ నగుదుము. భారతదేశము శాంతియుతమగు మార్గముల నభివృద్ధిని జెందవలెనని కోరువా రెవ్వరు నిట్టి ఫలితములను కోరరు. సంఘప్రాబల్యమునుబట్టి రాష్ట్రనిర్మాణము చేయగూడ దని చెప్పుట, ఒక్కొక్కజాతి కొక్కొక్కదేశ ముండుటవలన అంతర్జాతీయతకు నష్టమువాటిల్లు నని చెప్పిన ట్లుండును. రెంటిలోను కొంచెము సత్యము లేకపోలేదు. కాని అంతర్జాతీయతయం దెంతయభిమానముగలవారైనను సంపూర్ణ జాతీయవిజ్ఞానాభివృద్ధికి స్వాతంత్ర్యము లేనిదే సవ్యమగు అంతర్జాతీయత యేర్పడజాల దని యొప్పుకొనుచునే



యున్నాడు. ఇట్లులే సంపూర్ణసాంఘిక విజ్ఞాన స్వాతంత్ర్యము లేనిది సర్వాంగసుందరమగు జాతి నిర్మింపబడదు.

సింధువిభజనమునకు అభ్యంతరములు

బొంబాయిరాష్ట్రమునుండి సింధుదేశమును విడదీయుట కభ్యంతరములు చెప్పువారు మహత్తరమగు జాతీయభావప్రేరితులై యుండలే దనియు, స్వల్పఆర్థికలాభములకై పెనగులాడుచున్నారనియు మే మూహించుచున్నాము. నూతన రాష్ట్రమున మహమ్మదీయులు హెచ్చుగా నున్నతోద్యోగములం దుందురు గనుక తమ కనర్థము వాటిల్లునని హిందువుల యభిప్రాయము. ఈభయమున కేమియు నవకాశము లేదు. సింధురాష్ట్రమునందలి హిందువులు సాహసవంతులు. నూతనకార్యాచరణదక్షులు. ఎంతదూరదేశముల కైనను నిర్భయముగావెళ్లి వాణిజ్యాదికమువలన ధనమునుగడించి భారతదేశముయొక్క సంపత్తిని పెంపునొందింపగలవారు. వారి ధైర్యసాహసములను, కర్మకౌశలమును హ[illegible]గలవా రెవ్వరును లేరు. సద్గుణశోభితులగు వారి య[illegible]నాటంకపెట్ట నెవ్వరితరము? ఇదిగాక రాష్ట్రీయ ప్రభుత్వముల యధికారములు పర్యాప్తములు. ముఖ్యశాఖలయందన్నిటియందును సింధుప్రభుత్వము భారతప్రభుత్వమునకు లోబడి ప్రవర్తింపవలసి యుండును. ఐనను, రాష్ట్రప్రభు

[illegible]వము తమకు హానికలుగజేయు నని యింకను అనుమానములు పూర్తిగా తొలగనిచో కొన్ని ప్రత్యేకరక్షణములను కోరుట న్యాయముగాని ధర్మమగురాష్ట్రవిభజనమున కభ్యంతరములను జెప్పుట సమంజసము కాదు.

కావున ప్రత్యేక సంఘముల యభివృద్ధికి గూడ సింధురాష్ట్రవిభజన మవసరమనియే మాయభిప్రాయము. దీనివలన మహమ్మదీయులకులాభమును హిందువులకునష్టమును లేదు. అట్టివి వచ్చినను ఈస్వల్పలాభనష్టములకై ప్రజలు భారతజాతీయాభివృద్ధి నరికట్టకుండెదరు గాకయని మేము ప్రార్థించుచున్నాము. రాష్ట్రవిభజనము వలన ప్రత్యేకసంఘములకు కలుగు లాభనష్టము లిచ్చట చర్చించితిమి. రాష్ట్రవిభజనమున మన మనుసరింపవలసిన ప్రధానసూత్రములనుగురించి ముందొక యధ్యాయమున వివరింపగలము. మాసంఘసభ్యులగు ఆసీగారు పై యభిప్రాయము లన్నిటితో నేకీభవింపక పోయినను సారాంశములతోమాత్ర మేకీభవించుచున్నారు.

---

# మూడవ అధ్యాయము

---

## సాంఘికసమస్య (రెండవభాగము)

ఇప్పుడు ప్రత్యేక సంఘములకు శాసనసభలలో స్థానములను ప్రత్యేకించుటను గురించి విచారింతము.

**స్థానములను ప్రత్యేకించుట**

ఈ విషయమున ప్రతిసంఘమువారును తమయభిప్రాయములే సవ్యమైన వనియు, తమపట్టే నెగ్గవలెననియు తలచిరిగాని యితరులకు లొంగరైరి. పాంచాలములోను వంగదేశమునందును అధికసంఖ్యాకులగు మహమ్మదీయులకు స్థానములను ప్రత్యేకింపవలె నని మహమ్మదీయులు పట్టుపట్టిరి. హిందూమహాసభయు, సిక్కుసమితియు దీని కేమాత్రము నొప్పుకొనదయ్యెను. ఇందువిషయమున మావిచారణసంఘ మనేక సూచనలనుగూడ పరీక్షించెను. వానిలో ముఖ్యమైనవాని నీదిగువ నిచ్చుచున్నాము.

(1) జనాభా ననుసరించి అధికజనసంఖ్యాక సంఘములకును, అల్పజనసంఖ్యాకసంఘములకును స్థానములను ప్రత్యేకించుట.

(2) అధికజనసంఖ్యాక సంఘములవారికి కొన్నిస్థానములను ప్రత్యేకించి, యితరస్థానముల నభ్యర్థించుటకు గూడ స్వేచ్ఛ నొసంగుట.

(3) దామాషాపద్ధతిమీద నాధారపడిన ప్రాతినిధ్యము (Proportonal representation)

(4) పాంచాలమును, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రమును ఏకరాష్ట్రముగా చేసి, ఈ క్రొత్త రాష్ట్రములో ప్రత్యేకస్థాననిర్ణయము లేకుండ జేయుట.

(5) స్థానముల నసలే ప్రత్యేకింపక వెనుకబడియున్న సంఘములకు ఆర్థికాభివృద్ధికిని,విద్యాభివృద్ధికిని రాజ్యాంగవిధానమునందు తగు రక్షణముల నేర్పాటుచేయుట.

ఈసూచనలను విచారింపకపూర్వము దేశములో ముఖ్యసాంఘిక ప్రతిష్ఠాపనల యభిప్రాయ మేమియో విచారించుట లాభకర మని యెంచి, జులై 21 వ తారీఖున మాతో కలసి సంప్రతించుటకు తమతమ పక్షాభిప్రాయములను తెలుపగలవారిని పంపవలసినదని కోరుచు హిందూమహాసభకును, ముస్లిమ్ సమితికిని, సిక్కుసంఘమునకును జూన్ 11 వ తారీఖున మేము ఆహ్వానముల నంపితిమి. ఈసూహ్వానములకు ప్రత్యుత్తరము తృప్తికరముగా నుండలేదు. ఆతారీఖున తమప్రతినిధిని పంపుటకు వీలు



లే దని హిందూసభాకార్యదర్శి వ్రాసెను. ముస్లింసమితి కార్యదర్శి ప్రత్యుత్తరమే వ్రాయలేదు. సిక్కుసంఘము సభ్యుని పంపదలచెను గాని, హిందూమహాసభయును, ముస్లిమ్సమితియును సభ్యులను పంపనందున, సిక్కుప్రతినిధిని రమ్మనియిబ్బంది పెట్టుట కవసరము లేదని మాసంఘసభ్యుడు సర్దార్ మంగళసింగ్ గారు తలచిరి. మే మాహ్వానములు పంపినకొందరు పెద్దలుకూడ అసందర్భములవలన రాజాలకపోయిరి. డాక్టర్ అన్సారీగారుమాత్రము శ్రమచేసి మావద్దకు వచ్చి మాకు సలహా నొసంగిరి.

పైనుదాహరింపబడిన 5 సూచనలను మేము రెండుసభలలో చర్చించితిమి. ఆసమయమున డాక్టర్ అన్సారీగారుకూడ నుండిరి. మొదటిసూచనపై మే మొకనిశ్చితాభిప్రాయమునకు రాలేకపోయితిమి. కాని తక్కిన నాల్గుసూచనలను చర్చించి యొక యభిప్రాయమునకు వచ్చితిమి. వీటిని మొదట చర్చించి తరువాత ప్రధానవిషయమునకు వత్తుము.

పాంచాలములోను,వంగదేశమునందును అధికజనసంఖ్యాకసంఘములకు కొన్ని స్థానములను ప్రత్యేకించి యితర స్థానములకు పోటీ చేయుటకు స్వేచ్ఛ నియ్యవలెనని సూచింపబడెను.

కొన్ని స్థానములను ప్రత్యేకించుట

కొన్ని స్థానములను ప్రత్యేకించుకొను

హక్కు దక్షిణదేశమునందు బ్రాహ్మణేతరుల కొసంగబడెను. ఇప్పటికిని అది అమలులో నున్నది. కాని బ్రాహ్మణేతరులకుగూడ నిది యనవసర మని అనుభవమువలన తేటపడినది. మాకు తెలిసినంతవరకు బ్రాహ్మణేతరులు తమ వోట్లసంఖ్య హెచ్చుగా నుండుటవలన నెల్లప్పుడును హెచ్చుస్థానముల నాక్రమించుకొనుచుండిరి గాని, తక్కువ స్థానముల నెప్పుడును ఆక్రమించుకొనలేదు. స్థానములను ప్రత్యేకింపవలసినయవసరము వారి కెన్నడును రాలేదు. పాంచాలములోను, వంగదేశమునందును అధికముగా నున్న మహమ్మదీయులు హెచ్చుస్థానముల నాక్రమింపజాల రని యెవ్వరును వాదింపలేదు. హిందువులకన్న తమకు హెచ్చుస్థానములు లభింప వేమో యని మహమ్మదీయులు భయమందుచున్నారు. ఇట్లు తలచుటకు కారణము లేమియు లేవని మాలో చాలమందియభిప్రాయము. మహమ్మదీయులకు హిందువులకన్న హెచ్చుస్థానములు రాకపోయినను ఎట్టి పరిస్థితులయందైనను కొంచె మించుమించుగా సమానస్థానములు లభించుననుట నిశ్చయము. వారికి నూటికి 45 స్థానములు లభించునని నిశ్చయమున్నదనుకొనుడు. అప్పుడుకొన్ని స్థానములను ప్రత్యేకింపవలసిన యవసరముండదు. అల్పజనసంఖ్యాకసంఘములకుగాని, అధికజనసంఖ్యాకసంఘములకుగాని కొన్ని స్థానములను ప్రత్యే



కించి, యితరస్థానములకు స్వేచ్ఛగా పోటీ చేయనిచ్చు సూత్రమునకు మా యభ్యంతర మేమియు లేదు. కాని పాంచాలములోను వంగదేశమునందు నివి యనవసరములనియు, నీపద్ధతివలన హెచ్చులాభము లేదనియు తలచుచున్నాము.

**దామాషాపద్ధతిమీద నాధారపడిన ప్రాతినిధ్యము (Proportional Representation)**

తరువాతిసూచన దామాషాపద్ధతిమీద నాధారపడిన ప్రాతినిధ్యము. ఈపద్ధతినిగురించి యాలోచించి యఖిలపక్షసభవారికి నివేదింపవలసినదని యేర్పాటు గావింపబడిన ఉపసంఘము నివేదిక నంపలేదు. కాని కొందరు తమ ప్రత్యేకసూచనల నంపినారు. సర్దార్ మంగళసింగుగారి పద్ధతి నభిమానించిరి. ఇతరులుకూడ నిది ప్రశస్త మగు పద్ధతి యనియే తలచిరి గాని ప్రస్తుతము మన దేశములో నమలులో నుంచవీలు లేదని యభిప్రాయపడిరి. వివిధసంఘముల భయములను, కోర్కెలను సమన్వయము చేయగల విధాన మిదియొక్కటియే యని మేముగూడ తలచుచున్నాము. దీనిలో ప్రతిఅల్పజనసంఖ్యాక సంఘమును ప్రాతినిధ్యము వహింపవచ్చును. పరస్పర విరుద్ధాభిప్రాయములుగల సంఘములహక్కులు సమన్వయ మగుటకుగూడ నిదియొక్కటేమార్గము. ముందు సాంఘికసమస్యా పరిష్కారమున కిది యొక్కటే తారకమని మాయుద్దేశము.

కాని ప్రస్తుత మీపద్ధతి యెంతవర కాచరణయో
గ్యమో విచారింపవలసియున్నది. ఈమార్గమునం దనేక
చిక్కు లు కలవనియు, ప్రస్తుతము భారతదేశమునందలి
వోటర్లు వాని నర్థము చేసికొనజాల రనువిషయమునకు
ప్రాధాన్య మొసంగబడుచున్నది. ఎంత వాంఛనీయమయి
నను భారతీయు లీవిధానముయొక్క ప్రాముఖ్యమునుగమ
నించునంతటి విద్యావంతు లగువరకు నీవిధానమును మన
దేశమునందు అమలులోపెట్టుటకు వీలులే దని కొందరు
వాదించుచున్నారు. ఇది గొప్ప ఆటంకమని మేముకూడ
గ్రహించుచున్నాము. కాని యీమాటలలో కొంత అతి
శయోక్తి లేకపోలేదు. దామాషాపద్ధతిమీద ప్రతినిధుల
నెన్నుకొనుటకు వోటరులకెక్కుడు తెలివితేట లవసరము
లేదు. వోట్లు పుచ్చుకొనునట్టి అధికారులకును, వోట్లను
లెక్కపెట్టి ఒకరికి హెచ్చుగా వచ్చినవోట్లను ఇంకొక
రికి సర్దుడుద్యోగులకును హెచ్చు తెలివితేట లవసరము.
వోట్లను చక్కగా లెక్కపెట్టి ప్రతినిధులను నిర్ణ
యింప గలిగినవారు భారతదేశములో తగినంతమంది
యున్నా రనుట కేసందియమును లేదు. ఎన్నికకు నిలిచిన
వారి గుణాగుణములనుబట్టి ప్రథమ, ద్వితీయ, తృతీయ
సభ్యులను క్రమముగా నిర్ణయించుటకు వోట్లిచ్చువారికి
గూడ తెలివితేట లవసర మనుట సత్యమే. కాని ఒక్కదా



మాషా పద్ధతి ప్రాతినిధ్యమునకే యీకష్టము కల దనుట
సమంజసము కాదు. చాలమంది పోటీచేసినయెడల, వారి
లో నొక్కని నెన్నుకొనుటకుగూడ తెలివితేటలును, విచ
క్షణతాజ్ఞానమును అవసరములేకదా? ప్రజాప్రతినిధిప్రభు
త్వము బాగుగానభివృద్ధినొందిన ఆంగ్లదేశములోనేవోటర్ల
విచక్షణతాజ్ఞాన మొక్కొక్కప్పుడు సంపూర్ణముగా నశిం
చుచున్నది. వోటర్లు ఉన్నతాదర్శప్రబోధితు లై వోట్ల
నిచ్చుట లేదు. జాతీయశ్రేయమును మాత్రమే యాలో
చించి ప్రతినిధుల నెన్నుకొనుటలేదు. ఎన్నిక సమయము
లందు పొడసూపు తాత్కాలికములును, స్వల్పము
లును, గర్హ్యములు నగు కారణములవలన వోటర్లు వోట్ల
నిచ్చుట తటస్థించుచున్నది. ఇటీవల ఆంగ్లదేశములో
జరగిన ఎన్నికలయందు పదభ్రష్టుడైన కెయిజరు నురితీయ
వలయు నను సంకల్పముతోడనో, అప్రధాన మగు నొక
కృత్రిమలేఖచే నుద్రేకమునుబొందియో ప్రజలు వోట్ల
నిచ్చిరి. ఆంగ్లసామ్రాజ్య పరిపాలనాభారమును వహించి,
అంతర్జాతీయవ్యవహారములయందు హెచ్చుగా పాల్గొన
వలసిన ఆంగ్లపార్లమెంటుమహాసభాప్రతినిధులనేఆంగ్లప్రజ
లింతటి యల్పాశయములతో నెన్నుకొని యుండినప్పుడు
సంగతిసందర్భములను గ్రహింపగలిగినయెవ్వాడు ప్రజాప్రతి
నిధిప్రభుత్వమును గాంచి నిరుత్సాహపడడు? ఆంగ్లదేశము

నందలి వోటర్ల తెలివితేటలకంటె భారతదేశములోని వోటర్ల తెలివితేటలు మొదటమొదట తగ్గుగా నుండును. ఇందు వలన దామాషాపద్ధతిమీద ప్రాతినిధ్యము భారతదేశమునకు పనికిరాదనుటసత్యము కాదు. ఈలోపములు ప్రజాప్రతినిధి ప్రభుత్వమునకు నైసర్గికములుగాని, దామాషాపద్ధతి మీద ప్రతినిధులనెన్నుకొనుట కభ్యంతరములు కావు.

వ్రాయుటయు చదువుటయు తెలియని వోటర్లు దామాషాపద్ధతిమీద ప్రతినిధుల నెన్నుకొనునపుడు రహస్యభంగము వాటిల్లు నని యొక అభ్యంతరమును కొందరు చెప్పుచున్నారు. ప్రతియభ్యర్థికిని ఒక పేరంగు పెట్టెలు మూడుండి, ప్రథమ, ద్వితీయ, తృతీయ సమ్మతులను తెల్పుటకు వానిమీద నేమైననొకచిహ్నముండినచో నీయభ్యంతరము తొలగునని మేము తలచుచున్నాము. కాని యీలోపము ప్రస్తుతసమయమున సామాన్యముగా జరగుచున్న యెన్నికలకుగూడ నున్నదిగదా! మాల్టా ద్వీపమునం దధికసంఖ్యాకులు విద్యావిహీను లయినను దామాషాపద్ధతిమీద నాధారపడు ప్రాతినిధ్య మచ్చట నవలంబింపబడి, జయప్రదముగా కొనసాగింపబడినది. ఐనను ఈచిన్నద్వీపమును ముప్పదికోట్ల జనాభాగలిగిన భారతదేశముతో పోల్చుటకు వీలులేదు.



ఈవిధానమును భారతదేశములో ప్రవేశపెట్టి ఆచరణయం దెట్లు కొనసాగునో పరీక్షించుట కేయభ్యంతరములును లేవని మాలో చాలమంది తలచుచున్నాము. దీనియందు లోపము లుండవచ్చును. అవలంబించుటవలన ప్రమాదముకూడ సంభవింపవచ్చును. కాని మే మాలోచించిన పద్ధతిలో నేది లోపరహితముగా నున్నది? ఏది ప్రమాదరహితముగా నున్నది? ప్రతిదానికి నేవో అభ్యంతరములు చెప్పవచ్చును. వీనిలో కొన్ని మూలసిద్ధాంతములకు భిన్నముగ నున్నవి. కనుక అవలంబించిన వెంటనే కొన్ని కష్టములు సంభవింపవచ్చును. ఐనను దామాషాప్రాతినిధ్యమును ప్రస్తుత పరిస్థితులలో భారతదేశమున ప్రవేశపెట్టుట సమంజసము కాదని మాలో కొందరు తలచుటచేత దాని నవలంబింపవలె నని సిఫారసు చేయుట లేదు.

పాంచాలమును, పశ్చిమోత్తర పరగణాను ఏక రాష్ట్రముగా చేయుట

పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రమును పాంచాలముతో కలిపి యీ రాష్ట్రములో ప్రత్యేక స్థానములను లేకుండ జేసిన బాగుండు నని కొందరు సూచించిరి. ఈ సూచనకు మా యభ్యంతరము లేమియు లేవు. కాని యీ రాష్ట్రములలోని వివిధపక్షముల వారీసూచన నెంతవర కంగీకరించెద

రో తెలియదు. అందరును అంగీకరించి రేని దీనిని సంతోషపూర్వకముగా సిఫారసు చేయుదుము. దీనిలో ప్రత్యేక సిద్ధాంత మేమియు నిమిడియుండలేదు. ఈ రెండు రాష్ట్రముల ప్రజలకు నిది యిష్టమా, ఇష్టము కాదా యను ప్రశ్నమీద మాయంగీకారము ఆధారపడి యుండును. మా సంఘసభ్యు డగు సర్దారు మంగళసింగుగారు దీని నామోదింపలేదు. ఇంక కొందరుకూడ ఆమోదించుట లేదని తెలియుచున్నది. కావున నీసూచనపై సిఫారసు చేయకున్నాము.

ఇట్టిదే మరియొక సూచన చేయబడెను. అది యేదన పాంచాలమును, పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రమును, బెలుచిస్థానమును, సింధును కలిపి ఏక రాష్ట్రముగా చేయవలెను. ఈఏకరాష్ట్రములో అల్పజనసంఖ్యాకసంఘమువారు కోరిన తప్ప ప్రత్యేకస్థానముల నిర్ణయ ముండరాదు. ఇట్లు చేసినయెడల భారతదేశముయొక్క ఉత్తర దిక్కును పశ్చిమోత్తరదిక్కును ఆక్రమించుకొనునట్టి బ్రహ్మాండమైన రాష్ట్ర మేర్పడును.

పాంచాలమునందు స్థానములను ప్రత్యేకించుట అసలే పనికిరాదనియు, రాజ్యాంగవిధానమునందే వెనుకబడియున్న వారికి ప్రత్యేకరక్షణము లియ్యబడవలెననియు



పాంచాలములో స్థానముల ప్రత్యేకించుట పనికిరాదు.

మరియొకసూచన చేయబడెను. ఇట్టిది వివిధపక్షములవారికిని సమ్మత మగుచో, దీనికంటెను మంచి పద్ధతి యుండదు. కాని ప్రస్తుతపరిస్థితులలో నీపద్ధతి పాంచాలు రందర యంగీకారమును బడయునని నమ్ముటకు వీలులేదు. ఇంతసరసమైన పద్ధతి నందరు నొప్పుకొనుచో, సాంఘికవిభేదములే యుండియుండవు. మా చిత్తురాజ్యాంగ విధానమున అల్పజన సంఖ్యాకసంఘములవారి విద్యాభివృద్ధికిని, ఆర్థికాభివృద్ధికిని అనేకసంరక్షణముల నేర్పరిచితిమి. ఐనను ఒకసంఘమునకు మరియొక సంఘముపై గల యనుమానములును, దురభిప్రాయములును,సంపూర్ణముగా తొలగునెడలను, శాసనసభలకు స్థానములను ప్రత్యేకించుట మొదలగు కృత్రిమ రక్షణములను వివిధసంఘములవారు వదలుకొనునెడలను, మే మేర్పరచిన రక్షణములకును, షరతులకును మరికొన్ని చేర్చి సమగ్రమైనవానినిగా చేయుటకు సంసిద్ధులమై యున్నాము.

జనాభా ననుసరించి స్థానములను ప్రత్యేకించుట

అధికజనసంఖ్యాక సంఘములకును, అల్పజనసంఖ్యాకసంఘములకును జనాభా ననుసరించి స్థానములను ప్రత్యేకించుట యను ప్రధానవిషయము నిప్పుడు చర్చింతము.

సాంఘిక నియోజకవర్గములవలె Communal electorates) వివిధసంఘములకుకు స్థానములను ప్రత్యేకించుపద్ధతిగూడ హానికర మని యందరును ఒప్పుకొనియే యున్నారు. ఐనను దేశకాలపరిస్థితుల ననుసరించి, తాత్కాలికసాధనోపాయముగ, సాంఘికనియోజకవర్గములు సంయుక్త నియోజకవర్గములుగా మారునంతవరకు దీని నంగీకరింపవలసివచ్చినది. ఈమధ్యకాలములో ఒకసంఘముపై మరియొకసంఘమునకు గల యనుమానములు సంపూర్ణముగా తొలగకపోయినను చాలమట్టుకు తగ్గు నని యీపద్ధతి నభిమానించినవారి యభిప్రాయమై యుండెను. లక్నో ఒడంబడిక (లక్నో పాక్టు) కుదుర్చు సమయమున గూడ కొందరిట్లే వాదించిరి. కాని ఈ 12 సంవత్సరముల యనుభవము వలన వారియాసలు అడియాస లైన వని నిర్ధారణ మైనది. ఇటీవల మహమ్మదీయులకును హిందువులకును వృద్ధియగుచున్న వైషమ్యమునకు కారణము సాంఘికనియోజకవర్గము లయినను, కాకపోయినను ఈపద్ధతి హిందువులకును మహమ్మదీయులకును సఖ్యమును, సద్భావమును పెంపు చేయ లేకపోయిన దనుమాటమాత్రము సత్యము. ఏసంఘమున కైనను అల్పజనసంఖ్యాకసంఘమున కైనను, అధికజనసంఖ్యాక

స్థానములను ప్రత్యేకించుట హానికరము



సంఘమున కైనను స్థానములను ప్రత్యేకించుట సంకుచిత సాంఘికాభిమానములను గౌరవించిన ట్లగును. సాంఘిక నియోజకవర్గమునకును దీనికిని భేద మేమియు నుండదు.

అధికసంఖ్యాకసంఘములకు స్థానములను ప్రత్యేకించు పద్ధతిని పలువురు తీవ్రముగా ఖండించుచున్నారు. సిద్ధాంతరూపమున చూచినను, అనుభవమునుబట్టి విచారించినను ఇది లోపభూయిష్ఠ మని వారుచెప్పెదరు. ఇతర సంఘము లన్నిటికంటెను మహమ్మదీయులు కొంచెము హెచ్చుగానున్న పాంచాల వంగ దేశములయందు మాత్రమే ఈసమస్య పొడసూపుచున్నది. ఇతరరాష్ట్రములయందలి అధికసంఖ్యాక జనసంఘముల వా రెవ్వరును దీనిని కోరలేదు. కావున పాంచాల వంగ దేశముల విషయము మాత్ర మిచ్చట విచారించిన చాలును.

అధికసంఖ్యాకులకు స్థానములను ప్రత్యేకించుట

పాంచాలములోను, వంగదేశమునందును వివిధ మతములవారి జనసంఖ్యనుబట్టి విచారించినచో భారత దేశములోని ఇతరరాష్ట్రములన్నిటికంటె నీరెండు రాష్ట్రములయందే చక్కని సాంఘికపరిస్థితు లేర్పడి యుండవలసినది. ఈరాష్ట్రములలో నొకమతమువా రితరు లందరి కంటె హెచ్చుగానున్నను, ఇతరులుగూడ తమ శ్రేయ

మును బాగుగా రక్షించుకొనగలిగినంత ప్రాబల్యముగలిగి యున్నారు. కావున ఒకరి నింకొకరు అడచివేయుట గాని యిబ్బందిపెట్టి యభివృద్ధినొందకుండ చేయుటగాని యసంభవమై యుండవలసినది.

అధిక జనసంఖ్యాక సంఘములకు స్థానములను ప్రత్యేకించుపద్ధతిని సమర్థించుట యసాధ్యము. అధిక

సిద్ధాంతము

జనసంఖ్యాక సంఘముయొక్క అభివృద్ధికిని, అల్పజనసంఖ్యాక సంఘముయొక్క అభివృద్ధికిని ఇది యాటంకమై జాతీయాభివృద్ధిని కూడ ఆటంకపెట్టుట నిశ్చయము. అధిక జన సంఖ్యాక సంఘమున కెట్టు లిది యనర్థదాయకమో ప్రథమమున వివరింతుము. శాసనముద్వారా వారియాధిక్యమును ధ్రువపరచుటచేత స్వహస్తములపై నాధారపడు శక్తిని వారు గోల్పోయెదరు. ఈపద్ధతి నవలంబించిన కొలది రోజులకే సంఘము ఆత్మవిశ్వాసమును గోల్పోవును. జాతీయ పునర్నిర్మాణమున కవసరమగు సుగుణసంపత్తి యంతయు నశించును. ప్రజల నిర్మాణసామర్థ్య మదృశ్యమగును. దామాషాపద్ధతిమీద ప్రాతినిధ్య మున్నతప్ప, సాధారణముగా, నధికజనసంఖ్యాక సంఘములు జనసంఖ్యను బట్టి న్యాయతః తమకు రావలసిన స్థానములకంటె హెచ్చు స్థానముల నాక్రమించుకొనుట సంభవించును. ప్రతి



నియోజకవర్గమునందును లేదా హెచ్చు నియోజక వర్గములయందు అధిక జనసంఖ్యాకసంఘమే బలీయముగా నుండుటవలన స్థానములలో చాలభాగము వారికే లభించునని విశదము కాగలదు. ఇట్లధికస్థానముల నాక్రమించుకొని అల్పజనసంఖ్యాక సంఘములకు రాదగిన కొలది స్థానములను గూడ వారూడ్చివేసెదరు. కనుక, నీపద్ధతి అల్పజనసంఖ్యాక సంఘములకు నష్టదాయకము. ఇందువలన వీరి హక్కులను రక్షించుట యవసర మగుచున్నది.

అధికజనసంఖ్యాకసంఘములకు స్థానములను ప్రత్యేకించుపద్ధతిగాని, ఇతరపద్ధతులనుబట్టి స్థానములను ప్రత్యేకించుటగాని నిజమగు ప్రజాప్రతినిధి ప్రభుత్వమునకును బాధ్యతాయుత ప్రభుత్వమునకును విరుద్ధము. ప్రజలు కోరినవాని నెన్నుకొనుటకు గల హక్కును ఈ పద్ధతి యాటంకపరుచు నని విశద మగుచునే యున్నది. మరియు శాసనసభలలోను వెలుపలను స్వాభావిక మగు క్రొత్త పార్టీలు ఏర్పడుటకుగూడ నిదియొక ఆటంకము. సంకుచిత సాంఘిక దృక్పథము నిది వేళ్లు పాతుకొనునట్లు చేయును. ఈభావము ప్రజలలో వ్యాపించినందుల కందరును చింత నొందుచున్నారు. దేశీయుల మనముల నుండి యీ భావమును పారదోలుట కందరును ఇచ్ఛగించు

యున్నారు. కాని యిది యెట్లు తొలగును? ఐకమత్యమును హరించి యుపన్యసించుటవలనను శ్రీరంగనీతులు చెప్పుటవలనను పోవునా? ఒకరిపై నొకరికి అనుమానమును భయమును కలిగించెడి విధమున సంఘమును కృత్రిమముగా విభజింపక ప్రజల దృష్టిని వారి దైనిక జీవనముల యందు సంభవించెడి కష్టసుఖములకై మరల్చినప్పుడే ప్రత్యేకసంఘదృష్టి నశించి జాతీయతయం దభిమానము గలుగును. కావున ప్రజల కిట్టి నూతనాభిమానము గలిగించి, ఈయభిమానమునకు ప్రతిబంధకములగువానినన్నిటిని తొలగించుటకు మనము ప్రయత్నింపవలెను. అధిక జనసంఖ్యాకసంఘములకు స్థానములను ప్రత్యేకించుటయు, స్థానములను నిర్ణయించుటయు నిట్టి యాటంకము లనుటకు సందేహ మేమియు లేదు.

ప్రత్యేకించు పద్ధతులు

అధిక జనసంఖ్యాక సంఘములకు స్థానములను ప్రత్యేకించుపద్ధతులను పరిశీలించినచో నిది ప్రజాప్రతినిధి ప్రభుత్వమునకు మాత్రమేకాక బాధ్యతాయుత ప్రభుత్వముయొక్క ప్రధాన సూత్రములకు గూడ వ్యతిరేకమై యున్నదని తేటపడక మానదు.

మద్రాసు రాజధానియందును, బొంబాయిరాజధానియందలి కొన్నిభాగములయందును గల



మాంటెగ్యు ఛెమ్స్‌ఫర్డు పద్ధతి

బ్రాహ్మణేతరసంఘములకు కొన్నిస్థానములను ప్రత్యేకించుపద్ధతి నొకదానిని మాంటెగూ ఛెమ్స్‌ఫర్డుసంస్కరణ ప్రణాళిక యామోదించినది. మద్రాసు రాజధానిలో నూటికి 96 వంతులు గల బ్రాహ్మణేతరులు, నూటికి 2½ కంటె హెచ్చుగాలేని బ్రాహ్మణుల బారినుండి రక్షించుకొనుటకై సౌత్ బరో కమిటీవారి సిఫారసుపై తమకు 98 స్థానములలో 28 స్థానములను ప్రత్యేకించునట్లు ప్రభుత్వమువారి నొప్పించిరి. ఈ ప్రత్యేకస్థానములను సంపాదించిన పద్ధతి ఈ క్రింద వివరించుచున్నాము. ఒక్కొక్క సభ్యుని నెన్నుకొనవలసిన రెండు సంపూర్ణ బ్రాహ్మణేతరనియోజకవర్గము లేర్పరుపబడెను. తక్కినవారిలో 25 నియోజకవర్గములు ముగ్గురుగాని, అంతకు పైగా గాని సభ్యులను ఎన్నుకొనవలసినట్లును, అందులో మద్రాస్‌నగరమున కిద్దరును, తక్కినవానిలో ఒక్కొక్కరును బ్రాహ్మణేతరులై యుండవలె ననియు నిర్ధారణ చేయబడెను. ఈవిషయమైన నిబంధన యిట్లున్నది.—

"వోట్లను లెక్కపెట్టుట పూర్తి యైనతరువాత వోట్లను లెక్కించు ఉద్యోగి అందరికంటెను హెచ్చు వోట్లు వచ్చినవానిని ఎన్నుకొనినట్లుగా ప్రకటింపవలెను ఒక్కస్థానముగాని హెచ్చుస్థానములుగాని ప్రత్యే

కింపబడినప్పుడు హెచ్చువోట్లు వచ్చిన బ్రాహ్మణేతర అభ్యర్థినిగాని అభ్యర్థులనుగాని ప్రథమమున నెన్నుకొనినట్లు ప్రకటింపవలెను.”

ఉదాహరణముగా మద్రాస్‌నగరమునందు ప్రస్తుతము జరగుచున్న పద్ధతిని యోజింపవచ్చును. ఒకనియోజకవర్గములో ఎన్నుకొనవలసిన ఆగ్గురు సభ్యులకు ఇద్దరు బ్రాహ్మణేతరులై యుండవలె నని నిర్ధారణ చేయబడినది. మొదటి ఆగ్గురిలో బ్రాహ్మణేతర యభ్యర్థి యెవ్వరును లేరనియు, బ్రాహ్మణేతర అభ్యర్థులకు అందరకన్న తక్కువవోట్లు వచ్చిన వనియు తలంచెదము. పై చెప్పిననిబంధనప్రకారము మొదట ఇద్దరు బ్రాహ్మణేతర అభ్యర్థులు ఎన్నుకొనబడుదురు. తరువాత మొదటి నల్గురును ఎన్నుకొనబడుదురు. బ్రాహ్మణేతరుల విషయమున, ఎన్నికదారులకోర్కెలీవిధముగా తృణీకరింపబడుచున్నవి. బ్రాహ్మణేతరసంఘమునకు చెందిన ఎన్నికదారులు తమ యభ్యర్థులకు ప్రతికూలురై అధికసంఖ్యాకులుగా వోట్లనిచ్చినను ప్రథమమున నెన్నుకొనబడువారు బ్రాహ్మణేతరులే కదా! ఈ యిద్దరు బ్రాహ్మణేతరు లెవరి ప్రతినిధులు? ఎన్నికదారులలో నధికసంఖ్యాకులు వారి నెన్నుకొనలేదు. బ్రాహ్మణేతరులలో గూడ అధికసంఖ్యాకులు వారి నెన్నుకొనియుండరు. ‘ఒకసిద్ధాం



తముమీదగాని, సూత్రముమీదగాని యాధారపడని యొక అస్వాభావిక నిబంధనపై వారు సభ్యత్వమును సంపాదించిరి. అదృష్టవశమున బ్రాహ్మణేతరుల యనుమానములు వట్టి భ్రమ యని తేటపడినది. ఈ నిబంధనను ఒక్కసారియైనను అనుసరింపవలసినయవసరము మద్రాసునందు కలుగలేదు.

తొంబది యెనమండుగురు సభ్యులు గల శాసనసభలో 28 గురు రీప్రకారముగా నెన్నుకొనబడుట హానికరము. ఇదియే హానికరమైయుండగా సభలో నధికసంఖ్యాకు లిట్టి విపరీతపద్ధతి నెన్నుకొనబడుటయు. మంత్రులుగూడ వీరినుండియే నియమింపబడుటయు నింకెంత హానికరముగా నుండవలెను? ఇట్టిపద్ధతిపై నాధారపడెడు ప్రజాప్రతినిధిప్రభుత్వము శుద్ధ బూటకమని వేరుగా చెప్పవలయునా?

సింధుపాక్టు పద్ధతి

వివిధసంఘములకు స్థానములను ప్రత్యేకించుపద్ధతి మరియొకటి సింధు ఒడంబడిక నభిమానించిన వారిచే సూచింపబడుచున్నది. ఈపద్ధతి ఒడంబడికపత్రములో 5 వ క్లాజులో నిట్లు వివరింపబడినది

“ప్రతి నియోజకవర్గమునందును, మహమ్మదీయులకును, మహమ్మదీయేతరులకును ఒక్కటే ఎన్నికదారుల

పట్టిక యుండవలెను. మరియు మహమ్మదీయ, మహమ్మదీయేతరాభ్యర్థుల ఎన్నికలు ఒక్కరోజుననే, ప్రత్యేకముగా, హిందువులును మహమ్మదీయులును కలసి రెండు ప్రదేశములయందును, ఎన్నికలయందు పాల్గొనుటకు హక్కును అవకాశమును గలుగువిధమున జరపబడవలెను. ఈపద్ధతివలన నెన్నుకొనబడువారు వోటరులందరిచేతను ఎన్నుకొనబడుదురుగాని స్వసంఘమువారిచే మాత్ర మెన్నుకొనబడరు. ఇట్లయినచో సంయుక్త నియోజకవర్గవిధానము బాగుగా పనిచేయగలదు."

"ఎన్నుకొనబడువారు ఓటరులందరచేతను ఎన్నుకొనబడుదురు గాని స్వసంఘముచేమాత్ర మెన్నుకొనబడరు" అను సుగుణమును ఈవిధానమున నభిమానించెడివారు దీని కారోపించుచున్నారు. అందరును కలసి ఎన్నుకొనుటయే నిజమయిన అభిప్రాయమగుచో ప్రత్యేకముగా ఎన్నికల నెందుకు జరపవలెను? ఒక్కచోటనే హిందువులును, మహమ్మదీయులును వోట్లనిచ్చుటవలన నీఫలితము చేకూరదా? హిందూ మహమ్మదీయాభ్యర్థులకు పోటీ లేకుండజేసి, వారి జనసంఖ్య ననుసరించి స్థానములను ప్రత్యేకించుటయొక్కటే దీని నిజమగు ఉద్దేశమని మాకు తోచుచున్నది. ఎన్నికదారులు స్వబుద్ధి నుపయోగించి యోగ్యు లగువారి నెన్నుకొనుట కిట్టిపోటీ యవసరము.



కాని యీపద్ధతివలన పోటీలేకుండపోవుటయేకాక హిందువులు స్వసంఘాభిమానమును వీడి మహమ్మదీయులకు వోట్లనిచ్చుటకును, అట్లే మహమ్మదీయులు హిందువులకు వోట్ల నిచ్చుటకును అవకాశము లేమియు లేకుండపోవుచున్నవి.

హిందూమహమ్మదీయాభ్యర్థులకు ప్రత్యేకముగా వోట్ల నిచ్చుటకును, అందరకు కలసి యొకపెట్టెలోనే వోట్ల నిచ్చుటకును ఫలిత మొక్కటి కాదని స్పష్ట మగుచున్నది. ప్రత్యేకఎన్నికలలో, అధికజనసంఖ్యాకసంఘము అల్పజనసంఖ్యాక సంఘముననుండి ఎన్నుకొనబడవలసిన యభ్యర్థులలో తమ ఆజ్ఞానువర్తు లగువారికే వోట్ల నన్నిటిని గుప్పించి, ఎన్నుకొనుట కెల్లప్పుడును హెచ్చు అవకాశము లుండును.

పైన చర్చింపబడిన రెండు పద్ధతులలో నేదియు తృప్తికరముగా నుండదని స్పష్టమయినది. మూడవది ప్రత్యేక సాంఘికనియోజకవర్గముల నేర్పరచుట. ఈవిధానమును గురించి రెండవ అధ్యాయమున చర్చించితిమి. ఎన్నికసమయములో ఒక సంఘమును మరియొక సంఘముపై నాధారపడునట్లు చేసి సాంఘికసామరస్య మేర్పరుచుటయే ప్రత్యేక సాంఘిక నియోజకవర్గములను రద్దుచేయుటయందలి ముఖ్యాభిప్రాయము. కాని సంయుక్త

నియోజకవర్గమునందు అధిక జనసంఖ్యాక సంఘమునకు స్థానములను ప్రత్యేకించుట సాంఘిక సామరస్యమునకు ప్రతిబంధక మగును. ఏలన, అధికజనసంఖ్యాకసంఘము ఇతరసంఘములసాయము లేకయే తమకు నిర్ణయింపబడు స్థానములు నన్నిటిని ఆక్రమించుకొనగలుగును. కొందరు అభ్యర్థులు స్వసంఘమునుండి ఎన్నికకునిలిచిన ప్రతిస్పర్థులను గెలుచుటకు ఇతరసంఘముల వారి వోట్లను యాచించుటవలన కొంతలాభ ముండకపోదు. కాని సంఘవైషమ్యము ప్రబలినరోజులలో నీస్వల్ప లాభమును పొందుట కెవ్వరును ఇచ్ఛగింపరు.

ఒకవంక బాధ్యతాయుతప్రభుత్వమును స్థాపింపవలసిన దని కోరుచు మరియొకవంక అధికజనసంఖ్యాక సంఘములకు స్థానములను ప్రత్యేకింపుమని కోరుట వివేకము కాజాలదు. బాధ్యతాయుతప్రభుత్వ మనగా కార్యనిర్వాహకవర్గమువారు శాసనసభలకును, శాసనసభలు ఓటర్లకును బాధ్యులగు ప్రభుత్వవిధానమై యున్నది. కాని శాసనసభలో నధికసంఖ్యాకులకు మాత్రమే బాధ్యులగు కార్యనిర్వాహకసభ్యులు వోటరుల యిష్టానుసారముగా నెన్నుకొనబడినవారుకాక, స్థానములను ప్రత్యేకించుపద్ధతి మీద సభలో చేరినవారైనయెడల వోటరులకు నిజమైన ప్రాతినిధ్య మెచ్చట నున్నది? అధికసంఖ్యాకసంఘము



నకు స్థానములను ప్రత్యేకించుటవలన వోటర్ల యిష్టానిష్టములతో నిమిత్తములేకుండ దేశమును పరిపాలించుటకు వారికి చట్టసమ్మత మగు అధికారము గలుగుచున్నది. ప్రజాప్రతినిధిప్రభుత్వమున కిది వ్యతిరేకము. అల్పజనసంఖ్యాకసంఘముల యభివృద్ధి కిది ప్రబలమైన యాటంకము.

ఎన్నికలయందలి లోపములు

ఈపై యభిప్రాయములు సామాన్యముగా ప్రస్తుత సమయమున ప్రజాప్రతినిధి ప్రభుత్వములకు వర్తించు సూత్రములమీద నాధారపడియున్నవి. ఈ సూత్రములు ఆచరణయందంత చక్కగా పనిచేయుట లేదని మే మెరుంగుదుము. ప్రజాప్రతినిధి ప్రభుత్వమునకే అనేకులు చెప్పు అభ్యంతరములనుగూడ మే మెరిగియేయున్నాము. కాని యీ విషయములను ఈ విచారణసంఘమువా రిప్పుడు చర్చించుటకు నవకాశముచాలదు. ప్రజాప్రతినిధి ప్రభుత్వము బాగుగా నభివృద్ధి నైన దేశములలో ననుసరించుపద్ధతుల నొప్పుకొనుటయే ప్రస్తుతము చేయదగిన పని. మేము సిఫారసుచేసినపద్ధతికూడ కొన్నిసమయములయందు అధికసంఖ్యాకుల పరిపాలనమును స్థాపించుటకు చాలియుండలే దనికూడ మే మెరుంగుదుము. కడచినసారి ఆంగ్ల దేశములో జరిగిన ఎన్నికలను ఉదాహరణముగాతీసి

కొనవచ్చును. ఈయెన్నికలలోదాదాపుఅందరుసభ్యులును కొలదిమంది ఎన్నికదారుల సమ్మతులపైమాత్రమే ఎన్నుకొనబడిరి. వోటర్ల సంఖ్యలో తేడా లుండుటవలనను, ఓట్లు అవసరములేని అభ్యర్థులకు చాలవోట్లియ్యబడుట వలనను ఇట్లు జరిగినదని మేము తలచుచున్నాము. ఇట్టి లోపములను సవరించుటకు దామాషాపద్ధతిమీద ప్రాతినిధ్యమే అవలంబనీయము. దీని గుణాగుణములను పైని చర్చించితిమి. కాని మాలో ననేకులు ప్రస్తుత మాచరణీయముకాదని తలచుటచే నీపద్ధతిసిఫారసు చేయమానితిమి.

జనసంఖ్య వివరములు

ఇంతవరకు అధికజనసంఖ్యాకసంఘములకు శాసనసభ్యత్వస్థానములను ప్రత్యేకించుటయొక్క సిద్ధాంతరూపమును చర్చించితిమి. ఇప్పుడు పాంచాలమునందును, వంగదేశమునందునుజనసంఖ్యనుబట్టి యాలోచించినను శాసనసభలలో స్థానములను ప్రత్యేకించుట యనవసరమనియు, అనర్థదాయకమనియు నిరూపించెదము. ఈగ్రంథమునకు చివర ఒకటి, రెండు అనుబంధములలో నియ్యబడిన జనసంఖ్యావివరములను శ్రీయుత పండిత జవాహర్లాల్ నెహ్రూగారు చాలప్రయాసపడి క్రిందటి జనాభాలెక్కలనుండి తయారుచేసిరి. మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగానున్న పాంచాలము, వంగదేశములకుమాత్రమే యీ



వివరము లియ్యబడినవి. ఈవివరములనుబట్టి రెండురాష్ట్రములలో తమకు హెచ్చుస్థానములు రావేమో యని మహమ్మదీయులు పడుచున్న అనుమానములకు కారణములేవియు లే వనియు, కృత్రిమరక్షణము లేమియు లేకయే స్వతస్సిద్ధమగు తమ అధికజనసంఖ్యకు తగిన స్థానములు చేకూరగల వనియు నిస్సందేహముగా తెలియుచున్నది. మహమ్మదీయులు తగినంతమంది రారేమో యనియు, ఒకవేళ హిందువులకంటె కొంచెము హెచ్చు స్థానములు తమకు లభించినను ఈ రెండు రాష్ట్రములలో విద్యయందును సంపత్తియందును హిందువులకంటె కొరవడియున్న మహమ్మదీయులకు హెచ్చులాభము లేదనియు మహమ్మదీయులు వాదించెదరు. రాష్ట్రముల మొత్తముమీద జనసంఖ్యనుబట్టి విచారించినచో వారి వాదములో పటుత్వమేమైన నుండునేమో కాని, ప్రతి డివిజన్‌లోను, ప్రతి జిల్లాలోను జనసంఖ్యావివరములనుబట్టి యాలోచించినచో వారివాదము నిస్సార మని తేటపడకమానదు.

స్వతంత్రనియోజకవర్గములే యుండి స్థానములను ప్రత్యేకించుపద్ధతి లేకపోయినయెడల మహమ్మదీయులకు నష్టము వాటిల్లు ననుభయమున కేమాత్రమును కారణములు లే వని పాంచాల వంగదేశములయందలి జనాభావివరములవలన తెలిసికొననగును. ఈ రెండురాష్ట్ర

లలో మొత్తముమీదను జూచినను మహమ్మదీయులే హెచ్చు కాని పరిపాలనాసౌకర్యార్థము విభజింపబడిన జిల్లా డివిజనులవారీగా నాలోచించినచో నీ యాధిక్యము మరింత హెచ్చు నని వ్యక్తమగును. ఈ రెండు రాష్ట్రములలో వివిధప్రాంతములయందు ప్రత్యేకసంఘ ప్రాబల్యముండుటచే ఆయాసంఘములకు స్వాభావికముగా కొన్ని స్థానములు గారంటీ చేయబడుటవలన కృత్రిమరక్షణము అనవసర మగుచున్నవి.

మొదట పాంచాలము విషయమున నాలోచింతము. ఈ రాష్ట్రమునకు ఉత్తరమున పశ్చిమోత్తరదిక్కునాక్రమించుకొని మహమ్మదీయపరగణా కలదు.

పాంచాలము

ఈపరగణాలో మహమ్మదీయులు చాల బలీయమగు స్థితియం దున్నారు. ఈపరగణాలోని యితర సంఘము లేవియు వీరి హక్కులకు భంగము కలుగజేయుట యసంభవము. ఇట్టులే రాష్ట్రమునకు దక్షిణ దిక్కున హిందూపరగణా కలదు. ఈపరగణా మహమ్మదీయ పరగణాకంటె కొంచెము చిన్నది. దీనిలో హిందువులును, సిక్కులును సరిసమానముగా నున్నారు. ఈ రెంటికిని మధ్యను ఒకపరగణా కలదు. దీనిలో మహమ్మదీయులు హెచ్చుగానున్నను చాల అతిశయముగా లేరు. ఈవిభాగములవలన మహమ్మదీయులు తాము మిక్కిలి బలీయ



ముగానున్న భాగమునుండియే నూటికి 47 స్థానముల నాక్రమించుకొనగల రని మా యభిప్రాయము. హిందువులును సిక్కులును కలసి నూటికి 30 స్థానముల నాక్రమించుకొనగలరు. మిగిలిన నూటికి 23 వంతుల స్థానములు, మహమ్మదీయులు హెచ్చుగా నున్న భాగమున (సిక్కులు హిందువులు కలసినదానికంటె హెచ్చుజనాభాగల భాగము)నుండికాని, మహమ్మదీయులు ప్రత్యేకముగా హిందువులకన్నను, సిక్కులకన్నను హెచ్చుగా నున్న జిల్లాలనుండికాని యెన్నుకొనబడుదురు. ఎన్ని యాటంకము లున్నను, రాష్ట్రీయశాసనసభలో హెచ్చు సభ్యత్వములు లభించుటకు వీలగునన్ని స్థానములనైనను మహమ్మదీయు లీభాగమునుండి యాక్రమించుకొనజాల రని మేము నమ్మజాలము.

ఈగ్రంథమునకు చివర మొదటి అనుబంధములో ప్రతిజిల్లా జనసంఖ్యను, ఆ జనసంఖ్యనుబట్టి శాసనసభలలో వారికి రాదగిన స్థానముల వివరమును చర్చించితిమి. కొన్నిటినిమాత్ర మిచ్చట సూచించెదము.

బ్రిటిష్ పరిపాలిత పాంచాలదేశముయొక్క జనాభా (1921 సంవత్సరపు జనాభానుబట్టి) సంఘముల వారీగా క్రిందివిధమున నుండెను.

| | |
|---|---|
| మహమ్మదీయులు | 1,14,44,321-55.3% |
| హిందువులు | 65,79,260-31.8% |
| సిక్కులు | 22,94,207-11.1% |
| ఇతరులు (హెచ్చుగా క్రైస్తవులు) | 3,67,236-1.8% |

రాష్ట్రములో 29 జిల్లాలు కలవు. ఈ జిల్లాలను 4 పరగణాలుగా మేము విభజించితిమి.

1-వ విభాగము

మహమ్మదీయులు చాలవిశేషముగానున్న జిల్లాలు 15 నింటిని మహమ్మదీయ పరగణా యని పిలిచెదము. (ఉత్తరము, పశ్చిమోత్తరభాగము) ఈపరగణాయందు ఒక జిల్లాలో మహమ్మదీయులు నూటికి 91 కలరు. 9 జిల్లాలలో మహమ్మదీయులు నూటికి 80 కిని 90 కిని లోపు; రెండు జిల్లాలలో నూటికి 71, లేక కొంచెము హెచ్చు; మూడు జిల్లాలలో నూటికి 63.3; 61.9; 60.7 ప్రకార ముండిరి. చివరమూడుజిల్లాలలో మహమ్మదీయులు ప్రక్కజిల్లాలంత హెచ్చుగా లేకపోయినను, హిందువులు సిక్కులు చేరిన దానికంటె గూడ హెచ్చుజనాభా గలవారగుటచే వారి నీ పరగణాలో చేర్చితిమి. ఈ మూడుజిల్లాలలో హిందూ మహమ్మదీయ సిక్కుజన మీా క్రిందివిధముగా నుండెను. షేక్ పురాజిల్లాలో మహమ్మదీయులు 63.3% హిందువులు



16.0%, సిక్కులు 15.9%, సెయిల్ కోటజిల్లాలో మహమ్మదీయులు 61.9% హిందువులు 19.5%, సిక్కులు 8.0% లయల్ పురజిల్లాలో మహమ్మదీయులు 60.7%, హిందువులు 18 1%, సిక్కులు 16.4%.

ఈ జిల్లా లన్నిటియందును మహమ్మదీయేతరులు ఒక్కమతమునకు గాక హిందూ, సిక్కు, క్రైస్తవాది మతములకు చెందియున్నారని జ్ఞాపక ముంచుకొనవలెను.

ఒకలక్షజనాభాకు ఒక్కసభ్యు డని తలచినచో ఈమహమ్మదీయ పరగణాలోనే 98 గురుసభ్యులు, అనగా శాసనసభలోని మొత్తము సభ్యులలో నూటికి 47.3 స్థానములు మహమ్మదీయులకు లభించుట నిశ్చయము.

II-వ విభాగము

రెండవ విభాగమునందు హెచ్చుమహమ్మదీయులున్న పరగణాకలదు. దీనిలో లంహోర్, గురుదాస్పూర్ జిల్లా లున్నవి. ఈరెండుజిల్లాలలోను హిందూసిక్కు జనాభాకంటె మహమ్మదీయులజనసంఖ్య హెచ్చుగా నున్నది. లాహోర్ లో మహమ్మదీయులు 57.3% ఉన్నారు. కాని మొదటి విభాగములో నున్నంత హెచ్చుగా లేరు. ఈ రెండు జిల్లాలలోను శాసనసభ కెన్నుకొనబడవలసిన సభ్యులు $19\frac{1}{2}$ అనగా శాసనసభలోని మొత్తము సభ్యులలో 9.4%.

### III-వ విభాగము

ఈవిభాగమున 3 జిల్లాలున్నవి. వీనిలో నేయొక్క సంఘము చాల బలీయముగా లేదు. కాని యిచ్చటకూడ మహామ్మదీయుల సంఘశక్తి ప్రత్యేకముగా హిందూసంఘశక్తి కంటె, సిక్కుల సంఘశక్తికంటె హెచ్చుగానున్నది. ఈ జిల్లాలలో శాసనసభల కెన్నుకొనబడవలసిన సభ్యులు $27\frac{1}{2}$ అనగా శాసనసభలో మొత్తముసభ్యులలో 13.3%.

### IV-వ విభాగము

9 జిల్లాలుచేరిన ఈ విభాగమును హిందూ సిక్కు పరగణా యని పిలిచెదము. దీనినుండి శాసనసభ కెన్ను కొనబడవలసిన సభ్యులు $61\frac{1}{2}$, అనగా శాసనసభలో మొత్తము సభ్యులలో 29.7%.

ఈ విభాగములయందలి జనసంఖ్యనుబట్టి విచారించినచో మహామ్మదీయపరగణాలో మహామ్మదీయులకు నూటికి 47.3 స్థానములు తప్పవు; రెండవ విభాగములో హిందువులకంటె 9.4 స్థానములను హెచ్చుగా వా రాక్రమించుకొనెదరు; మూడవవిభాగములో నూటికి 13.3 స్థానములలో కొన్నిస్థానములైనను వారికి లభింపకపోవు. సగటున శాసనసభలో హిందువులకంటె వారు హెచ్చు స్థానముల నాక్రమించెద రనుట స్పష్టము.



**వంగదేశములోని జనసంఖ్యా వివరములు**

వంగదేశమునందలి జనసంఖ్యా వివరముల నాలోచించినచో నీవిషయములే మరింత స్పష్టముగా తెలియగలవు. రెండవ అనుబంధమున నీవిషయమున మేము ప్రత్యేకముగా సంఖ్యల నిచ్చినాము. ఇచ్చట వానిని సంగ్రహముగా చెప్పెదము. వంగదేశపు జనాభా యిట్లున్నది.

| | |
|---|---|
| మహామ్మదీయులు | 2,52,10,802......54.0% |
| హిందువులు | 2,02,03,527......43.3% |
| ఇతరులు (కొండజాతులు, క్రైస్తవులు) | 12,81,207......2.7% |
| వెరసి బెంగాల్ జనాభా (బ్రిటిష్ పరిపాలనము) | 4,66,95 536......100% |

ఇచ్చటకూడ పాంచాలమునందువలె వివిధ పరగణాలు గాంచనగును. వాని నిట్లు విభజింపవచ్చును.

### 1-వ విభాగము

మహామ్మదీయులు చాల హెచ్చుగా నున్న పరగణా. ఈ విభాగమున 13 జిల్లా లున్నవి. శాసనసభకు ఈభాగమునుండి ఎన్నుకొనబడుసభ్యులసంఖ్య 282, అనగా శాసనసభలోని మొత్తము సభ్యులలో నూటికి 60 వంతులు.

2-వ విభాగము

మహామ్మదీయులు హెచ్చుగానున్న పరగణా. రెండుజిల్లాలు కలవు. శాసనసభలోని మొత్తముసభ్యులలో 100 కి 5 వంతులు.

3-వ విభాగము

హిందువులు హెచ్చుగా గాని, హిందువులును మహామ్మదీయులును సరిసమానముగా నున్న పరగణా. దీనిలో నాలుగుజిల్లాలు కలవు. ఈపరగణానుండి శాసనసభకు పంపదగిన సభ్యులసంఖ్య 42, అనగా శాసనసభయందలి మొత్తము సభ్యులలో నూటికి 9 వంతులు.

4-వ విభాగము

హిందువులు చాలహెచ్చుగా నున్న పరగణా. ఈ విభాగమున 9 జిల్లాలు కలవు. దీనినుండి శాసనసభకు పంపదగిన సభ్యులసంఖ్య 118, అనగా నూటికి 25 వంతులు.

పై విభాగములలోని జనసంఖ్య వివరములవలన మహామ్మదీయులు చాలహెచ్చుగానున్న పరగణానుండి మాత్రమే నూటికి 60 కంటెహెచ్చుగా సభ్యులు శాసనసభలలో చేరెద రని వ్యక్తమగుచున్నది. మహామ్మదీ



యులు హెచ్చుగానున్న రెండవ విభాగమున కూడ హిందువులు విస్తారముగా నున్నను, మహామ్మదీయుల కన్న తక్కువగానే యున్నారు. కావున హిందువులకు సభ్యత్వస్థానములను ప్రత్యేకించుపద్ధతి లేనియెడల సమష్టి నియోజకవర్గపద్ధతివల్ల నష్టపడెదరు.

బెంగాల్ జిల్లా బోర్డు ఎన్నికలు

వంగదేశమున నిటీవల జరిగిన జిల్లాబోర్డు ఎన్నికలలో నీవిషయము అద్భుతముగా ప్రకటితమైనది. ఈ ఎన్నికలకు సంబంధించిన వివరములను నివేదికకడపట మూడవఅనుబంధమున నిచ్చుచున్నాము. ఈ బోర్డునకు ఎన్నికదారులలో కొందరు హిందువులును, కొందరు మహామ్మదీయులును గలరు. వా రందరు కలసి సభ్యుల నెన్నుకొనెదరు. ఈఎన్నికదారుల పట్టికయందు కొంత ఆస్తిగలవారును, ప్రభుత్వమునకు కొంత సిస్తు చెల్లించువారును మాత్రమే యున్నారు. వారివారి జనసంఖ్యలనుబట్టి పట్టిక నిర్ణయింపబడలేదు. ప్రజలందరకు వోటింగు అధికారము న్నయెడల మహామ్మదీయులలో వోటర్లు హెచ్చుగా నుండవలసినది. కాని, హిందువులకంటె మహామ్మదీయులు బీదవారగుటచేతను, ప్రభుత్వమునకు తక్కువసిస్తు నిచ్చువారగుటచేతను పట్టికలో చేర్చబడినవారి సంఖ్య జనాభానుబట్టి నిర్ణయించినదానికంటె చాలతక్కువగా నుండ

వలెను. ఐనను మైమన్‌సింగ్, చిట్టగాంగ్, జస్సోర్ జిల్లా
లలో మహామ్మదీయులు అల్పసంఖ్యాకసంఘ మగు హిం
దూసంఘమునూడ్చి, స్థానముల నన్నింటిని తామే యాక్ర
మించుకొనిరి. మొదటి రెండుజిల్లాలలో హిందువులు
నూటికి 24 వంతు లున్నను, ఒక్క హిందువు
డైనను జిల్లాబోర్డు సభ్యుడు కాజాలకపోయెను.
హిందువులు నూటికి 38.2 ఉన్న మూడవ జిల్లాయందు
ఒక్క సభ్యుడుమాత్రమే యెన్నుకొనబడెను. ఇక మహ
మ్మదీయులు చాల అల్పసంఖ్యాకులుగానున్న జిల్లాలో
ఎన్నిక లెట్లునవి? నూటికి 3, 4 కంటె హెచ్చుగాలేని
జిల్లాలలోగూడ వారు 1 నుండి 3 సభ్యులవరకు ఎన్ను
కొనగలిగిరి. హిందువులును మహమ్మదీయులును సరిస
మానముగా నున్న జిల్లాల విషయము తెలిసికొనదగును.
ఇట్టివి కూల్నా, దినాజ్‌పూర్ అను రెండుజిల్లాలు కలవు.
హిందువులు నూటికి 50 వంతులును, మహమ్మదీయులు
నూటికి 49.8 వంతులును గల మొదటిజిల్లాలో హిందు
వులు 11 స్థానములను, మహమ్మదీయులు 5 స్థానములను
ఆక్రమింపగలిగిరి. మహమ్మదీయులు నూటికి 49 వంతు
లును, హిందువులు 44 వంతులును గల రెండవ జిల్లాలో
మహమ్మదీయులకు 14 స్థానములును, హిందువులకు 4
స్థానములు లభించెను ఈరెండు సంఘముల వోటర్ల



బలిమి సరిగా తెలియనిది, కేవలము జనాభా లెక్కలమీద
నాధారపడుట అంత క్షేమకరము కాదు. కాని పైని జెప్పిన
వివరములవలన వంగదేశమునందలి హిందువుల కితర
సంఘముల నన్నిటినుండి ప్రత్యేకరక్షణ మేమియు నవసర
ము లేదనియు, తమహస్తములపై ఆధారపడగల శక్తి
వారికి గలదనియు స్పష్టమగుచున్నది. ఈసందర్భములో
జెస్సూరు జిల్లాసంగతి చెప్పదగియున్నది. మహమ్మదీయులు
తమజిల్లావ్యవహారములలో పాల్గొనక ఉదాసీనతవహించిన
రోజులలో హిందువులు జిల్లాబోర్డ్ల నాక్రమించుకొని
ప్రభుత్వము చేయసాగిరి. కానిమహమ్మదీయులు తమవిధ్యు
క్తమును గ్రహించినప్పటినుండియు పరిస్థితులు తారుమా
రైనవి. స్థానములను హెచ్చుగా వారే యాక్రమించుకొన
మొదలిడిరి. సభ్యత్వముల నాక్రమించుటయేకాక మహ
మ్మదీయాధ్యక్షుని, మహమ్మదీయోపాధ్యక్షుని గూడ
నెన్నుకొనగలిగిరి. ఈజిల్లాచరిత్రయందిట్టిదెన్నడును జరగి
యుండలేదు. ఈజిల్లాబోర్డు ఎన్నిక లైనతరువాత వంగ
దేశమునందలి మహమ్మదీయాభిప్రాయమునందు చాల
మార్పు గలిగిన దని మాకు తెలియుచున్నది. సాంఘిక
నియోజక వర్గములయందు వారికి గల మక్కువ తొలగి
సంయుక్తనియోజకవర్గములయెడ నభిమానము హెచ్చి
నది. సాంఘికవైషమ్యమునందలి గ్రహచార మేమో

కాని ప్రజలు సత్యపరిస్థితులను గమనింపక కనులుండియు లేనివారివలె తమక్షేమమునకు భంగకరమగు మార్గములనే త్రొక్కెదరు. పాంచాల, వంగదేశములయందు సాంఘికనియోజకవర్గములే యుండవలె నని పెద్దప్రకటనలను చేసి, గందరగోళము చేయుచున్నవారు చిట్టచివర నిచ్చిన మూడు అనుబంధములను జాగరూకతతో పఠించెద రని కోరుచున్నాము.

ఆర్థికపరిస్థితులు, విద్య

పైని వివరింపబడిన సంఖ్యలనుబట్టి యాలోచించినచో పాంచాల వంగదేశములయందలి మహమ్మదీయుల భయభ్రాంతులు వట్టి మిథ్యయని తేటపడగలదు. ఈ భయమునకు కారణమొకటిగలదు. హిందువులును, సిక్కులునుమహమ్మదీయులకన్న ధనవంతులును, విద్యావంతులు నగుటవలన తమ్మునడగద్రొక్కెదరని మహమ్మదీయులు భయమందుచున్నారు. వంగదేశమునందలి జిల్లాబోర్డు ఎన్నికలలో హిందువుల యాధిక్యమెందుకు పనికివచ్చినది? ఈ విధముగానే శాసనసభల యెన్నికలలో గూడ మహమ్మదీయులే హెచ్చుస్థానముల నాక్రమించుకొందురనుట నిశ్చయము. నంగదేశమువందు హిందువులకంటె మహమ్మదీయులు విద్యయందును, ధనమునందును వెనుకబడియున్నమాట వాస్తవమే. ఆధునిక ప్రజాసంఘములందు



ధనమూల మిదం జగత్' అనుమాట కూడ వాస్తవమే. ధనముగలవారు శాసనసభలలో స్థానముల నాక్రమించుటకుగూడ లక్ష్యముచేయక, సభలలో నున్నవారిని వశపరుచుకొన జూచుచుందురు. స్థానములను ప్రత్యేకించుటగాని ప్రత్యేకనియోజకవర్గముల నేర్పరచుటగాని ధనికుల పలుకుబడి నేమాత్రమును తగ్గింపజాలదు. ఎంతవరకు ప్రజలు సంఘమే తమ సర్వస్వ మని తలచి సంఘమునకే తమ కృషిని సల్పెదరో, అంతవరకు అసలుసమస్య కట్టెదుట గాన్పించదు. సమస్య నభిముఖము చేసికొనిననే కదా, సమస్యాపరిష్కార మగుట.

కొలదిమంది ధనికులనుండి ద్రవ్యము సామాన్య ప్రజలకు సంక్రమించు పద్ధతులను గురించి యాలోచించి సలహా నిచ్చుటకు మేము నియోగింపబడలేదు. ఇప్పుడు సంఘములకు ప్రత్యేకపుహక్కులను కోరుచున్నసాంఘిక ప్రతిష్ఠాపనలుగూడ ప్రస్తుత సాంఘికపరిస్థితులను మార్పుచేయవలె నని కోరుట లేదని మే మూహించుచున్నాము. దీని నొప్పుకొనినయెడల విద్యయందును, ధనమునందును కొరవడిన సంఘములకు కొన్ని ప్రత్యేక సౌకర్యములను, రక్షణములను ఒసంగుటతప్ప మరేమియు వీలుకాదు.

భారతదేశమునకు స్వరాజ్యము లభించి, దేశీయ సమస్యలయందు విదేశీయులజోక్యము లేకుండ భారత

స్వతంత్రభారతదేశమున పార్టీలు

ప్రజలు స్వతంత్రముగా తమ వ్యవహారములను పరిష్కరించుకొను సమయమున భారతప్రజలచిత్తములు జాతీయ శ్రేయమునకు కారణభూతము లగు ప్రధాన విషయము లకై మరలు ననుట నిస్సందేహము. స్వతంత్రభారత వర్షమున శాసనసభలు పరిష్కరింపవలసిన ప్రశ్నలలో సాంఘికసమస్య లెన్నియుండును? అధికముగా నుండునా? లేదు. ఎప్పుడైన నొక్కవిషయము చర్చింపబడవచ్చును. కాని భారతీయు లందరకు వర్తించు విషయములే అధికముగా చర్చింపబడును. రాబోవు భారత ప్రభుత్వము యొక్క జాతీయదృక్పథమునకు ఫలితముగా శాసనసభలలోను, వెలుపలను ఏర్పడబోవు రాజకీయ కక్షలు ఇప్పటివలెగాక నూతన పద్ధతులపై నాధారపడియుండును. బహుశః ఆర్థికవ్యవస్థపై నాధారపడు నని మేము తలతుము. అప్పుడు హిందువులు మహమ్మదీయులతోడను, మహమ్మదీయులు సిక్కులతోడను పెనగులాడక హిందువులును, మహమ్మదీయులును, సిక్కులును కలసిన పార్టీ యొకటి, మరియొకపార్టీకి చెందిన హిందూ సిక్కు ముసల్మానులతో ప్రతిఘటించెదరు. బాధ్యతాయుత ప్రభుత్వమే లభింపవలెను గాని, లభించిన నిట్లు జరగుట నిశ్చయము.



ఇప్పుడు హిందువులవిషయమును, సిక్కులవిషయమును ఆలోచింతము. పాంచాలమునందును, వంగదేశమునందును అధికసంఖ్యాకులగు మహమ్మదీయులకు స్థానములను ప్రత్యేకింపకపోవుటకంటె, ప్రత్యేకించుటయే హిందువులకును సిక్కులకును హెచ్చు లాభకర మని తోచును. మేము తెలియజేసిన వివరములవలన స్థానములను ప్రత్యేకించు పద్ధతియే లేనట్టి సంయుక్తనియోజకవర్గములవలన పాంచాలమునందును వంగదేశమునందును మహమ్మదీయులకు వారిజనసంఖ్య ననుసరించి రావగిన వానికంటె హెచ్చుస్థానములు లభించు నని తేటపడినది. కావున సంయుక్త నియోజకవర్గములో హిందువులకును, సిక్కులకును వారి జనసంఖ్యకు న్యాయముగా రాదగిన స్థానములకంటె తక్కువ స్థానములు లభింపవచ్చును. ఇట్లు జరుగుటకు చాల నవకాశములు కలిగిన కలుగవచ్చును. కాని యీ యవకాశము లన్నిటికిని ప్రతిక్రియల నరయుచుండుట సాధ్యమా? అన్నిటికన్న మేమొసంగెడి రక్షణములతోకూడిన నియోజకస్వాతంత్ర్యమే ప్రశస్తమగు పద్ధతి యని స్పష్ట మగును.

మహమ్మదీయులకు స్థానములను ప్రత్యేకించుట, హిందువులకును సిక్కులకును లాభకరము

పైన వివరించిన సాధకబాధకముల నన్నిటిని డాక్టర్ అన్సారీగా రుండగా మేము చేసినయిష్టాగోష్ఠి సభలో సంపూర్ణముగా చర్చించి, ఏకగ్రీవముగా నీ క్రిందితీర్మానమును జేసితిమి.

ఇష్టాగోష్ఠి సభ

“అల్పజనసంఖ్యాకసంఘముల కైనను, అధికజనసంఖ్యాకసంఘముల కైనను శాసనసభలలో సభ్యత్వములను ప్రత్యేకించుటకు మేము విముఖులమై యున్నాము. రాజ్యాంగవిధానమున నిట్టి ప్రత్యేకించుట లుండరా దని మేము సిఫారసు చేయుచున్నాము. కాని అఖిలపక్షమహాసభవారు మా సిఫారసు నంగీకరింపకజాలక, జనాభా ననుసరించి స్థానములను ప్రత్యేకించుపద్ధతినే యంగీకరించుచో అధికసంఖ్యాకసంఘ మనియు, అల్పసంఖ్యాకసంఘ మనియు తారతమ్యము లేక సమభావముతో ప్రత్యేకింపవలె నని కోరుచున్నాము. మరియు స్థానములను ప్రత్యేకించు పద్ధతి పది సంవత్సరములు కాగానే, లేదా ఉభయులు సమ్మతించిన నంతకుపూర్వమే రద్దుచేయబడవలెనని యొక ప్రత్యేకనిబంధన యుండవలెను.”

సర్దార్ మంగళసింగుగారు పైసిఫారసులో నొక భాగమునకు అసమ్మతిని జూపుచు నీ క్రిందివాక్యములను పొందుపరచిరి.



“శాసనసభలో అధికజనసంఖ్యాక సంఘములకు గాని, అల్పజనసంఖ్యాకసంఘములకు గాని స్థానములను ప్రత్యేకించుపద్ధతి యుండరా దని మాసంఘము చేసినపై తీర్మానములోని మొదటిభాగమును నే నామోదించుచున్నాను. కాని అధికజనసంఖ్యాకసంఘములకు స్థానములను ప్రత్యేకించి శాసనపూర్వకముగా వానికి ఆధిక్యమును కల్పించుట, ఎట్టిపరిస్థితులయందును, ఎంత స్వల్పకాలమునకైనను నే నొప్పుకొనజాలను. స్థానములను ప్రత్యేకించుపద్ధతిమీదనే వివిధపక్షములవారికిని ఐకమత్యము కుదురుచో, అల్పసంఖ్యాక సంఘములలో ప్రాముఖ్యము వహించిన సిక్కు సంఘముయొక్క హక్కులను గమనించి లక్నో ఒడంబడికలో బీహార్ మొదలగు రాష్ట్రములలోని మహమ్మదీయుల కనువర్తింపజేసిన పద్ధతిని సిక్కులకుగూడ ననువర్తింపజేసి, వారికి జనసంఖ్యనుబట్టి న్యాయతః రాదగిన స్థానములకంటె హెచ్చుస్థానములు వచ్చునట్లు చేయవలెనని నేను సిఫారసు చేయుచున్నాను. మరియు భారతశాసనసభలోగూడ సిక్కులకు ప్రత్యేక ప్రోత్సాహము చూపవలెనని నేను సూచించుచున్నాను.”

మా తీర్మానమునందలి మొదటిభాగము ఇష్టాగోష్ఠి సభవారియొక్క అసలు సిఫారసనియు, ఈ సిఫారసును అఖిలపక్షమహాసభవా రొప్పుకొనజాలక, జనాభా

ననుసరించి స్థానములను ప్రత్యేకించుపద్ధతినే యొప్పుకొన గలిగినచో, అట్టి యవసరమునకు రెండవభాగము వర్తించు ననియు తేటపడగలదు. రెండవభాగమువిషయమున మా సంఘసభ్యులకు ఏకీభావము కుదురకపోవుటమాత్రమే కాక, మొదటిభాగమున స్థానములను ప్రత్యేకించుపద్ధతియే పనికిరా దనునభిప్రాయమును సంఘమువారేకగ్రీవముగా తెలియజేసినారు. తీర్మానమునందలి రెండవభాగము విషయమున అఖిలపక్షమహాసభలోకూడ ఏకీభావము కలుగుట మిక్కిలి యసంభవము. ఒకవేళ కలిగినను, దానిలో చేరిన వారందరు ఒడంబడికకు కట్టుబడియుండవలసినవారే. అట్టి సందర్భమున పదిసంవత్సరములకన్న హెచ్చుకాలము వరకు నీపద్ధతి అమలులో నుండరా దనిమాత్రము మా తీర్మానములోని రెండవభాగము చెప్పుచున్నది. మేము వేనిని స్పష్టముగా నిరాకరించితిమో అవి మా సలహాలెంతమాత్రమును కాజాలవు. స్థానములను ప్రత్యేకించుట మంచిపద్ధతి కాకపోయినను, వివిధపార్టీలును వివిధసంఘములును దానివిషయమై ఒక్క తీర్మానమునకు వచ్చుట చాల లాభకరమనియే మేము గ్రహించుచున్నాము. మేమంగీకరింపకపోయినను, ఒడంబడిక కుదురుచో నది అమలులో నుండవలసిన కాలమునకు పరిమితి యేర్పరుచుట తప్ప మేము చేయదగిన దేమియు లేదు. మేము చేసిన



దిదియే. తమ జనాభా ననుసరించి న్యాయతః చేకూరు స్థానములకన్న హెచ్చుస్థానములు వచ్చునట్లు చేయవలె నని మహమ్మదీయులును, సిక్కులును కోరు కోర్కెల విషయమున నొక్కమాట చెప్పవలసియున్నది. పైని వివరించిన యభిప్రాయములవలన (తమసంఘ మెంత ప్రాముఖ్యము వహించినదని వారు తలచినను) ఏసంఘమునకును ప్రత్యేకసౌకర్యముల నొసంగుటకు వీలు లేదని వేరుగా చెప్ప నవసరము లేదు.

ఇప్పుడు స్వల్పజనసంఖ్యాక సంఘములకు స్థానములను ప్రత్యేకించుటనుగురించి పైని సూచింపబడిన యిష్టాగోష్ఠి సభాతీర్మానమునకు వత్తము.

స్వల్ప జనసంఖ్యాక సంఘములకు స్థానములను ప్రత్యేకించుట

పాంచాలమునందును, వంగదేశమునందును తప్ప తక్కిన రాష్ట్రములయం దన్నిటియందును మహమ్మదీయులు స్వల్ప సంఖ్యాకులై యున్నారు. భారతదేశము మొత్తముమీద వారు నూటికి 24 వంతులున్నను, కొన్ని రాష్ట్రములలో స్వల్పసంఖ్యాకులుగాను మరికొన్ని రాష్ట్రములలో గణనకు రానంత స్వల్పముగాను ఉన్నారు.

ఇష్టాగోష్ఠిసభలో నీవిషయమున తీర్మాన మామోదింపబడినతరువాత, నది మహమ్మదీయులకు చాల

మహమ్మదీయులు స్వల్ప సంఖ్యాకులగు చోట్ల జనాభానను సరించి స్థానము ప్రత్యేకించుట

నిబ్బంది కలుగజేయు నని మాకు తెలుపబడెను. మా తీర్మానము ననుసరించి, 500 సభ్యులు గలిగిన భారత శాసనసభకు, పాంచాల వంగ దేశములనుండి 30 లేక 40 సభ్యులును, సంయుక్తప్రాంతములనుండియు బీహారు నుండియు ఒకరిద్దరును ఎన్నుకొనబడుదురనియు, నూటికి 7 వంతులకన్న తక్కువజనాభా గలిగిన యితర రాష్ట్రములనుండి యొకసభ్యుడైనను ఎన్నుకొనబడుటకు వీలు లేదనియు స్పష్టముచేయబడెను. ఇందువలన భారత దేశములో మహమ్మదీయులు నూటికి 24 వంతు లున్నను భారత శాసనసభలో సభ్యులుమాత్రము నూటికి10వంతులకంటె హెచ్చుగా నుండ రని వాదింపబడెను. ఇట్టులే రాష్ట్రీయ శాసనసభలలోకూడ మహమ్మదీయులు అతిస్వల్పసంఖ్యాకులుగా నెన్నుకొనబడుదురని వాదింపబడెను. ఈవాదములో చాల సత్యమున్నదని మే మొప్పుకొంటిమి. మరియు నీవిషయములోనే బలీయమగు హేతువులుండుటవలన కొంత కాలమువరకును దేశమునందలి యెన్నికపద్ధతియందు సాంఘికరక్షణమును తప్పనిసరిగా నొప్పుకొనవలసినవారమైతిమి. కావున జులై 7-వ తారీఖున ఇష్టాగోష్ఠిసభలో మేము చేసిన తీర్మానము నంతయు సిఫార్సు చేయలే



కున్నాము. పాంచాల వంగ దేశములయందు తప్ప తక్కిన రాష్ట్రము లన్నిటియందును, మహమ్మదీయులు తమకు స్థానములను ప్రత్యేకింపవలసిన దని కోరినయెడల, వారికి భారతశాసనసభలోను, రాష్ట్రీయశాసనసభలలోను జనాభా ననుసరించి స్థానములను ప్రత్యేకించుపద్ధతి నొప్పుకొని స్వల్పసంఖ్యాకులగు మహమ్మదీయులకు కొంతరక్షణము నియ్యక తప్పదని తలచుచున్నాము. సాంఘికప్రాతినిధ్యము మంచిది కాకపోయినను కొంతకాలమువరకును దీని నట్టిపెట్టుట యవసర మని మాయభిప్రాయము. మహమ్మదీయాల్పసంఖ్యాకులకు ఈహక్కు నొసంగుటవలన, అధిక సంఖ్యాకులగు మహమ్మదీయులకు స్థానములను ప్రత్యేకించుటవలన కలుగు నపభ్రంశములనే ప్రవేశపెట్టుటలేదని తెలియగలదు. స్థానములను ప్రత్యేకించినను, ప్రత్యేకింపకపోయినను, స్వల్పజనసంఖ్యాకసంఘములు అధికజన సంఖ్యాకసంఘములకన్న తక్కువగానే యుందురుగాని వారిపైనధికారము చెలాయించుట కెన్నటికిని శక్తివంతులై యుండరు.

లక్నోపాక్టునందును, మాంటెగ్యూ ఛెమ్సుఫర్డు ప్రణాళికయందును, అనేక రాష్ట్రములలో మహమ్మదీయుల జనసంఖ్యప్రకారము వారికి న్యాయముగా రావలసిన స్థానములకన్న హెచ్చుస్థానములు లభించుట మా విధానము

జనాభాకంటె హెచ్చు స్థానములు వల్లగాదు

నవలంబించుటవలన అసంభవము. ప్రత్యేకనియోజకవర్గము లేర్పరచుటవలననే యట్టి ప్రాతినిధ్యము సాధ్యపడునుగాని, సంయుక్త నియోజకవర్గములో సాధ్యపడదు. మహమ్మదీయాల్ప జనసంఖ్యాక సంఘములకు జనాభా ననుసరించి న్యాయముగా రాదగిన స్థానములకన్న హెచ్చుస్థానములను ప్రత్యేకించుట సాధ్యము కాక పోదు. కాని, అధికజనసంఖ్యాక సంఘములకును, ఇతర సంఘములవారికిని ఈపద్ధతివలన అన్యాయము కలుగుటయేకాక, మహమ్మదీయులు జాతీయపద్ధతి ననుసరించి యభివృద్ధిని జెందుటకుగూడ నిది హానికరమని మా యభిప్రాయము. వారిజనాభా ననుసరించి రాదగిన స్థానముల నన్నిటిని వారికి మేము ప్రత్యేకించితిమి. అంతకంటె హెచ్చుస్థానములు కావలె నన్నచో స్వయంకృషివలన సంపాదించుకొనవలసి యున్నది. వారికి ప్రత్యేకింపబడిన స్థానములకంటె హెచ్చుస్థానములకు పోటీచేయకూడదని మేము వారి కేయాటంకములను కలుగజేయదలప లేదు. ఇప్పుడు నిర్ణయింపబడిన స్థానములకంటె హెచ్చుస్థానములను బడయుటకు వారి కెంతసమర్థత యుండినను, అట్లితర స్థానములను వారు పడయుట కట్టియభ్యంతరములు కలుగకుండ జేయుటయే మహమ్మదీయ అల్పసంఖ్యాకులకు



స్థానములను ప్రత్యేకించుపద్ధతి నంగీకరించుటలో మాముఖ్యోద్దేశమై యున్నది. వారిజనాభా ననుసరించి రాదగిన స్థానములకన్నను కూడ హెచ్చుస్థానములను ప్రత్యేకించుటకంటె, పెద్దవైనను సరే, చిన్నవైననుసరే, దేశములో నన్నిసంఘములును, రాజకీయాభివృద్ధి నొందుటకు అవకాశముల నేర్పచుట ముఖ్యతర మని మాయభిప్రాయము. ఇట్లొక్కసంఘమునకు స్థానములను ప్రత్యేకించుటవలన ఆ సంఘమునకు, అన్యసంఘముతో బహిరంగమగు పోటీ లేశమాత్రమైనను ఉండదు. కావున అభివృద్ధి యాగిపోవును. మహమ్మదీయాభ్యర్థులు తమకు పోటీగా నిలిచినయితర మహమ్మదీయాభ్యర్థుల నోడించుటకు మహమ్మదీయేతరుల వోట్లను యాచింపవలసివచ్చు ననుట సత్యమే. కాని యీ మార్గమువలన మహమ్మదీయులు జాతీయపద్ధతుల ననుసరించి యభివృద్ధి నొందుటకు అవకాశము లేర్పడవు. దీనివలన ఇద్దరు మహమ్మదీయులలో నెవరు సమర్థులు? ఎవరు అసమర్థులు? అనునదియే తెలియునుగాని, వీరిద్దరికన్న మహమ్మదీయేతరులలో నుత్తము లున్నారా, లేరా యనువిషయము నిశ్చయమగుట కవకాశము లేదు.

తమ జనాభా ననుసరించి రాదగినస్థానములకంటె హెచ్చుస్థానములను కోరుచు, దానితోపాటు ఇతరస్థాన

ములకుగూడ పోటీచేయు హక్కుండవలెనని కోరుట మహమ్మదీయులకు న్యాయముగా నుండదు. వీనిలో నేపద్ధతి వారికి హెచ్చులాభకరముగా నుండునో వారు నిర్ణయించుకొనవలసి యున్నది. రెండుపద్ధతులు గలవు. జనాభానను సరించి న్యాయముగా రాదగినస్థానములకంటె హెచ్చుస్థానములను ప్రత్యేకించుకొని, యితర స్థానములకు పోటీచేయుటకు హక్కును వదలుకొనుట మొదటి పద్ధతియై యున్నది. రెండవది, తమజనసంఖ్య ననుసరించి రాదగిన స్థానములనుమాత్రమే ప్రత్యేకించుకొని, యితరస్థానములన్నిటికైనను పోటీచేయుటకు హక్కుగలిగి యుండుట. ఈ రెండుపద్ధతుల లాభాలాభములను మహమ్మదీయులు చక్కగా నాలోచించుకొనినయెడల, రెండవపద్ధతియే తమకు లాభకర మని వారికి తెలియకపోదు. మే మిదివరకే తెల్పినట్లు స్థానములను సంపూర్ణముగా ప్రత్యేకించుకొనుట, జాతీయైక్యమును కలుగజేయుటయందు సంయుక్త నియోజక వర్గములకు గల ప్రయోజనమును చాలవరకు తగ్గించును. మహమ్మదీయాభ్యర్థియొకడు తనకు పోటీగా నిలిచిన యింకొక మహమ్మదీయుని ఓడించుటకు మహమ్మదీయేతరుల వోట్లను యాచించుటకు ప్రోత్సాహమెంతయున్నను, మహమ్మదీయసంఘమునకు మాత్రము, ఇతరసంఘములసాయ మున్నను లేకపోయినను రావల



సిన స్థానము లన్నియు వచ్చు ననుట నిశ్చయము. మరియు సంఘవైషమ్యములు తీవ్రముగా ప్రబలినరోజులలో మహమ్మదీయులును, మహమ్మదీయేతరులును, ఒండొరులతో సంబంధములేక స్వతంత్రముగా, ఎవ్వరును ఒక్కస్థానమైనను కోల్పోకుండ, ఎన్నికలు జరపుకొనవచ్చును. రెండుసంఘములను పరస్పర మొండొరులపై నాధారపడునట్లు చేసిన గాని వారి భేదములు తగ్గవు.

సంయుక్తపరగణాలయందలి మహమ్మదీయులు

తక్కువ మహమ్మదీయ జనసంఖ్యగల రాష్ట్రములన్నిటికంటె హెచ్చు మహమ్మదీయులు గల సంయుక్త రాష్ట్రములలోని మహమ్మదీయులకు ప్రస్తుత మవలంబింపబడుచున్న పద్ధతి కంటె మా పద్ధతియే హెచ్చు లాభకారిగా నుండు నని మా నిశ్చితాభిప్రాయము. సంయుక్తరాష్ట్రములలో అనేకపట్టణములయందు మహమ్మదీయులు అధిక సంఖ్యాకులుగా నున్నారు. కొన్ని పట్టణములలో అధికముగా లేకపోయినను బలీయముగను, పలుకుబడిగల స్వల్ప సంఖ్యాక సంఘములుగాను ఉన్నారు. కొన్ని యితరరాష్ట్రములయందు వారికి కొద్దిగా స్థానములు తక్కువ వచ్చినను, దేశము మొత్తముమీద ఎన్నికలవలన నందరకును లాభముండును.

భారతశాసనసభ్యులమొత్తముసంఖ్యలో మూడవ వంతునకు తగ్గకుండ మహమ్మదీయులకు స్థానములను ప్రత్యేకింపవలసిన దని మహమ్మదీయులు కోరుచున్న కోరిక ఒక్కటి మాత్రమే యింక విచారింపవలసి యున్నది. ఈవిషయము ఇష్టాగోష్ఠిసభలో బహిరంగముగా హెచ్చరింపబడలేదు. వాదోపవాదములు జరగలేదు. కాని స్థానములను ప్రత్యేకించుటను గురించి మే మిచ్చుచు వచ్చిన సలహాలవలన నీవిషయ మందరకును స్ఫుటమైన దని తలతుము. మహమ్మదీయాల్పసంఖ్యాకులకు స్థానములను ప్రత్యేకింపవలసి వచ్చినప్పు డెల్ల మే మనుసరించిన పద్ధతి జనాభా దామాషాను బట్టియే నై యున్నది. భారతదేశములో మహమ్మదీయులు నాల్గవవంతుకన్న కొంచెము తక్కువగా నున్నారు. కావున భారత శాసనసభలో మహమ్మదీయులసంఖ్య గూడ మొత్తము సభ్యులలో నాల్గవవంతుకన్న హెచ్చుండరాదు. పాంచాలమునందును, వంగదేశమునందును తప్ప తక్కిన రాష్ట్రము లన్నిటియందును రాష్ట్రీయ శాసనసభకును భారత శాసనసభకును తమకు ప్రత్యేకింపబడిన స్థానములతో పాటు ఇతరస్థానములకుగూడ పోటీ చేయుటకు మహ

భారతశాసనసభ యందు మహమ్మదీ యులకుస్థానములను ప్రత్యేకించుట



మ్మదీయుల కధికారముకలదని జ్ఞాపక ముంచుకొనవలెను. పాంచాల వంగదేశములయందుకూడ రెండు శాసనసభలకు వారి యిష్టమువచ్చినన్ని స్థానములకు నిరభ్యంతరముగా వారు పోటీ చేయవచ్చును. రాష్ట్రీయ శాసనసభల విషయములో ప్రస్తుతము వారికిగల లాభములకు మారుగా ఈహక్కు నేర్పరచినాము. భారత శాసనసభలో ప్రస్తుతము మహమ్మదీయుల కేప్రత్యేకాధిక్యమును లేదు. రాష్ట్రములనుండి భారతశాసనసభకు పంపబడు సభ్యులు అడ్డగోలుగా పంపబడుచున్నారుగాని యొకపద్ధతి ననుసరించి కాదు. ఇప్పుడు సభలో మహమ్మదీయసభ్యుల సంఖ్య మొత్తముసభ్యులలో మూడవవంతుకంటె తక్కువగానే యున్నది.

ఈనాడు ఆచారణయందున్న పద్ధతినిబట్టి యాలోచించినను మహమ్మదీయుల కోర్కెకు అవకాశ మేమియు లేదు. మూడవవంతునకును నాల్గవవంతునకును గల యంతరములతో వివాదపడుటకంటె స్వేచ్ఛగా మెలంగుట కధికారము గలిగియుండుట లాభకర మని కొంచె మాలోచించిన తెలియగలదు. ఇదివరకు మేము వ్రాసినట్లు, రాష్ట్రీయ శాసనసభలలో మహమ్మదీయాల్పసంఖ్యాకుల కనువర్తింపవలసిన సిద్ధాంతమునకు మేము భిన్నముగా ప్రవర్తింపజాలము. సిద్ధాంత మొప్పుకొనుట

యందు కష్టముమాత్రమేకాక, ఆచరణయందుకూడ కష్టము లున్నవి. పాంచాల వంగదేశములయందలి అధిక సంఖ్యాకు లగు మహమ్మదీయసభ్యులసంఖ్య తగ్గింపకుండ, తక్కిన రాష్ట్రములయందలి మహమ్మదీయులకు కొన్ని హెచ్చుస్థానముల నొసగకుండ భారత శాసనసభలో మూడవవంతు స్థానములను వారికెట్లు సమకూర్పగలము? జనాభానుబట్టి వివిధరాష్ట్రముల మొత్తముమీద భారత శాసనసభలో నాల్గవవంతుస్థానములే వీరికి లభింపవలసియుండగా, మూడవవంతు స్థానములను ప్రత్యేకించునెడల తేడావచ్చు హెచ్చు సభ్యత్వస్థానములను ఏపద్ధతి ననుసరించి ఆయారాష్ట్రములకు నిర్ధారణ చేయవలెను? అను విషయమును బాగుగా నాలోచించితిమి. కాని భారత శాసనసభలో మూడవవంతుస్థానములను ప్రత్యేకించుటకు సిఫారసు చేయజాలనందుకు చింతిల్లుచున్నాము.

సలహాలు

పైని జెప్పినకారణములవలన అవసర మైనప్పుడు మహమ్మదీయాల్పజన సంఖ్యాకసంఘములకు భారత శాసనసభలోను, రాష్ట్రీయ శాసనసభలలోను జనాభా దామాషా పద్ధతిమీదనే స్థానములను ప్రత్యేకింపవలసిన దని సిఫారసు చేయుచున్నాము. ఈస్థానములుమాత్రమే కాక పదిసంవత్సరములవరకు వారు ఇతరస్థానములనుగూడ అభ్యర్థింప



వచ్చును. పైయభిప్రాయములతోడను, పర్యవసానములతోడను మా విచారణసంఘ సభ్యులగు షుయెబ్ కురేషీగారేకీభవింపలేదని చెప్పవలసియున్నది. పైన జెప్పిన ఇష్టాగోష్ఠిసభలో నామోదింపబడిన తీర్మానమునే సంపూర్ణముగా నామోదింపవలె నని వారి యభిప్రాయము. మరియు భారత శాసనసభలో మూడవవంతు స్థానములు మహమ్మదీయులకు ప్రత్యేకింపవలె నని వారు కోరుచున్నారు.

పశ్చిమోత్తరరాష్ట్రము, పాంచాలము నందలి మహమ్మదీయేతరులు

మహమ్మదీయేతరాల్ప జనసంఖ్యాక సంఘముల విషయమున నాలోచించునప్పుడు, రెండురాష్ట్రములను గురించి మాత్రమే విచారింపవలసియున్నది. అవి పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రము, బెలూచిస్థానము. ఈ రెండురాష్ట్రములలోను మహమ్మదీయేతరులుకొంచెము హెచ్చుతగ్గుగా మద్రాసు మధ్యపరగణాలలో మహమ్మదీయులున్న స్థితియందే యున్నారు. పాంచాల వంగదేశములయందు తప్ప తక్కినరాష్ట్రములయందన్నిటియందును మహమ్మదీయుల కొసంగిన సౌకర్యములనే వారికిగూడ నొసంగునట్లు మేము సలహా నిచ్చుచున్నాము.

ఇతర మహమ్మదీయేతరాల్పజనసంఖ్యాక సంఘముల విషయమున ఆలోచించినచో, వీరికిని వీరితో కలసియుండు అధికజనసంఖ్యాక సంఘములకును, హిందువులకును మహమ్మదీయులకును గలిగిన విషాదకరములగు వైషమ్యములు లేవని తెలియఁగలదు. వీరి విషయములో స్థానములను ప్రత్యేకించి, ప్రత్యేకరక్షణముల నొసంగుట యవసరములేదు. వాంఛనీయమును కాదు. మహమ్మదీయేతరాల్ప సంఖ్యాకులకు ప్రత్యేకపరిస్థితులలో కొంతకాలమువరకు స్థానములను ప్రత్యేకింపవలసివచ్చినదని వారు గ్రహింపవలెను. మహమ్మదీయు లైనను రేపో మాపో తమ స్వశక్తిమీదనే యాధారపడవలసియుందురు. ప్రారంభముననుండి స్థానములను ప్రత్యేకించుపద్ధతి లేకుండుటకు వారు నిశ్చయించుకొనగలుగుచో మాకు చాల సంతోషము కలుగును.

ఇతర మహమ్మదీయేతరాల్ప సంఖ్యాకులు

భారతదేశములో మహమ్మదీయ మహమ్మదీయేతరాల్పజనసంఖ్యాక సంఘముల కేపోలికయు లేదు. భారతదేశముయొక్క మొత్తము జనాభాలో మహమ్మదీయేతరాల్పసంఖ్యాకులు లెక్కకు రానంతస్వల్పముగా నున్నారు. బర్మాలో అధికసంఖ్యాకులుగానున్న బౌద్ధులను వదలివేసినచో ఇతరులు నూటికి ఈ క్రిందివంతున నున్నారు.



| | |
|---|---|
| క్రైస్తవులు— | 1.2% |
| సిక్కులు— | 1.0% |
| జైనులు— | 0.2% |
| ఇతరులు (కొండప్రదేశములలో కొండజాతులుగాక) | 0.2% |

ఈ సంఖ్యలవలన, జానాభానుబట్టి భారతశాసనసభలో స్థానములను ప్రత్యేకించుకొనుటవలన మహమ్మదీయేతరాల్పజనసంఖ్యాక సంఘములకు హెచ్చులాభముండ దని తెలియగలదు. రాష్ట్రీయశాసనసభలయందైనను పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రము, బెలూచిస్థానములలోతప్ప నితరరాష్ట్రములయం దెచ్చటను అల్పజనసంఖ్యాక సంఘములకు స్థానములను ప్రత్యేకించుటకు అవకాశ మేమియు లేదనికూడ వ్యక్తము కాగలదు. ఇట్లు చేయనెంచుటవలన గందరగోళ మగుట తప్ప అల్పజనసంఖ్యాకసంఘములకు నిజమగు లాభ మేమియు నుండదు.

పాంచాల వంగదేశములయందు అల్పసంఖ్యాకులుగానున్న హిందువులవిషయము మేమేమియు వ్రాయలేదు. పాంచాలమునందు నూటికి 32 వంతులును, వంగదేశమందు నూటికి 45 వంతులును ఉన్న హిందువులు గణనకు రానంతటి యల్పసంఖ్యాకు లని మే మూహించుటకు శక్యము కాకున్నది.

సిక్కులు

మహమ్మదీయేతరాల్ప సంఖ్యాకులలో సిక్కుల విషయమున ప్రత్యేకముగా విచారింపదగును. వారు పాంచాలమునందు మాత్రమే కలరు. సంయుక్త రాష్ట్రములయందలి మహమ్మదీయు లేస్థితియందున్నారో, పాంచాలములో హెచ్చు తగ్గుగా వీ రాస్థితియందున్నారు. సంయుక్తరాష్ట్రములలో మహమ్మదీయులు నూటికి 15 వంతు లున్నారు. పాంచాలములో సిక్కులు కొంచెము తగ్గుగా, అనగా నూటికి 11 వంతు లున్నారు. ప్రస్తుత రాజ్యవిధానమున సిక్కులకు ప్రత్యేకనియోజకవర్గములు ఏర్పరుపబడినవి. ఇతర సౌకర్యములుగూడ కొన్ని చూపబడినవి. సిక్కులు ప్రాముఖ్యమువహించిన అల్పజనసంఖ్యాకసంఘ మనియు, ఆసంఘపు హక్కులనుగురించి విచారింపకుండజాల మనియు మేము తలచుచుంటిమి. మరియు సిక్కులయభిప్రాయములను వ్యక్తపరచుచుండిన సర్దార్ మంగళసింగుగారి వాక్యములను గాఢముగా నాలోచించుచుంటిమి. సిక్కులు ప్రస్తుతము తా మనుభవించుచున్న సాంఘికస్వలాభములను దేశక్షేమమునకై విడనాడుటకు నిశ్చయించి, ప్రశంసనీయ మగు ఆత్మత్యాగమును ప్రకటించుట చాల సంతోషకరము. శాసనసభాప్రాతినిధ్యమును గురించి దేశములో గత కొలది సంవత్సరములనుండి జరగుచున్న వాదోపవాద



ములలోగూడ సంయుక్తనియోజకవర్గములే యుండవలెననియు, ఏసంఘమునకును స్థానములను ప్రత్యేకింపరాదనియు వారు వాదించుచుండిరి. సిక్కులు పాంచాలములోనే జిల్లాయందును అధికజనసంఖ్యాకసంఘముగా లేరనియు, ఒక్క లూధియానాజిల్లాయందుమాత్రము హిందువులకన్నను, మహమ్మదీయులకన్నను వారు హెచ్చుగానున్నారనియు సర్దార్ మంగళసింగుగారు మాకు చెప్పిరి. ఈజిల్లాయందైనను వారు నూటికి 41.5 కన్న హెచ్చులేరు. ఇతరజిల్లాలన్నిటియందును మహమ్మదీయులును, హిందువులును, సాధారణముగా ఇద్దరును సిక్కులకన్న హెచ్చుగా నున్నారు. సార్వజనికమగు ఎన్నికాధికారముతో సంయుక్తనియోజకవర్గము లేర్పడినయెడల అల్పసంఖ్యాకులకు గలుగు నష్టములన్నియు పాంచాలములోని సిక్కులు గూడ పొందవలసివచ్చునని స్పష్టము కాగలదు. ఈ పరిస్థితులయందు సంయుక్తరాష్ట్రములలోని మహమ్మదీయులకు భారత రాష్ట్రీయ శాసనసభలయం దెట్టి ప్రాతినిధ్యము గలదో అట్టిప్రాతినిధ్యమే పాంచాలములోని సిక్కులకును ఉండుట యవసర మని తేటపడగలదు. ఐనను పాంచాలమునందు అధికసంఖ్యాకులగు మహమ్మదీయులతోపాటును, అల్పసంఖ్యాకులగు సిక్కులతోపాటును, బలీయమగు హిందూ అల్పజనసంఖ్యాక సంఘ

ము కూడ ఒకటి కలదను ముఖ్యవిషయమును మనము గమనింపవలెను. ఇతరసందర్భము లెట్లున్నను ముఖ్యముగా నిందువలననే ఏసంఘమున కెన్నిస్థానములను ప్రత్యేకింపవలెనను ప్రశ్నపరిష్కారమునకు చేసినప్రయత్నము లన్నియు విఫలము లైనవి. పాంచాలములోని సాంఘికసమస్య అఖిలభారతసమస్య యైనది కావున కేవలము దీనిని స్థానికసమస్యగా తలచుటకు వీలులేదు. చిక్కులేమియు గలుగకుండవలె ననిన, జాతీయభావములు దట్టముగా దేశమునందు ప్రతిష్ఠితములు కావలె ననిన, పాంచాలదేశమునందు నాటుకొనిన సాంఘిక విషబీజములను పెకలింపవలెను. మన సిచ్చి సంపూర్ణముగా నీవిషయమును మాతో చర్చించిన సర్దార్ మంగళసింగుగారికి గూడ మాకు తోచిన యిబ్బందులే తోచినవి. సాంఘికసమస్యాపరిష్కారమున కేయడ్డంకులును గలుగజేయకుండుటయే సిక్కుసమితికి ఇష్ట మని మేము నమ్ముచున్నాము. చిక్కులు గలుగజేయుటకే వారు తలచుకొనినచో ప్రత్యేకసౌకర్యములను కోరి, ఒక్కపద్ధతిమీద ప్రాతినిధ్యము నేర్పరచుట కెన్నియేని యిబ్బందులు కలుగజేసి యుందురు. వా రట్లు చేయక ప్రతిష్టంభన కలుగకుండవలెనను మహత్తరమగు నుద్దేశముననే ప్రత్యేకసౌకర్యములను సంపూర్ణముగా విసర్జించిరి. వారి చిత్తసంస్కా-



రము ప్రశంసనీయముగదా! దేశక్షేమకరమగు వారితీర్మానమునకు వారి నభినందించుచున్నాము.

మా సూచనల నంగీకరింపనిచో ఇష్టాగోష్ఠిసభలో మే మామోదించినతీర్మానమునే యవలంబించి, మహమ్మదీయులతో సహా ఏ యల్పజనసంఖ్యాకసంఘములకు గూడ స్థానములను ప్రత్యేకింపకుండుట యొక్కటే అనుసరణీయము.

వేఱొకపద్ధతి

ఇట్లు చేయుటవలన మహమ్మదీయులకు చాల అసంతృప్తి కలుగజేయుటయే కాని, మహమ్మదీయేతరుల కేలాభము లేదు. ప్రస్తుతసమయమున సాంఘికనియోజకవర్గముల మూలమున స్థానములను ప్రత్యేకించుకొనుట మాత్రమే కాక, ప్రతిరాష్ట్రమునందును మహమ్మదీయులు ప్రత్యేకసౌకర్యముల ననుభవించుచున్నారు. ఈ సౌకర్యములకు బదులు తమకు ప్రత్యేకించిన స్థానములు గాక యితరస్థానములను గూడ నభ్యర్థింపవచ్చు ననుహక్కు వారికి మే మొసంగుచున్నాము. మహమ్మదీయుల విషయమున మాత్రము స్థానములను ప్రత్యేకింప కుండజాలము. మహమ్మదీయేతరాల్పాధికజనసంఖ్యాకసంఘముల కెవ్వరికిని దీని వలన నష్టములేదు. అల్పసంఖ్యాకసంఘము లన్నిటికిని స్థానములను ప్రత్యేకించితిమా పెక్కుచిక్కులు కలుగును.

ఇదివరకే ప్రాముఖ్యమువహించిన క్రైస్తవులు, పార్శీలు, యూదులు గాక హిందువులలో నేర్పడిన వర్ణములును, అంతర్వర్ణములును ఈహక్కును కోరుటవలన సంభవించు కష్టముల కంత ముండదు.

సాంఘికసమస్య ముఖ్యముగా హిందూమహమ్మదీయసమస్య గావున, హిందువులకును మహమ్మదీయులకును పొడమిన వైషమ్యములను పరిష్కరించుటవలననే యియ్యది పరిష్కరింపబడగలదు. ఈ సమస్యను పరిష్కరించుప్రయత్నమున దేశమునందు సాంఘికపక్షపాతము ప్రబలునట్లు చేసితిమా, దేశద్రోహము చేసినవార మగుదుము. తమకు నష్టము వాటిల్లు నని కలలో నైనను తలంపని సంఘములను, ఉపసంఘములను, సాంఘిక విద్వేషమున కాహుతి చేసినవార మగుదుము.

అధికసంఖ్యాకులగు హిందూసంఘములో నంతర్భాగమగు బ్రాహ్మణేతరులను గురించియు, నిమ్నజాతులను గురించియు మాత్రమే విచారింపవలసి యున్నది. దక్షిణాపథమునమాత్రమే బ్రాహ్మణులకును బ్రాహ్మణేతరులకును తీవ్రవైషమ్యము గలిగినది. మఱెచ్చటను ఇట్టి వైషమ్యము లేదు. ఈ బ్రాహ్మణేతరులు చెన్నరాజధానియందు అత్యధికసంఖ్యాకులుగాను, బొంబాయి రాజధానియందలి భాగములయందు బలీయమగు అల్పసంఖ్యా



కసంఘముగాను ఉన్నారు. ఇటీవల జరిగిన ఎన్నికల వలన శాసనసభలలో వారికి ప్రత్యేకరక్షణ యవసరము లేదని తేటపడినది. బ్రాహ్మణుల రాజకీయప్రాబల్యమును సాంఘికౌన్నత్యమును బ్రాహ్మణేతరుల యసంతృప్తికి మూలకారణములు. బ్రాహ్మణుల మేధావిశేషమే వారికీ యాధిక్యమును గలుగజేసినది. ఇప్పుడు బ్రాహ్మణేతరులు కడుశీఘ్రముగా నభివృద్ధి నొందుచుండుటచే బ్రాహ్మణులను వెనుకకు ద్రోయుదురేమో యనికూడ తోచుచున్నది.

నిమ్న జాతులు

ఇటీవల 'నిమ్నజాతు'లనియు 'అణగద్రొక్కబడిన జాతు'లనియు పిలువబడుచున్న ప్రజలసమస్య ప్రాముఖ్యమును వహించినది. మరియు వీరిప్రస్తుతదశ భారత రాజకీయాభివృద్ధి కాటంక మని కూడ వాదింపబడుచున్నది. ఇంత సంఖ్యాబాహుళ్యము గల ప్రజలను అణగద్రొక్కుటకు హిందువులే బాధ్యులని మా నిశ్చితాభిప్రాయము. ఐనను ఆంగ్లప్రభుత్వమువారీ ప్రజలయెడ జూప ప్రయత్నించుచున్న యభిమానమునకు కారణములు కల్మషరహితములగు ప్రేమయు, దాక్షిణ్యమును కావనికూడ మాకు స్పష్టమైనది. ఈ ప్రజలయెడ ప్రేమ ఆంగ్లప్రభుత్వమున కిటీవలనే జనించినది. దేశములో జాతీయోద్యమము ప్రబలినకొలది ప్రభుత్వము

వారికి నిమ్నజాతుల రాజకీయోపయోగముకూడ హెచ్చుచున్నది. 1927 వ సంవత్సరముననుండియే ప్రభుత్వమువారి విద్యాభివృద్ధిని సూచించు నివేదికలయందు వీరి సంఖ్యలు ప్రత్యేకముగా నీయబడుచున్నవి. వారి కొసంగబడుచున్న ప్రత్యేకసౌకర్యములుగూడ నా సంవత్సరమునుండియే తెల్పబడుచున్నవి. ప్రభుత్వమువారి యభిమానమువలన నీప్రజల కింతవరకు చేకూరిన లాభ మేమియు లేదు. శాసనసభలలో కొన్నిస్థానములను ప్రభుత్వమువారు నియోగించుటయు, వారికి ప్రత్యేక పాఠశాలలకు స్వల్పధన మొసంగుటయు తప్ప వేరులాభము గలుగలేదు.

నిమ్నజాత్యుద్ధరణమునకై ప్రభుత్వమువారుచేయగలిగిన మేలుకంటె భారత ప్రజాసంఘములు చాల హెచ్చుమేలు చేయగలిగినవి. క్రైస్తవమత ప్రచారకులుకూడ ఉద్యమమునకు చాల తోడ్పడిరి. 1920 వ సంవత్సరమునుండి కాంగ్రెస్ మహాసభ నిమ్నజాత్యుద్ధరణమును ప్రధాన కర్తవ్యముగా వహించినది. గాంధీమహాత్ముడు తన మహత్తర మగు శక్తిసామర్థ్యములను దీనజనోద్ధరణకై వినియోగించుచున్నాడు. ఇతర రాజకీయ ప్రతిష్ఠాపనలును, సాంఘిక ప్రతిష్ఠాపనలును అస్పృశ్యతానివారణకై తమ యావచ్ఛక్తులను వినియోగించుచుండుట మాకు చాల సంతసము గలుగజేయుచున్నది. ఇంత



వరకు జరగిన ప్రయత్నములఫలితమునుబట్టి చూడ భారతీయులు చెప్పెడిమాటలు కేవలము శ్రీరంగనీతులు కావనియు, నిమ్నజాత్యుద్ధరణముపట్ల వారికి నిజమైన యభిమానము కలదనియు స్పష్టమగుచున్నది. నిమ్నజాతుల యభివృద్ధి కాటంకము గలుగజేయుటకు సమర్థులగువారింకను కొందరున్నారని మే మెఱుంగుదుము. ఐనను అంటరానితనము నిర్మూలమగుననియే మానిశ్చితాభిప్రాయము.

రాజ్యాంగవిధానముపట్ల మాసూచనలలో, శాసనసభలయందు నిమ్నజాతుల ప్రాతినిధ్యమును గురించి ప్రత్యేకపు ఏర్పాటు లేమియు మేముచేయలేదు. ప్రత్యేక నియోజకవర్గముల మూలకముగా గాని, ప్రభుత్వమువారు నిమ్నజాతులలో కొందరను శాసనసభ్యులుగా నియోగించుటవలన గాని శాసనసభలలో ప్రాతినిధ్యము సాధ్యము కాగలదు. ప్రత్యేకప్రాతినిధ్యమువలనను, స్థానములను నియోగించుటవలనను గలుగు హానిని ఇంకొకస్థలమున చర్చించియుంటిమి. లోపభూయిష్ఠమును, అనర్థదాయకమును అగు స్థానములను ప్రత్యేకించుపద్ధతిని, మాచేతనైనయెడల, నీ ప్రజలకుగూడ వర్తింపజేయకుండుటయే మా యుద్దేశము. ప్రభుత్వమువారు సభ్యులను నియోగించుపద్ధతి కసలే మే మొప్పుకొనజాలము. ఈమార్గమువలన

ప్రస్తుతప్రభుత్వము ప్రజాభిప్రాయమును వ్యక్తపరుపగల వారిని నియోగింపక, అన్నివేళలయందును తమ యండ నుండువారినే నియోగించుట సంభవించును. ఇంతవరకిట్లే జరగుచున్న దని యందరకును తెలిసినవిషయమే.

నిమ్నజాతు లనువారు భారత దేశమున ప్రత్యేకముగా నుండరాదనియు, ఆర్థికముగను, సాంఘికముగను, వారి నభివృద్ధిపరచి, యితరసంఘములతో సమానముగా చేయవలయు ననియు మేము గాఢముగా వాంఛించుచున్నాము. ఇట్లు జరగవలెననిన వారియభివృద్ధి కనువగు ప్రత్యేకసౌకర్యముల నొసంగి, అభివృద్ధి కాటంకములుగా నున్న ప్రతిబంధకములు తొలగించుటొక్కటే ప్రశస్తమగుపద్ధతి. సార్వజనిక హక్కులలో మే మేర్పరచిన కొన్ని నిబంధనలు నిమ్నజాతులు ప్రస్తుతము పడుచున్న యిబ్బందులను చాలవరకు తగ్గించి, యభివృద్ధి నొందుటకు వారి కవకాశములను కలుగజేయును. ప్రజ లందరకు వోటింగు అధికారముండవలె నని మేము చేసినసూచనవలన నిమ్నజాతుల స్థితి దానియంతట నదియే యభివృద్ధి కాగలదు. మరియు వారి రాజకీయాధికారము గూడ హెచ్చును. వెనుకబడి యున్న ప్రజలందరియొక్క విద్యాభివృద్ధికై ప్రభుత్వము వారు ప్రత్యేకముగా జాగరూకత వహింపవలెనని కూడ



మేము సలహా నొసంగితిమి. మా సలహాలప్రకారము నడచుకొనుచో నిమ్నజాతులనువారు త్వరలో నదృశ్యమగుదు రనియు, వారిస్థానమున ఆత్మవిశ్వాసపూరితులును, అభివృద్ధిని వాంఛించువారును, దేశక్షేమమునకై యితర సంఘములతోపాటు చేతులు గలిపి ప్రయత్నము చేయగలవారును నగుప్రజలు పెంపొందుచుందు రనుటకు మాకేసందియములును లేవు.

---

# నాల్గవ యధ్యాయము

---

## రాష్ట్రపునర్నిర్మాణము

సాంఘికసమస్యలను సంతోషపూర్వకముగా వదలి, యికమీద రాజ్యాంగనిర్మాణమున కెక్కుడు సన్నిహితములగు సమస్యలను గూర్చి విచారింతము. రాజ్యాంగనిర్మాణములో భాగ మయినంతవరకు నీరాష్ట్రపునర్నిర్మాణసమస్య అన్ని రాష్ట్రములకును సామాన్యముగా వర్తించు కొన్ని సులభసూత్రములచే పరిష్కరింపబడవలసినది. కాని యెంత సులభముగా పరిష్కరింపదగినవైనను, అపసవ్యభావముతో యోజించుటవలన ఈ సమస్యలు ఎంత కష్టసాధ్యము లైనను అగుచున్నవి. ఒకానొక సమస్యను దాని గుణాగుణములనుబట్టి పరిష్కరింపదగును గాని, ఇతరవిషయములకు జతచేసినచో నెట్లవి పరిష్కారసాధ్య మగును? బొంబాయిరాజధానినుండి సింధును విడదీయుటకు సంబంధించిన సాంఘికసమస్య నిదివరకే చర్చించి, యెట్లొక స్వల్పవిషయము రాజకీయములలో ముఖ్యతమ మగు ప్రశ్నమైనదో నిరూపించితిమి. ఇప్పుడు



రాష్ట్రవిభజనమువలన ప్రత్యేకపు సంఘములకు వచ్చు లాభాలాభములను వదలివేసి, సామాన్యముగా భారతదేశములో రాష్ట్రవిభజన మేపద్ధతులమీద నాధారపడి యుండవలె ననువిషయమును, దాని గుణాగుణములపైని మాత్రమే విచారింతము.

ప్రస్తుత అవకతవకవిభాగములు

ప్రస్తుతకాలమున భారతదేశమునందలి రాష్ట్రనిర్మాణము అవకతవకగా నున్న దని యొప్పుకొననివా రెవ్వరును లేరు. ప్రస్తుత రాష్ట్రనిర్మాణమునకు కారణ మొకసూత్రముగాని సిద్ధాంతముగాని కాదు. కాలకర్మబద్ధములును, భారతదేశములో ఆంగ్లేయాధికార ప్రాబల్యఫలితములును అగు కారణములే రాష్ట్రవిభజనము నిప్పటియట్లుంచుటకు తోడ్పడినవి. దేశముయొక్క నైసర్గికవిభాగము గాని, దేశచరిత్ర గాని, ఆర్థికకారణములు గాని, భాషగాని, రాష్ట్రనిర్మాణమునకు కారణములై యుండలేదు. కేవల పరిపాలనా సౌకర్యమును బట్టి యాలోచించినను ఈరాష్ట్రములు పనికిరావు. భారతదేశమున రాష్ట్రపునర్నిర్మాణ మవసర మనుట స్పష్టము. మాలో కొందరము పెద్దరాష్ట్రము లుండిన బాగని తలచుచున్నాము. కొందరము చిన్నరాష్ట్రము లుండిన సుకరమని తలచుచున్నాము. కాని పెద్దవైనను చిన్నవైనను

రాష్ట్రపునర్నిర్మాణముమాత్ర మవసర మనియే అందరమును ఒప్పుకొనుచున్నాము.

ప్రధానసూత్రములు

రాష్ట్రపునర్విభజనమునం దనుసరింపదగు సూత్రము లేవి? కొంతవరకు దేశముయొక్క నైసర్గికవిభాగములు, కొంతవరకు సంపదభివృద్ధికి రాష్ట్రమునందు గల యవకాశములు, కొంతవరకు రాష్ట్రపునర్నిర్మాణమున కవసరమగు ఖర్చులను భరింపగలిగియుండుట, అను నీమూడును విచారింపదగినవి. కాని యివి యంత ముఖ్యమైనవి కావు. ప్రజలకోర్కెలును, ఏకభాషయు నివి రెండు మాత్రమే ముఖ్యావసరములు. ప్రజల విద్యాభివృద్ధియు, విజ్ఞానాభివృద్ధియు మాత్రమే కాక యితరవిషయములందలి యభివృద్ధిగూడ భాషపై నాధారపడి యుండు నని యందరును నిస్సందేహముగా నొప్పుకొనియేయున్నారు. దేశముయొక్క కార్యక్రమ మంతయు అన్యభాషామూలకముగా జరగుచో, ప్రజలలౌకికవ్యవహారముల కాటంకమును, జాతీయాభివృద్ధికి నిరోధమును కలుగుట తప్పదు. ప్రజల దైనికకార్యక్రమము విదేశభాషామూలకముగా జరగు దేశములలో ప్రజాప్రతినిధిప్రభుత్వము సాధ్యము కాజాలదు. రాజకీయములలో శ్రద్ధ వహించి, విశేషముగా



పాల్గొనవలె నని ప్రజాసామాన్యమున కంతకును సంగతి సందర్భములు సులభముగా తెలియుచుండవలెను.

అన్యభాషను ప్రజ లందరును నేర్చుకొనుట దుర్ఘటము గనుక ప్రజ లందరును ప్రజాపాలనమున పాల్గొనుటయు నసాధ్యమే. కావున జనసామాన్యమునకు అర్థమగుభాషయందు దేశముయొక్క రాజకీయకార్యకలాప మంతయు జరపుట యవశ్యకర్తవ్యము. అట్టి వ్యావహారిక భాష ఆరాష్ట్రభాషయే యైయుండవలెను.

భాష

ప్రజలు ఆంగ్లభాషను వాడుటను మే మెన్నటికిని ఆక్షేపింపము. ప్రస్తుత స్థితిగతులను బట్టి, యిప్పుడున్నట్లే ముందును కొంతకాలము వరకు భారతశాసనసభయందలి చర్చలు ఆంగ్లభాషామూలకముగా జరగక తప్ప దని మా యభిప్రాయము. ఇతరదేశములయందలి ప్రజలయభిప్రాయములతోడను, ఆశయములతోడను, విజ్ఞానాభివృద్ధితోడను, శాస్త్రాభివృద్ధితోడను సంబంధ ముండవలె ననిన ఏదో ఒకవిదేశభాష ప్రజలకు తెలిసియుండుట కూడ అవసరము. ఆ విదేశభాష ఆంగ్లమే యైయుండిన నుండవచ్చును. ఐనను భారతదేశములో సగముమంది ప్రజలు వాడుచున్న హిందూస్థానీభాషను భారతదేశము

నందంతట వ్యాపింపజేయుటకు ప్రయత్నములు సలుప వలె నని మాదృఢాభిప్రాయమై యున్నది. ఇది యంతయు అవసరమే యైనను, దేశీయభాషలు ముఖ్యముగా అభివృద్ధి కావలెను. రాష్ట్రములు కడు శీఘ్రముగా నభివృద్ధిఁ జెందవలె నని మనము కోరుచో నేరాష్ట్రభాషమూలకముగా నా రాష్ట్రవ్యవహారముల నన్నిటిని జరపుట తప్ప వేరుకర్తవ్యము లేదు.

రాష్ట్రములోని ప్రజలలో విద్య వ్యాపించి, స్వభాషామూలకముగా వ్యవహార మంతయు జరగవలె ననిన నా రాష్ట్రము భాషాప్రయుక్తరాష్ట్రమై యుండవలెను. ఒక రాష్ట్రములోనే అనేకభాష లుండినయెడల, ఎడతెగకుండ కష్టములు సంభవించుచుండును. బాలురకు విద్య గరపుభాషలును, వ్యవహారములు జరపుభాషలును రెండు గాని, అంతకన్న నధికముగా గాని యుండును. కావున భాషాప్రయుక్తరాష్ట్రములుగా దేశమును విభజించుటయే అత్యంతము వాంఛనీయము. భాష యనునది ప్రత్యేకజాతీయవిజ్ఞానముమీదను, అనాదిసిద్ధము లగు ప్రత్యేక జాతీయసంప్రదాయములమీదను, సారస్వతముమీదను ఆధారపడి యుండును. భాషాప్రయుక్తరాష్ట్రమున నివి యన్నియు రాష్ట్రాభివృద్ధికి తోడ్పడును.



భారతజాతీయమహాసభ భాషాప్రయుక్తరాష్ట్రసిద్ధాంతమును 8 సంవత్సరముల క్రిందట నొప్పుకొనెను. అప్పటినుండియు సభాకార్యక్రమమునకు సంబంధించినంతవరకు రాష్ట్రములు భాషాప్రయుక్తరాష్ట్రములుగనే విభజింపబడినవి.

రాష్ట్రపునర్నిర్మాణమున ఆయా ప్రజలయిష్టానిష్టములను గూడ గమనించుట యవసరము. పెద్దదేశ

ప్రజలకోర్కెలు

ములకు స్వయంనిర్ణయాధికార ముండవలె నని కోరువారు, ఇతరముఖ్యసిద్ధాంతములకును, సమస్యలకును, విరుద్ధము కానివిధమున ఈ స్వయంనిర్ణయసూత్రమును చిన్న భాగములకు గూడ నేల వర్తింపజేయవలె నని కోరరాదు. ఒక రాష్ట్రములో నివసించుప్రజలు తా మంద రొక్క జాతికి జెందినవా రని తలచి, తమజాతీయవిజ్ఞానము నభివృద్ధిపరచుకొన నిచ్ఛగించిరేని, రాష్ట్రనిర్మాణమునకదియే ప్రబలకారణము. ఐతిహాసికలోపములుగాని, వైజ్ఞానికలోపములు గాని రాష్ట్రనిర్మాణమునకు ప్రతిబంధకము లెన్నటికిని కాజాలవు. ప్రజల యిచ్ఛాప్రాబల్యమున కెక్కుడు ప్రాముఖ్యమొసంగదగును గాని, వారి యథార్థస్థితిగతుల కెక్కుడు ప్రాముఖ్యము నొసంగరాదు.

కావున రాష్ట్రపునర్నిర్మాణమున ముఖ్యముగా ననుసరింపదగిన సూత్రములు, భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంత మనియు, ప్రజలవాంఛితము లనియు తేటపడినది. పరిపాలనసౌకర్య మను మూడవవిషయము గూడ విచారింపదగినదే. కాని యిది యంత ముఖ్యమైనది కాదు. దేశముయొక్క నైసర్గికవిభాగము, సంపదభివృద్ధి కా రాష్ట్రమున గల యవకాశములు, ప్రత్యేకరాష్ట్రముగా విభజించినయెడల ఖర్చుల నన్నిటిని స్వయముగా భరింప గలుగుశక్తి, యనునీమూడు విషయములును పరిపాలన సౌకర్యమునం దంతర్భాగములుగా నుండును. వీలునుబట్టి అధికారులు పరిపాలనసౌకర్యము నేర్పరచుకొనవచ్చును. కాని అధికారులసౌకర్యము సర్వదా ప్రజాభీష్టము ననుసరింపవలెను.

భాషాప్రయుక్త విభాగములు

భారతదేశముయొక్క పటమును చూచితిమేని ప్రత్యేకభాషాప్రయుక్తరాష్ట్రములే కాన్పించును. ఒక్క పాంచాలములో పంజాబీభాష తప్ప ఆర్యావర్తము నంతయు నాక్రమించుకొని హిందూస్థానీవిభాగము కలదు. తరువాత వంగదేశము, అస్సామ్, ఓఢ్ర, ఆంధ్ర, అరవ, మలయాళ, కన్నడ, మహారాష్ట్ర, ఘూర్జర, సింధు రాష్ట్రములు గాననగును. బంగాళాఖాతమున కావల



బర్మా కలదు. తెనుగుభాష మాటలాడు ఆంధ్రులును, ఓఢ్ర భాష మాటలాడు ఉత్కళులును, కన్నడభాష మాటలాడు కర్ణాటకులును, మలయాళము మాటలాడు కేరళప్రజలును, సింధీభాష మాటలాడుసింధుప్రజలును, హిందీభాష మాటలాడు మధ్యపరగణాలప్రజలును తమకు ప్రత్యేక రాష్ట్రము లుండవలెనని చాలకాలమునుండి యాందోళన చేయుచున్నారు. రాష్ట్రవిభజనమునకు బూనుకొను సమయమున వీరికోర్కెలను చక్కగా నాలోచింప వలసియుండును. వీనిలో చాలరాష్ట్రములను గురించి మా యభిప్రాయము లిచ్చుటకు తగినవివరములు మాకు తెలియవు. కర్ణాటకమునుండియు, సింధునుండియు తప్ప తక్కిన రాష్ట్రములనుండి మాకెట్టివిజ్ఞాపనలును వచ్చియుండలేదు. ఉత్కళరాష్ట్రమునందలి పరిస్థితులను వివరించు చిన్నగ్రంథ మొకటి మాకు చేరినది. కాని ప్రత్యేక విజ్ఞాపన గాని, విన్నపము గాని రానికతమున దానినిగూర్చి విచారింప వీలు లేకపోయెను. ఐనను, నూతనరాష్ట్రనిర్మాణమున కగుఖర్చులను భరింపగలశక్తి గలిగినయెడల, ఓఢ్ర భాష మాటలాడుభాగముల నన్నిటిని ఏకము చేసి, ఒక రాష్ట్రముగా నిర్మింపవలె నని మా విచారణసంఘసభ్యులు శ్రీయుత సుభాష్‌చంద్రబోసుగా రభిప్రాయ పడుచున్నారు. మరియు ఆసామ్, బీహార్, ఒరిస్సారాష్ట్రముల

[illegible]న్న బెంగాలీ ప్రజలనుగూడ ఏకముచేసి ఒక్క రాష్ట్రముగా నిర్మించుట యవసరమని వారు తలచుచున్నారు.

కేరళ

మలయాళ భాష మాటలాడు ప్రజల నేకముచేసి కేరళమును ప్రత్యేకరాష్ట్రముగా విభజింపవలెనని కోరుచు కేరళ రాష్ట్రీయ సభవారి తీర్మాన మొకటి మాకు చేరినది. ఈ రాష్ట్రము విభజించుటలో పెక్కు చిక్కులు గానిపించుచున్నవి. తిరువాన్కూర్, కొచ్చినుసంస్థానములలో చాల మంది మలయాళము మాటలాడు ప్రజలు కలరు. ఈసంస్థానములను వదలివేసినయెడల చాలకొద్దిదేశము మాత్రమే మిగులును. ప్రస్తుతస్థితిగతులలో సంస్థానములను వదలివేయక చేయున దేమి కలదు? కావున సంగతిసందర్భములను బాగుగా విచారింపనిదే కేరళరాష్ట్ర నిర్మాణమును గురించి యిదమిత్థ మని సలహా నొసంగజాలకున్నాము.

కర్ణాటక

కర్ణాటకమును గురించిన వివరములను మాకు కర్ణాటైక్యసంఘమువారును కర్ణాటరాష్ట్రీయ కాంగ్రెస్ కమిటీవారును మిక్కిలి సమర్థతతో తయారుచేసిపెట్టిరి. చారిత్రిక, వైజ్ఞానిక వివరములుమాత్రమే కాక, యెన్నియేని విషయములుం దుండెను. మాప్రశ్నలకన్నిటికిని తృప్తికరముగా ప్రత్యు



త్తరము లొసంగబడెను. ఇప్పుడు చిందరవందరగానున్న కర్ణాటభూమి నైక్యముచేసి, ఒక్క కర్ణాటరాష్ట్రముగా చేయుట కేయభ్యంతరములును ఉండజాల వని మాకు ప్రత్యక్షముగా కన్పించుచున్నది.

కర్ణాటకములో కొంతభాగము భారతసంస్థానములలో, (హెచ్చుగా మైసూర్ సంస్థానములో) గలదు. మైసూరులోని కర్ణాటకదేశమును బ్రిటిష్ పరిపాలితకర్ణాటకముతో కలుపుటకు వీలుపడదు గదా! మైసూరుసంస్థానమున కావల విడివిడిగా చెదరియున్న కొన్నిప్రాంతములను గూడ బ్రిటిష్ కర్ణాటకముతో జోడించుటకు వీలుకాక పోవచ్చును. మైసూరుసంస్థాన మీరెంటికిని అడ్డము. ఐనను రాష్ట్రనిర్మాణమునకు చాలినంత పెద్దదేశము మిగులును.

ప్రజ లందరును రాష్ట్రపునర్నిర్మాణమున కనుకూలురు కాకపోయినను, అత్యధికసంఖ్యాకులు అనుకూలురుగా నున్నా రని మాకు తెలియవచ్చినది. రాష్ట్రములో హిందూమహమ్మదీయ వైషమ్యములు లేవు. బ్రాహ్మణ బ్రాహ్మణేతరవిభేదము లున్నను, రాష్ట్రపునర్నిర్మాణమున కెక్కుడు ప్రతిబంధకములు గావు. స్వల్పసంఖ్యాకు లగు బ్రాహ్మణు లీకోర్కె నడ్డగించిరి. కాని

వారైనను ఒక్కమాటమీద నిలువలేదు. సరిహద్దుజిల్లాలలోనున్న మహారాష్ట్రులభాషకు ప్రమాదము వచ్చునేమో యని వారిపక్షమున కొందరు భీతినొందిరి. కాని నష్టము వాటిల్లకుండ తగు రక్షణము లేర్పాటు చేయవచ్చును. కర్ణాటకము బీదదేశము కాదు. ప్రత్యేకరాష్ట్రనిర్మాణమున కవసరమగు ఖర్చులన్నిటిని భరింపగలము. బ్రిటిష్ పరిపాలిత కర్ణాటకమున నిప్పుడుకూడ పరిపాలన వ్యయము లన్నియుపోను సర్కారుఖజానాయందు పుష్కలముగా ధనము మిగులుచున్నది.

ఈ యభిప్రాయములతో మా విచారణసంఘ సభ్యులగు ఎమ్.ఎస్. ఆనీగారు సంపూర్ణముగా నేకీభవింపకున్నారు. కర్ణాటకప్రతినిధిసాయమున, నీ విషయమున మేము విచారణ జరిపినసమయమున ఆనీగారు దురదృష్టవశమున, సభకు రాలేదు. ప్రతిపక్షుల యభ్యంతరములు మే మూహించిన వానికంటె హెచ్చుగా నుండు ననియు మేము విచారణ జరుపుచున్నసంగతి తెలియక పోవుటచే వా రందరును సాక్ష్య మిచ్చుటకు రాకపోయియుండు రనియు ఆనీగారు తలచుచున్నారు. ఇది మిక్కిలి యసంభవము. కర్ణాటకదేశములోనిపత్రిక లన్నియు నీసమస్యను బాగుగా చర్చించుచుండెను. మరియు, మా సంఘములో



కర్ణాటకప్రాతినిధ్యమున కెక్కుడు ప్రాముఖ్య మొసంగబడెను. కావున రాష్ట్రపునర్నిర్మాణమునకు చాలమంది వ్యతిరేకులుగా నున్నయెడల, వారు తమయభిప్రాయములను మాకు తెలియజేసియుందు రని మేము తలచుచున్నాము.

ఈసమస్య నింతటితో సంపూర్ణముగా పరిష్కరింపజాలము. కాని వివిధప్రాంతములయందలి కన్నడ ప్రజల నేకము చేయవలె నని వాదించువారు నిస్సంశయముగా తమహక్కును ఋజువుచేసికొనినారని మేము తలచుచున్నాము. క్రొత్తరాష్ట్రముయొక్క యెల్లలను సరిగా నిర్ణయింపజాలము. సరిహద్దుజిల్లాలలో రెండుభాషలు వాడుకలో నుండవచ్చును. ఆయా ప్రదేశములలో విచారణ జరపవలసియుండును. ఆప్రాంతముల సంగతిసందర్భములను బాగుగా నెరింగిన విచారణసంఘమువారే యీ విచారణను సలుపజాలుదురు. ఈవిషయమున మావిచారణసంఘసభ్యులు శ్రీయుత ఆనే, ప్రధాన్‌గార్లు అభిప్రాయము నియ్యకున్నారు.

సింధుసమస్య లతితీవ్రవాదోపవాదములకు కారణమైనను కర్ణాటకప్రతినిధి మాకు వివరముల నన్నిటిని

సింధు

తెలిపినవిధమున సింధునుండి యెవ్వరును మాకు తెలుపకుండుట శోచ

నీయము. సింధురాష్ట్రవిభజనమును కోరువారు కూడ కర్ణాటకులు చేసినవిధమున చిత్రపటములను వ్రాసియు, కావలసినవివరముల నన్నిటిని ఓర్పుతోడను, జాగరూకత తోడను సమకూర్చియు మాయెదుట బెట్టెద రని కోరు చున్నాము. మే మిదివరకు తెలియజేసినట్లు ఢిల్లీలో సమావేశమైన యఖిలపక్షమహాసభవారు సింధురాష్ట్రముయొక్క యార్థికపరిస్థితులను యోజించుట కొకయుపసంఘము నేర్పరచియుండిరి. కాని ప్రత్యేకరాష్ట్రమును కోరువారెవ్వరు నీసంఘమునకు తగురీతిని తోడ్పడలేదు. ఆసంఘము నివేదిక నింకను సమర్పింపలేదు. త్వరలో నివేదికను సమర్పించునను సూచనలుగూడ కానరావు. ఇప్పటికి మట్టుకు సరియగు వివరములసహాయ మేమియు లేకయే కేవల సిద్ధాంతములపై నాధారపడి రాష్ట్రవిభజనమును సమర్థించెదము.

రాష్ట్రవిభజనమునం దనుసరింపదగిన రెండు ప్రధానసూత్రములను—భాష, ప్రజలకోర్కెలు—మేము ప్రథమముననే నిర్వచించితిమి. వీనినిబట్టి విచారించినచో సింధును ప్రత్యేకరాష్ట్రముగా విభజించుట కేపందియము లును ఉండవు. ఈరాష్ట్రములోని ప్రజ లందరు నొక్క భాషనే మాటలాడెదరు. మరియు, ప్రజలలో నత్యధిక



సంఖ్యాకులు విభజనను కోరుచున్నారు. ప్రత్యేకరాష్ట్రమును నిర్మింపవలె నని కోరువారిసంఖ్య యింత యని రూఢిగా నిర్ణయించుటకు మాకు ఆధారము లేమియు లేవు. కాని మహమ్మదీయు లందరును, ఒక్కప్రతికూలు డైనను లేక రాష్ట్రవిభజనము నామోదించుచున్నారు. సింధులో మహమ్మదీయులే నూటికి 74 వంతు లున్నారు. ఇతరమతములవారిలో—హిందువులలోను, పారసీకుల లోను — కొందరు రాష్ట్రవిభజనము నభిమానించు చున్నా రని మాకు తెలిసినది. కావున ప్రజలలో బహుళ సంఖ్యాకులు ప్రత్యేకరాష్ట్రము నభిమానించుచున్నా రని మన మంగీకరింపవచ్చును. హిందువులలో చాలమంది, దాదాపుఅందరును, ప్రత్యేకరాష్ట్రవిభజనమునకు ప్రతికూలురుగానున్నా రనియు మాకు తెలియును; మరియు, అల్పజనసంఖ్యాకసంఘములో మూడవవంతుప్రజలు రాష్ట్రవిభజనము నొప్పుకొనిన గాని యారాష్ట్రమును ప్రత్యేకింపరా దని రాష్ట్రనిర్మాణము నభ్యంతరపెట్టువా రొకవింత మార్గమును సూచించుచున్నారు. ఈపద్ధతి యేమాత్రమును మంచిది కా దని మాకు తోచుచున్నది. స్వయంనిర్ణయసూత్రమునకు మాత్రమే కాక అధికసంఖ్యాకుల నిర్ణయమునకుగూడ నిది వ్యతిరిక్తమై విపరీతఫలితములను గలుగజేయును. నూటికి 10 మందిగాని, 15 మందిగాని చేరి,

నూటికి 90 లేక 85 మందియొక్క యభీష్టసిద్ధిని నిరోధింపగలరు. ప్రజాప్రతినిధిప్రభుత్వమున కిది వ్యతిరేకము.

ఇంకొక్కవిషయము విచారింతము. ఇట్టి పరిస్థితులలో అల్పజనసంఖ్యాకసంఘ మెట్టిదిగా నుండును ? సాధారణముగా రాష్ట్రవిభజనసమస్య హిందూమహమ్మదీయసమస్య గాని, సాంఘికసమస్య గాని మైయుండదు. రాష్ట్రవిభజనమునకభ్యంతరములు చెప్పు అల్పసంఖ్యాకులు దాని గుణాగుణములనుబట్టి యభ్యంతరములు చెప్పుదురు గాని, సాంఘికకారణములవలన నెన్నటికిని అభ్యంతరములను చెప్పరు. ఈయల్పజనసంఖ్యాక సంఘమునకు జెందినవారిలో నొక్కని నైనను అభిప్రాయము మార్చుకొనువానినిగా మన మెట్లు చేయగలము ? కొంతమందిని మార్చగల మని తలతుముగాక ! అప్పటికైనను కొందరు ఆక్షేపకు లుందురు గాదా ? వారిలో మరల మూడవవంతుప్రజలను సుముఖులనుగా చేసికొనవలె నని కొందరు వాదింపవచ్చును.

రాష్ట్రవిభజనములో మన మనుసరింపదగినప్రధాన సూత్రములు రెండును సింధువిభజన విషయములో పూర్తిగా వర్తించుచున్నవి. మరియు సింధుప్రాంతము ప్రత్యేక నైసర్గికవిభాగముగూడ నైయున్నది. బొంబాయి రాజధానితో సింధును జతచేయుట అస్వాభావికము.



బొంబాయినుండి రాకపోకలకుగూడ దగ్గఱదాపుకాదు. కావున పరిపాలనసౌకర్యమున కాలోచించినప్పటికిని సింధును ప్రత్యేకరాష్ట్రముగా విభజించుటయే వాంఛనీయము. ఐనను, సింధుదేశముయొక్క సంపత్తిని వృద్ధిచేసికొనుట కవకాశములు లేవనియు, ప్రత్యేకరాష్ట్రమున కవసర మగు ఖర్చు నసలే సింధు భరింపజాలనంత బీదస్థితియందున్న దనియు అభ్యంతరములు చెప్పబడుచున్నవి. ఇంతియకాక సింధురాష్ట్రములో ప్రతిసంవత్సరము వచ్చుచున్న ఖజానా నష్టమును బొంబాయి రాజధానిలోని యితరభాగములు పూడ్చుచున్నవనికూడ వాదింపబడుచున్నది. సాధారణముగా నొకరాష్ట్రముయొక్క ఖర్చు దాని యాదాయమునకు మించరా దనియు, కేంద్రప్రభుత్వముయొక్క దయాధర్మభిక్షముపై రాష్ట్రము లాధారపడరా దనియు మా యభిప్రాయము. ప్రత్యేకపరిస్థితులలో కేంద్రప్రభుత్వము రాష్ట్రాభివృద్ధికై; కొంతకాలమువరకుమాత్రమే సాహాయ్యము చేసిన చేయవచ్చును. ఇంకను గొన్ని ప్రత్యేకసందర్భములయందుగూడ సాహాయ్య మవసరమై యుండును. కాని ప్రత్యేకరాష్ట్రముగా విభజింపవలసిన దని కోరుప్రాంతము పరిపాలనచక్రమును నడపుటకుగా నితరుల ద్రవ్యసాహాయ్యముపై నాధారపడి యుండరాదు. తనపరి

పాలనభారము నంతయు తానే భరింప నుద్దేశించి, యిట్లు ప్రకటింపవలెను.

సింధుదేశపరిపాలనమున కవసరమగు ద్రవ్యమును ప్రస్తుతము బొంబాయిరాజధానిలో నితరభాగములు సమకూర్చుచున్న వని తలంతము. దీనివలన రాష్ట్ర నిర్మాణము వీలు కా దని యెట్లు దృఢముగా చెప్పవచ్చును? ఖర్చులభారమును తగ్గించుటవలన జమాఖర్చు సరిపోవచ్చును. సాగుబడి కావలసినభూము లధికము చేయుటవలన ప్రభుత్వమునకు పన్నులవలన వచ్చురాబడి హెచ్చు కావచ్చును. మనకు స్వాతంత్ర్యము లభించినతక్షణమున నీసమస్యను మనము పరిష్కరించుకొనవలసియుందుము. దేశముయొక్క యభివృద్ధికై మన మెంతయేని ధనమును వెచ్చింతుము. జాతీయపునర్నిర్మాణమున కవసరమగు శాఖలను మనము బాగుగా పోషించెదము. రాష్ట్రమునందలి యనవసరములగు ఖర్చును తగ్గించి, క్రొత్తపన్నులను విధించి రాబడి హెచ్చించుటవలననే ఇది సాధ్య మగును.

సింధురాష్ట్రమునందు అభివృద్ధి కెన్నియేని యవకాశములు ప్రత్యక్షముగా గలవు. కరాచీనగరము గొప్ప నౌకాశయ మగును. ఇంకను సాగుబడి కావలసిన బంజరు



భూమి యెంతయో కలదు. సారమును వృద్ధిచేయవలసిన భూములుకూడ చాల కలవు. కావున కొంతకాలమునకు సింధుసంపత్తి యభివృద్ధియై పరిపాలనభారమును స్వయముగా నిర్వహించుకొనగలరాష్ట్ర మగుట కేసందియమును లేదు.

కేవలము ఆర్థికకారణములవలన స్వయంనిర్ణయసూత్రమును సింధుదేశప్రజలకు నిరాకరించితిమా ప్రజల మనములయం దసంతృప్తి యేర్పడి, సింధురాష్ట్రము యొక్కయభివృద్ధి కాటంకము గలుగును. రాష్ట్రపునర్నిర్మాణమునకు చెప్పు నభ్యంతరము లన్నియు ఆర్థికములే కాని యన్యములు కావు. అధికజనులకోర్కులను నిరాకరించిన యెడల రాష్ట్రాభివృద్ధికి తోడ్పడవలసిన ప్రజలశక్తి సామర్థ్యములు అవసరముమాలిన యాందోళనయందు వినియోగింపబడి, చవిటియందు నాటినవిత్తులవలె నిష్ఫలమగును. అట్లుకాక సింధురాష్ట్రమును స్వయంపోషకరాష్ట్రముగా చేయవలె ననుషరతుపై స్వయంనిర్ణయాధికారమును ప్రజల కొసంగితిమా, కష్టపడి పనిచేసి రాష్ట్రము నభివృద్ధిపరచుకొని, దానిని ఇతరరాష్ట్రములతో సమానముగా చేయుటకు రాష్ట్రప్రజలకు ప్రోత్సాహము మెండుగా నుండును.

కావున సింధురాష్ట్రవిభజనమునకు కారణములు మిక్కిలి బలీయము లని మేము తలచుచున్నాము. ఆర్థిక పరిస్థితులనుగురించి మాకు సంగతిసందర్భములు బాగుగా తెలియనికారణమున దానినిగురించి నిశ్చితాభిప్రాయము నేదియు నొసంగజాలకున్నాము. ఐనను, ఆర్థిక కారణములు మేము పైని చర్చించినముఖ్యసూత్రముల నన్నిటిని త్రోసిపుచ్చజాలినంత బలీయముగా నుండునుట యసంభవము. కావున నేవియో దాటరాని కష్టము లడ్డువచ్చిన తప్ప సింధురాష్ట్రమును బొంబాయినుండి విభజింపవలసినదే యని మేము సలహా నిచ్చెదము. అట్టి ప్రతిబంధకములను వేనినిగూడ ప్రస్తుతసమయమున మే మూహింపజాలకున్నాము.

మావిచారణసంఘసభ్యు లగు శ్రీయుత ఆనే ప్రధాన్‌గార్లు మా పైవాదము లన్నిటితోడను ఏకీభవింపజాలకపోయి రని చెప్పవలసియున్నది. సింధు భాషాప్రయుక్తదేశ మనియు, బొంబాయినుండి విడదీయుట యవసర మని యధికసంఖ్యాకులు తలచుచున్నా రనియు వా రొప్పుకొందురు. కాని యీవిషయమున తమయభిప్రాయమును తెల్పి చెప్పుటకు పూర్వము ఆర్థికచిక్కులను గురించియు, పరిపాలనసౌకర్యాసౌకర్యములను గురించియు పూర్తిగా విచారణ జరగవలె నని వా రభి



ప్రాయపడుచున్నారు. ఆర్థికసమస్యను విచారించినమీదటనే రాష్ట్రవిభజనమునకు పూనుకొనవలె నని మేముగూడ తలచుచున్నాము.

ఒకరాష్ట్రమును విభజించి, ప్రత్యేకరాష్ట్రముగా చేయుటవలన నూతన ఆర్థికపరిస్థితు లేర్పడు నని చెప్పవలనుపడదు. పరిపాలనచక్రములోని యంత్రభాగము లన్నియు క్రొత్తరాష్ట్రమునందు పునరుద్ధరించుటయు నవసరమై యుండదు. రెండురాష్ట్రముల కొక్కన్యాయస్థానము చాలును. ఇట్టివే మరికొన్ని రాజ్యాంగములను ఈ రెండురాష్ట్రములకును ఉపయోగపరుపవచ్చును.

ఈ విషయమును ముగించుటకు పూర్వము సింధుజాతీయసమితి (Sind National League) వారినుండి మాకువచ్చిన 'సింధుపాక్టు' అనుపత్రమువిషయమున కొంత చెప్పవలసియున్నది. దానిలో 10 షరతులు కలవు. ఆపత్రము అనేకవిషయములనుగురించి వివరించుచున్నది. హిందువులలోను, మహమ్మదీయులలోను పార్సీలలోను పెద్దలు 31 రు దానిలో సంతకములు చేసినారు. ఈ పత్రమును ఖండించుచు సింధు ఆరియన్‌సమ్మేళనము, సింధురాష్ట్రీయహిందూసభ, ప్రత్యేకముగా కొందరు హిందూప్రముఖులు మాకు విన్నపముల నంపినారు. సింధుపాక్టులో చేరినవారు ప్రజాప్రతినిధులు కారని వారు

తెలియబరచిరి. సింధురాష్ట్రప్రతినిధులు వారా వీరా యనుప్రశ్న నిర్ణయించుటకు మాకు సంగతిసందర్భములు తెలియవు. అది కనుగొనుటయు మా కవసరము లేదు. సింధుపార్టును ప్రజ లేకగ్రీవముగా నిర్ణయించి రని మే మొప్పుకొనవలసినబాధ్యత లే దనుటకు, సింధుప్రజలలో తగిన యేకీభావము లేకపోవుటయే ప్రబలకారణము. కొంత మంది బాధ్యత వహించిన పెద్దమనుష్యుల మాటలుగా దానిని జాగరూకతతో విచారించితిమి. సభ్యత్వస్థానము లను ప్రత్యేకించుటనుగురించిన షరతువిషయమున నిది వరకే చర్చించి దానికి మా యనంగీకారమును దెల్పితిమి. బొంబాయినుండి సింధును విభజింపవలె నని వారు చెప్పెడి మాటలతో మే మేకీభవించెదము. కాని పిండికొలది రొట్టె యని వారు చెప్పుమాటలను, ఆర్థికసమస్యాపరిష్కార వాక్యముగా నెన్నటికిని మే మొప్పుకొనజాలము. ఇప్పటికి ట్లుండనిండు. 'సింధుపార్టు'లోని యితరషరతులను ప్రస్తు తము విచారింప నవసరము లేదు.

---

# ఐదవ అధ్యాయము

## భారతసంస్థానములు—విదేశములతో సంబంధము.

---

ఇంక ప్రధానతమము లగు భారతసంస్థాన సమ స్యలనుగూర్చి విచారింతము. ఈవిచారణకు గడంగుటకు

భారత ప్రముఖులు సంస్థానములయెడల శ్రద్ధ వహించుట లేదా?

పూర్వము బ్రిటిష్ పరిపాలిత భారత దేశమునందలి ప్రజాహితజీవనులు సంస్థానముల సమస్యలలో తగు శ్రద్ధ వహించుటలేదని యనవసరముగా కొందరుమోపుఅపనిందలకుపరిహార ము చెప్పవలసియున్నది. భారతరాజకీయనాయకులు తమ చర్చలయందును, తాము నిర్ణయించురాజ్యాంగపద్ధతుల యందును, భారతసంస్థానములమాటయే తలపెట్ట రని యు, బ్రిటిష్‌పరిపాలితభారతదేశమునకును, సంస్థానము లకును, ప్రస్తుతము గాని, యికముందు గాని యుండవలసిన సంబంధముల విషయమున నుదాసీనత వహించుచున్నా రనియు, పల్కుట సామాన్య మైనది. ఇది యెంతమాత్ర మును సత్యము కాదు. రాజకీయసభలయందును, బహి రంగోపన్యాసములయందును, ప్రకటనలయందును, సంస్థా

నముల బాగోగులను గురించియు, సంస్థానములకును బ్రిటిష్ పరిపాలితభారత దేశమునకును ఉండవలసినసంబంధ బాంధవ్యములను గురించియు భారతప్రముఖులు తగు విచారణ జరపుచు వచ్చి రని నిస్సంశయముగా చెప్పవచ్చును. సంస్థానములసమస్యలనుగూర్చియు బ్రిటిష్ పరిపాలిత భారత దేశముతో నుండదగినసంబంధములనుగూర్చియు భారతశాసనసభలో చర్చ యెప్పుడును జరగుచుండుట లే దని వీరిపరితాప మైనయెడల దానికి ప్రత్యుత్తరము స్పష్టమే. శాసనసభానిబంధనము లట్టిచర్చకు నవకాశము నియ్యవు. మరియు నట్టిచర్చ సభవారియాచారమునకుగూడ విరుద్ధమే. ఇందులకు దేశీయనాయకులు బాధ్యులనుట యెంతమాత్రమును న్యాయము కా దని స్పష్ట మగుచున్నది. భారతశాసనసభలో సంస్థానముల విషయమున చర్చ నిషిద్ధ మైనను దేశములో పేరెన్నికగన్న ప్రతిష్ఠాపనలలో నొక్కటిగూడ, సంస్థానముల విషయమున నేదో యభిప్రాయము నిటీవల వ్యక్తపరచకుండ లేదు. దేశీయమహాసభయు, మితవాదుల సభయు, హిందూమహాసభయు, మావిచారణసంఘమునకు కారణభూత మైన యఖిలపక్షమహాసభయు, ఈసమస్యకు చాల ప్రాముఖ్యము నొసంగెను. సంస్థానప్రజలును ప్రబోధితులై తమతమ సంస్థానముల వ్యవహారములలో హెచ్చుగా



పాల్గొనుచున్నారు. సంస్థానప్రజల స్వాతంత్ర్యమును, హక్కులను సంస్థానాధీశ్వరులు గౌరవింపవలె నని వారు కోరుచున్నారు. సంస్థాన ప్రజాప్రతినిధులసభ లిప్పటికి రెండు జరిగినవి. మద్రాసులో జరిగిన రెండవసభవారిచే నేర్పాటు చేయబడిన యుపసంఘ మొకటి బ్రిటిష్ ఇండియాకును, సంస్థానములకును వర్తించు నొకరాజ్యాంగవిధానమును నిర్మించి మాయొప్పుదలకై దానిని నివేదించి యున్నారు. ఆవిధానమునుగురించి తరువాత విచారించెదము. ఇటీవల, బ్రిటిష్ పరిపాలిత భారత దేశమునందలి ప్రజలు, సంస్థానముల విషయమున అనవసరముగా జోక్యము కలుగ జేసికొనుచున్నా రని కొందరు సంస్థానాధీశ్వరులు కినిసినసంగతి మాకు తెలియును. భారతప్రజలకు సంగతిసందర్భములు తెలియ వనియో, రాజకీయేంగితము లే దనియో సంస్థానములయెడల అభిమానము లేదనియో, సంస్థానాధీశులు పల్కుచుందురు. కావున బ్రిటిషుపరిపాలిత భారత దేశములోని ప్రజలు తమ వ్యవహారములయందు మాత్రమే నిమగ్నులై, సంస్థానప్రజల యోగక్షేమముల నరయజాలని సంకుచితస్వభావము గలవా రని వారిపై మోపునిందను తీవ్రముగా ఖండింపవలసి యున్నది. మరియు భారతసంస్థానాధీశ్వరులయొక్కయు, సంస్థాన ప్రజల యొక్కయు బాగోగులను గ్రహింప నిష్టము

లేనివా రనుమాటలు గూడ పాటింపదగినవి కావు. మరియు అభిమానము చూపదగిన వేళలయం దెల్ల బ్రిటిషు పరిపాలితభారతప్రజలు మిక్కిలి యుదార స్వభావులై యభిమానమును ప్రకటించియుండిరి. భారతసంస్థానాధీశ్వరులహక్కులను కొన్ని వేళలయందు బ్రిటిషుపరిపాలిత భారత దేశప్రజలు విమర్శింపవలసి వచ్చిన వచ్చుగాక! సంస్థానముల యాంతరంగికసమస్యలనుగూర్చియు, సంస్థానములకును స్వాతంత్ర్య మనుభవింపగల బ్రిటిషుపరిపాలిత భారత దేశమునకును ముం దుండదగినసంబంధములను గూర్చియు, సంస్థానాధీశ్వరులదృక్పథమునకు వ్యతిరేకముగా వారు నిర్ణ యింపవలసివచ్చినవచ్చుగాక! ఇట్లుచేయుట వారికిగల హక్కేకాని యన్యముకాదు. బ్రిటిషు పరిపాలిత భారతదేశ మధినివేశస్వాతంత్ర్యమును బడయుటకు సంస్థానములసమస్య ప్రబలాటంక మను విషయమునకు కొందరు చాల ప్రాముఖ్యము నొసంగుట ఉపద్రవకరము. ఇట్టి విపరీతవాక్యములవలన భారతదేశములోని రెండుభాగములకును సామరస్యము కలుగుటకు మారుగా, దురభిప్రాయములు వృద్ధియై, దేశమున కెంతయేని యనర్థము వాటిల్లును.

‘భారతీయ భారతదేశ’ మనంబరగు సంస్థానములలో కొన్ని ఐరోపాఖండమునందలి దేశములకంటెను



పెద్దవి యనియు కొన్ని చిన్న వనియు నొప్పుకొనవలసిన దే. వీనిలో కొన్ని ‘ఆంతరంగిక సర్వాధికారము’ ననుభవించుచున్నవి. కొన్ని ‘స్వపరిపాలనము’ను కొన్ని ‘స్వాతంత్ర్యము’ను అనుభవించుచున్నవి. వీని గౌరవములలోను హోదాలలోను తారతమ్యములు కలవు. ఇ దంతయు సత్యమే యైనను బ్రిటిషుపరిపాలిత భారతదేశములోని ప్రజలకును సంస్థానప్రజలకును, స్పష్టముగా కనబడుచున్న ఐతిహాసిక, మతవిషయిక, సాంఘిక, ఆర్థిక సన్నిహితత్వమును గమనింపకుండుట ఉత్తమరాజనీతి కాని వివేకముగాని కా దని చెప్పవలసియున్నది. ఈ రెండుభాగములను కృత్రిమనైసర్గికవిభాగములుగా విభజించుటకును వలనుపడదు. 60, 70 సంవత్సరములక్రిందటి పరిస్థితులకును, ఇప్పటిపరిస్థితులకును చాల తారతమ్యము కలదు. అప్పుడు ప్రజలయభిప్రాయములును భావములును ఒక దేశమునుండి మరియొకదేశమునకు వ్యాపించుటకు చాలకాలము పట్టెడిది. ఇప్పుడన్ననో అతిశీఘ్రముగా వ్యాపించును. ఇట్లగుటవలన బ్రిటిషుపరిపాలిత భారతదేశమునందలిప్రజల మనములను కలవర పెట్టుచున్న నూతనాశయములును, భావములును, చాలకాలమువరకు అం దే స్తంభించియుండును గాని, సంస్థానములలోనికి

వ్యాపింప వని తలచుట వట్టివెఱ్ఱి. బ్రిటిషుపరిపాలితభారత
దేశమునందలి ప్రజల కేయభీష్టములును, ఆశయము
లును గలవో ఆయభీష్టములను ఆశయములను గలిగిన
సంస్థానప్రజలు ప్రస్తుతస్థితిగతుల నెల్లకాలము ఓరి
మితో సహించెద రనుట గూడ అసంభవము. ఇట్లేకా
శయప్రబోధితులుమాత్రమే కాక యేకజాతికిని, ఏక
మతమునకును జెంది, సన్నిహితసంబంధ బాంధవ్యము
లను గలిగిన బ్రిటిషు పరిపాలిత భారతదేశమునందలి
ప్రజలు, మానవకల్పిత సరిహద్దురేఖలయావల నివసించు
తమ సోదరసంస్థానప్రజలయండ నిలిచి, వారియిష్టార్థ
సిద్ధికై తగుప్రయత్నములనుజేయరనికూడ నమ్ముటకువీలు
లేదు.కావున నీసమస్యనుగూర్చి విచారించునపుడుస్వరూప
భేదములను పరిగణింపక, ప్రజలయేకాశయములను, అభి
ప్రాయములనుమాత్రమే పరిగణింపదగును. అన్యోన్యా
భివృద్ధికిని, రక్షణమునకును ఈరెండు భాగములయందలి
ప్రజలు కలసి ప్రయత్నించుట యొక్కటే స్వాభావిక మైన
మార్గ మని యందరకును స్పష్టము కాకమానదు. దీనికి
సంబంధించిన నాలుగుపక్షము లొక్కచో జేరి సంప్రతించి
యుండినచో మిక్కిలి సులభముగా ఒడంబడిక కుదిరియుం
డెడిది. సంస్థానప్రజల ప్రతినిధులును, సంస్థానాధీశ్వరుల



ప్రతినిధులును బ్రిటిషుప్రభుత్వ ప్రతినిధులును, బ్రిటిషు
ప్రజల ప్రతినిధులును కలసి సంప్రతించియుండినచో నంద
రకు నంగీకారమగు విధమున నన్నికష్టములు పరిష్కార
మై యుండవలసినది. కాని సమస్యాపరిష్కారమున కవ
సరమగు బ్రిటిషుభారతదేశమునందలి ప్రజలయభిప్రాయ
మును, సంస్థానప్రజల యభిప్రాయమును గూడ సంస్థా
నాధీశ్వరులు పరిగణింపకుండిరి. మరియు సంస్థానాధీశ్వ
రుల వ్యవహారములను పరిష్కరించుటకై బట్లరు
సంఘము నేర్పాటు చేయవలసిన దని కోరిరి. సంతోష
పూర్వకముగా నాసంఘము నొప్పుకొనిరి. ఈ సమస్యా
పరిష్కారమునందు తోడ్పడదగిన రెండు ప్రధానపార్టీ
లను బట్లరుసంఘము పాటింపకపోగా, మీదుమిక్కిలి
అది పరిష్కరింపవలసిన విషయముల పట్టికనుబట్టి చూడ
బ్రిటిషుపరిపాలిత భారతదేశమునకును, సంస్థానముల
కును ఉండదగినసంబంధములను పరిష్కరించుటకు
దానికి అధికారమే లేదని వ్యక్త మగుచున్నది. ఈబట్లరు
సంఘము రహస్యముగా విచారణ జరుపుచున్నది. కాని
ఇంతవరకు ప్రకటింపబడినసంగతులవలన, నీ సంఘము
వారు రాజ్యాంగసూత్రముల నండగా గొని, భారతసంస్థా
నములను ఐర్లండునందలి అల్‌స్టరువలె చేయ నుద్దేశించు

చున్నారని మాకుమనస్సులలో ప్రబలమగు అనుమానములు గలవు.

ఈ గ్రంథమునకు మేము వ్రాసిన ఉపోద్ఘాతమునందు భారతశాసనసభలో 1924 వ సంవత్సరము ఫిబ్రవరి మాసమున సర్ మాల్కం హెయిలీగారు నిర్వచించిన రాజ్యాంగసూత్రముల్లను గూర్చి తెల్పియుంటిమి. ఇతరులు గూడ నట్టివ్యాఖ్యానములనే చేయుచు వచ్చిరి. కావున వారి వాదములను ఖండించుట కింక బూనుకొనెదము.

రాజ్యాంగ సంబంధము

ప్రస్తుతసమయమున, భారత సంస్థానములకును, బ్రిటిషుపరిపాలిత భారతదేశమునకును గల రాజ్యాంగ సంబంధము కొంచె మస్పష్టముగా నున్నను, అర్థము కానంతక్లిష్టముగా లేదు. కేవలము రాజ్యాంగసూత్రమును బట్టి విచారించినచో, భారతసంస్థానములకు గల సంబంధ మాంగ్లరాజుతోనే కాని, యితరులతో గాదని కొందరు చెప్పుచున్నారు. సంస్థానములు చేసికొనిన యొడంబడికలు ఈస్టుఇండియా సంఘముతో నైనను, ఆంగ్లరాజుతో నైనను, 1858 నుండి ఇండియాప్రభుత్వముతోనైననుసరే యవి యాంగ్లరాజుతో చేసికొనబడినవనియేవారివాదము. ఇప్పుడు దీనిని కొంచెము విమర్శింతము. ఆంగ్లరాజ్యాంగ



మున 'రాజు' అనుపదమునకు ఒక్కరా జనిమాత్రమే కాదు. పార్లమెంటుతోకూడినరా జనునర్థమున దీనిని వాడెదరు. 1858 వ సంవత్సరమునకుపూర్వమాంగ్లరాజుచే సర్వాధికారములను బడసిన యీస్టు ఇండియాసంఘమ్ము వారు భారతదేశమున ప్రభుత్వము నెరపుచుండిరి. 1858 వ సంవత్సరమునకు తరువాత భారతదేశముయొక్క రాజ్యాంగమును నడపుటకు పార్లమెంటుసభవారిచే నియమింపబడిన భారతప్రభుత్వమును, ఇండియామంత్రియు, నీ ప్రభుత్వస్థానము నాక్రమించుకొనిరి. 1858 వ సం.మునందు చేయబడినచట్టమునందు 67 వ షరతులో 'పైని చెప్పబడిన సంఘమువారిచే చేసికొనబడిన ఒడంబడిక లన్నియు రాణీగారియెడలగూడ వర్తించును' అని యున్నది. ప్రస్తుతము అమలులో నున్నచట్టములోని 132 వ షరతులో "ఈస్టు ఇండియాసంఘమువారిచే చేసికొనబడిన యొడంబడిక లన్నియు, (ఈ చట్టము ప్రారంభ మైనప్పు డమలులో నున్నంతవరకు) రాజుగారివిషయమునగూడ వర్తించును" అని యున్నది. కాని ఆచరణలో, ఈయొడంబడికలప్రకారము అమలుజరుపుట, సంధిపత్రముల మూలకముగా చేయవలసివచ్చినపనులను నెరవేర్చుట, ఈ సంధిపత్రములకు వ్యాఖ్యానముచేసి అసలుఅర్థమును నిరూపించుట మొదలగుకార్యములుభారతకార్యదర్శియొక్క అజమాయి

వీని ఇండియాప్రభుత్వమువారు నెరవేర్చుచున్న సాధారణ కార్యక్రమములోని భాగములై యున్నవి. ప్రస్తుత పరిస్థితులలో నెవ్వడేని సంస్థానాధిపతి యొకడు, ఇండియాప్రభుత్వమును గాని, భారతకార్యదర్శిని గాని యతిక్రమించి, ఏదేనివిషయమును రాజుగారికిగాని, రాజుగారి ప్రభుత్వమునకుగాని, స్వయముగా చెప్పుకొనుట యసంభవము. ఇంతియకాదు. గ్రంథస్థ మగుచట్టము లేకయే, ఆచరణయందు చిరకాలముననుండి జరుగుచున్న పద్ధతులవలన భారతప్రభుత్వము కొన్నియధికారములను సంపాదించుకొనినది. తమయధికారములను విస్తరింపజేసికొనుటకు 1800 వ సంవత్సరపు ఫారిన్ జూరిస్డిక్షన్ ఆక్టును, (Foreign Jurisdiction Act - 1890) 1879 వ సంవత్సరమున చేయబడిన 21 వ చట్టమగు ఇండియన్ ఫారిన్ జూరిస్డిక్షన్ ఆక్టు (Indain foreign Jurisdiction Act-1879) ను, భారతప్రభుత్వమువారు ధారాళముగా నుపయోగించుకొనుచుండిరి.

ఇదిగాక, 1920 వ సంవత్సరము అక్టోబరు 29 వ తారీఖున చేయబడినతీర్మానానుసారముగా భారతప్రభుత్వమువారు భారతరాజ్యాంగసంస్కరణ నివేదికలోని 309 వ పేరగ్రాఫునుగూడ అమలులో నుంచిరి. ఈ పేరగ్రాఫులో ఒక ముఖ్యసంస్థానాధిపతియొక్క హక్కులను, గౌరవ



ములను, అధికారములను, తాత్కాలికముగాగాని, అసలేగాని తీసివేయవలసి వచ్చినప్పుడును, ఒక సంస్థానాధిపతి గతించినతరువాత సంస్థానముయొక్క న్యాయశాస్త్రము ప్రకారము పీఠమునకు రాదగినయువరాజును గాని, ఇతర వారసునిగాని ఆటంకపెట్టుటకును సంబంధించినవ్యవహారమును పరిష్కరించుటకును పద్ధతి యొకటి నిర్వచింపబడినది.

1926 వ సంవత్సరము మార్చి 27 వ తారీఖున రీడింగుప్రభువు ఘనతజెందిన నిజాంవారికి వ్రాసినలేఖలో

రీడింగుప్రభువు-రాజ్యాంగ సంబంధములు

నీసంబంధములు క్రింది విధమున నిర్వచింపబడినవి:—"(1) భారతదేశము నందాంగ్ల మహీపాలుని శాసనమే సర్వాధికారము కలది కావున భారత సంస్థానాధీశ్వరు లెవ్వరును సార్వభౌముని ప్రభుత్వముతో సమానప్రతిపత్తిపై రాయబారములను నడపు నధికార మడుగుటకు వీలులేదు. సంధిపత్రములమీదను, ఒడంబడికలమీదను మాత్రమే సార్వభౌముని సర్వాధికార మాధారపడి యుండలేదు. వీని కన్నిటికిని అతీతమై యది యలరారుచున్నది. రాజకీయ సిద్ధాంతములను నిర్ణయించుటయందును, అన్యరాజులతో సంబంధములను నిర్ణయించుటయందును మాత్రమే కాక, సంస్థానాధిపతు

లతో జేసికొనిన సంధిపత్రముల నన్నిటిని యథావిధిగా గౌరవించుచు భారతదేశమునం దంతటను శాంతియు సవ్యమగు ప్రభుత్వమును నెలకొల్పుటగూడ ఆంగ్లప్రభుత్వముయొక్క హక్కును విధియు నై యున్నది. (2) భారతసంస్థానముల యాంతరంగికసమస్యలలో జోక్యము గలుగజేసికొనుట కాంగ్లప్రభుత్వమునకు గల హక్కు గూడ ఆంగ్లసార్వభౌముని సర్వాధికారమువలన గలిగిన ఫలితమే యైయున్నది. (3) తమతమ రాజ్యములయందు సంస్థానాధిపతు లనుభవించుచున్న వివిధాధికారములు గూడ ఈసర్వాధికారయుత బాధ్యతా నిర్వహణమునకు లోబడియే యున్నవి."

అతివిస్తారము లగునీయధికారముల నన్నిటిని ఇటీవల కొందరు భారతసంస్థానాధీశ్వరులపై చెలాయించుటకు భారతప్రభుత్వము నిశ్చయించుట తీవ్రమగు విమర్శకు కారణ మైనది. మరియు చాలమందిసంస్థానాధీశ్వరుల కసంతృప్తిని గలుగజేసినది. వే యేల? రాజ్యాంగసంబంధములను వివరించుచు రీడింగుప్రభువు ఘనతవహించిన నిజాంవారికి వ్రాసినపైలేఖ 'అనేకులకు హృదయవేదనాసంజనక మైనది. ఈలేఖలో కోరబడిన హక్కులనన్నిటిని చర్చించుట మా యభిప్రాయము కాదు. కాని ఈ విస్తారాధికారములు గూడ భారత ప్రభుత్వముయొక్క



యుక్తాయుక్త నిర్ణయము ననుసరించియు, వారి స్వతంత్రప్రమేయమువలనను, వారి సొంతఅధికారవర్గము ద్వారానున్ను భారతప్రభుత్వమువల్లనే చెలాయింపబడగల వని తెలుపుటకుమాత్ర మీవిషయమును మే మిచట వివరించితిమి.

చిరకాలమునుండి తా మనుభవించుచున్న హక్కనియో, ఆచారమనియో, సర్వాతిశయమగు నాంగ్లేయాధికారముయొక్క ఫలిత మనియో భారతప్రభుత్వ మీక్రిందిహక్కులు తమకు గల వని చెప్పి వానిని చెలాయించుచున్నది. ఆహక్కులు (1) సంస్థానాధిపతులను పీఠములపై నుంచుట (2) సంస్థానాధిపతికి పరిపాలనయోగ్య మగువయస్సు వచ్చువరకు తామే సంస్థానమును పరిపాలించుట (3) సంస్థానాధిపతులకును వారిజాగీర్దారులకును వచ్చుతగాదాలను పరిష్కారము చేయుట (4) సంస్థానాధిపతి తన రాజ్యమును బాగుగా పరిపాలింపనప్పుడు జోక్యము గలుగజేసికొనుట.

విస్తారములగు నీహక్కులు భారతప్రభుత్వమునకుండుటవలన సంస్థానాధిపతులకు గలిగిన కష్టనిష్ఠురములను సంస్థానాధిపతులు తొలగించుకొన దలచుచో ప్రజాపరిపాలితభారతదేశముగూడ వాని నభిమానదృష్టితో

చూచుట సాధ్యముకావచ్చును. భారత దేశములో ప్రస్తుత మధికారము నెరపుచున్న ప్రభుత్వము గాని, ముందేర్పడ బోవు ప్రభుత్వము గాని సంస్థానాధిపతులవ్యవహారములలో జోక్యము కలుగజేసికొనగల పరిమితులను నిర్ణయించుట యసాధ్యము గాని, అనాచరణీయము గాని కాదు. ఈదేశ మధినివేశరాజ్య మైనప్పుడుకూడ భారత ప్రభుత్వము ప్రస్తుతప్రభుత్వమువలె, రాజుగారికి లోబడిన ప్రభుత్వముగానే యుండు ననియు, అధినివేశప్రభుత్వము ప్రస్తుత భారతప్రభుత్వస్థానము ననాయాసముగా నాక్రమించుకొనుటకు రాజ్యాంగసంబంధములగు అభ్యంతరములేమియు నుండ వనియు మఱువరాదు.

రాజుగారియెడల గాని, వారిసింహాసనమునెడల గాని, వారికుటుంబమునెడల గాని, సంస్థానాధిపతులకు స్వాయముగా గాఢమగు భక్తిశ్రద్ధలును, వినయవిధేయతలును ఉన్నయెడల, ప్రస్తుతభారతదేశప్రభుత్వ మధినివేశప్రభుత్వముగా మారునప్పు డవి యేమాత్రమును తగ్గ నవసరము లేదు. రాజుగారికిని సంస్థానాధిపతులకును ఉండిన అవినాభావసంబంధమువలన గలిగిన బాధ్యతలను సంస్థానాధీశ్వరులు నిర్వహించుటకును, అధికారములను రాజుగారు నిర్వహించుటకును, అధినివేశ ప్రభుత్వమునందుగూడ కావలసినంత యవకాశ ముండును.



సర్ లెస్లీస్కాట్ గారియభిప్రాయములు

ఈవిషయమున ప్రకటింపబడినయభిప్రాయములలో కడసారి దగులెస్లీస్కాట్ గారి యభిప్రాయములనుగూర్చి యింక చర్చింతము. సుప్రసిద్ధన్యాయవాదియగు సర్ లెస్లీస్కాట్ గారు బట్లరుకమిటీ యెదుట తమపక్షమున వాదించుటకు, సంస్థానాధీశ్వరులచే నియమింపబడిరి. వారు తమ యభిప్రాయములను జులై మాసమున ప్రకటింపబడిన లాక్వార్టర్లీ రివ్యూలో నొకలేఖయందు ప్రకటించిరి. స్కాట్ గారు గొప్పన్యాయశాస్త్రవేత్తయే. సందేహము లేదు. కాని సంస్థానాధీశ్వరుల కత డొసంగుసలహాను, రెండుపక్షములవాదములను వినిన ఒకన్యాయాధికారి గాని, న్యాయశాస్త్రప్రవీణుడు గాని పరీక్షించి యెంతవరకు సమంజసములో నిర్ణయించినగాని గ్రహించుటకు వీలులేదని చెప్ప సాహసించుచున్నాము. మామట్టునకు మేము వారియభిప్రాయములతో నేమాత్రమును ఏకీభవింపజాలము. రాజుగారికిని సంస్థానాధీశ్వరులకును గలసంబంధములు అంతర్జాతీయ న్యాయశాస్త్రవిధానమునకు గాని, దేశీయచట్టములకు గాని సంబంధించియుండలేదని నుడువుచు వారీక్రిందిప్రశ్నల నడుగుచున్నారు. "భారతసంస్థానములకు రాజుగారితో గలసంబంధ మేన్యాయసూత్రములపై

నాధారపడియున్నది? మార్గదర్శకముగా నుండుట కేన్యాయస్థానముయొక్క తీర్పు లేదే! ఈ సంబంధముల వంటిసంబంధములు ప్రపంచమున మరెచ్చటను లేవే! ఇట్టిస్థితిగతులలో న్యాయశాస్త్రప్రాథమిక సూత్రములపై మన మాధారపడుట తప్ప వేరుకర్తవ్యము లేదు. విషయములను బాగుగానాలోచించి మనకు మనమే తీర్మానించుకొనవలెను. న్యాయవాదుల కీవిషయమున కృషి సల్పుట కెంతయేని నూతనావకాశము కలదు" న్యాయవాదుల కెంతయేని నూతనావకాశము గలదని స్కాట్‌గారు నుడువుట సత్యముకాదని మేము చెప్పసాహసించుచున్నాము. న్యాయవాదుల కవకాశము లున్నవని తలచినను, ప్రతి విషయమును పరీక్షించి సత్యమా అసత్యమా యని తర్కించున్యాయవాదులకన్న నిర్మాణ సామర్థ్యము గలిగినరాజనీతిజ్ఞు లీవిషయమున చేయదగినకృషి హెచ్చుగా నున్నదని మేము తలచుచున్నాము. లెస్లీస్కాట్‌గారు వ్రాసినలేఖలో 5 సూత్రము లున్నవి. వీనిలో కొన్ని సత్యమని యంగీకరింపవచ్చును. కొన్ని అతివిశాలముగా నున్నవని మాయభిప్రాయము. ఏది యెట్లున్నను లెస్లీ స్కాటుగారు నిర్వచించినసూత్రములనుండి తీయనెంచిన సారాంశముల ఫలితము లింతిం తని చెప్పరాని ప్రాముఖ్యము గలిగియున్నవి. లెస్లీస్కాటుగారు మిక్కిలి తెలివి



తేటలతో వాదించుచున్నవాదనపై భారతసంస్థానాధిపతు లాధారపడ నిశ్చయించిరేని, బ్రిటిషుపరిపాలితభారతదేశమునందలి ప్రజలయొక్క అధినివేశస్వాతంత్ర్యవాంఛ యెడల, వారు చూపుచుండినసానుభూతి వట్టిమిథ్య యని బ్రిటిషుపరిపాలితభారతప్రజలు తలంపకుండజాలరు. మరియు, భారతదేశము సమాఖ్యప్రభుత్వముగా (Federal Govt.) నుండవలె ననియు, దానిలో సంస్థానములుకూడ చేరవలె ననియు వారు చెప్పుమాటలలో గూడ సత్యము లేదనియు, అది యెప్పుడో మరల కృతయుగము వచ్చినప్పుడు సంభవింపగలయాశయ మనియు మన మూహింపవలసియున్నది. లెస్లీస్కాట్‌గారు నిర్వచించిన ప్రథమసూత్ర మిట్లున్నది. (1) "సంస్థానాధిపతులకును ఆంగ్లరాజుకును గలప్రధానసంబంధ ముభయుల యొప్పందలయే. ఆంగ్లదేశ మీసంబంధమును నిస్సంశయముగా నొప్పుకొనియున్నది." ఇది సత్యమని యూహింపవచ్చును. సంధిపత్రములవలనను, ఒడంబడికలవలనను కట్టువడిన రెండుదేశముల విషయమునను చెప్పదగిన మాటలకన్న నెక్కువ యిం దేమియు లేదు.

స్కాట్‌గారు నిర్వచించిన రెండవసూత్రము 'ఆ యొడంబడికలుసంస్థానాధిపతులుస్వయముగా రాజుగారితో చేసికొనినవిగాని, ఈస్టుఇండియాసంఘముతోగాని, బ్రిటిషు

ఇండియా ప్రభుత్వముతో గాని చేసికొనినవి గావు.' అనినై యున్నది. ఐతిహాసికముగ జూచినను, న్యాయశాస్త్రసమ్మతముగా నాలోచించినను, ఈసూత్రమును సమర్థింప వీలు లేదని మేము తలంచుచున్నాము. అసలు న్యాయశాస్త్రసమ్మత మగుసిద్ధాంత మెట్లున్నను, ఆచరణయందుమాత్రము సంస్థానాధిపతులు భారతప్రభుత్వముతోడనే సంబంధము కలిగియుండి రనియు, దాని నిర్ణయములకును తీర్మానములకును కట్టువడి యుండి రనియు స్పష్టమగుచున్నది. భారతప్రభుత్వము జోక్యము కలుగజేసికొనుచున్నను వారు సహించి యూరకుండిరి. సంస్థానాధీశ్వరులు సరాసరిగా రాజుగారితో గాని, రాజుగారి ప్రభుత్వముతోగాని రాయబారముల నెప్పుడును చేసి యుండలేదు. రాజుగారికిని సంస్థానాధీశ్వరునికిని గలస్వకీయ సంబంధమువల్ల, న్యాయముగా నిదివర కేర్పడినసంబంధము గాని, ఆసంబంధమున కాచరణయం దేర్పడు భావము గాని మారజాల దని మా యుద్దేశము.

'ఈసంబంధము న్యాయశాస్త్రసమ్మతమే కాని, తద్వ్యతిరేక మెంతమాత్రమును కాదు. పరస్పర మగు హక్కులమీదను, బాధ్యతలమీదను ఆధారపడియుండునదే కాని, నిర్హేతుక మెన్నటికిని కాదు.' ఇది స్కాటుగారి మూడవసూత్రము. ఆచరణలో న్యాయశాస్త్ర



సమ్మతమగు సంబంధముల నన్నిటిని అతిక్రమించి భారతప్రభుత్వము 'నిరంకుశము'గా ప్రవర్తించుచుండుట సంస్థానాధీశ్వరుల కెంతయేని పీడాకరముగా నున్నదని మేము తలచియుండవలసినది. ఇట్టి నిరంకుశమార్గమును ద్రొక్కినందులకు భారతప్రభుత్వమునెడల తమ యసమ్మతిని సంస్థానాధీశ్వరులు తెల్పియుండినయెడల అర్థము చేసికొనుటకు వీలుగా నుండెడిది. కాని పైరీతిగా నిర్వచింపబడియున్న సూత్రముయొక్క ప్రాముఖ్యము ప్రస్తుతమాచరణయం దున్నస్థితిగతులకు సంబంధించి యుండక పోవుటయు, ముం దెప్పుడో బ్రిటిషుపరిపాలితభారత దేశమునందు కలుగనున్న మార్పులకు సంబంధించియుండుటయు విపరీతము కదా!

'ఈయొడంబడికలను చేసికొనునప్పుడు సంస్థానాధీశ్వరు లాంగ్లరాజునెడలను, ఆంగ్లప్రజలయెడలను మాత్రమే విశ్వాసము నుంచిరి. కావున ఆంగ్లరాజు మూడవవారి కెవ్వరికిని ఈయధికారముల నొసంగరా' దనునది స్కాటుగారిచే నిర్వచింపబడినసూత్రములలో నాల్గవదై యున్నది. వారి లేఖలోనిమాట లి ట్లున్నవి. 'బ్రిటిషు ప్రభుత్వము భారతదేశములో సర్వాధికారము గలదగుట వలన సంస్థానముల నన్నిటిని రక్షింపబూనుకొనినది. కావున ఆవిధిని నిర్వర్తించుటకు చాలినంత సేనాబలము

తోడను, నావికాదళముతోడను భారత దేశములో నుండుటకు నిశ్చయించినది. ఈసేనలను గాని, నావికాదళమును గాని మరియొక ప్రభుత్వమున కిచ్చుటకు వీలు లేదు. ఫ్రాన్సు, జపానులవంటి పరరాజ్యములకు గాని, కెనడా, ఆస్ట్రేలియాలవంటి యధినివేశరాజ్యములకుగాని, బ్రిటిషు పరిపాలితభారత దేశమునకు గాని యీయధికారములను సంక్రమింపజేయుటకు బ్రిటిషుప్రభుత్వమున కధికారము లేదు.'

ఇంక నైదవసూత్రమునుగురించి విచారింతము. ఇది నాల్గవసూత్రమునందు ప్రతిపాదిత మయినయర్థముయొక్క సారాంశమే కాని యన్యము కాదు. అది యిట్లున్నది. 'రాజుగారు సాధారణముగా తన క్రిందియధికారులను నియమించుకొనవచ్చును. కాని తన క్షేమమునకును నిధ్యుక్తమునకును సంఘర్షణ కలుగునప్పు డధికారి తన ధర్మమును సరిగా నిర్వర్తింపజాలడు. సుంకములు, రైల్లు, రేవులు, ఉప్పుపండించునధికారము మున్నగువానియందెల్ల బ్రిటిషుపరిపాలిత భారత దేశముయొక్క లాభమునకును సంస్థానములలాభమునకును ఎప్పుడైనను సంఘర్షణ కలుగవచ్చును. అట్టిసమయములయందు సంస్థానముయొక్క హక్కులను రక్షించుట రాజుగారిధర్మమై యున్నది. ఒకానొక సంస్థానముయొక్క వారసుడు



చిన్నవాడై పరిపాలనభారము తమ మీద నున్నప్పుడు ఆంగ్లరాజుగారిబాధ్యత మరింత హెచ్చుగా నుండును. ఆంగ్లరాజుగారి విధ్యుక్తమునకును, ఆయన క్రింది యధికారియొక్కస్వలాభమునకును సంఘర్షణ వచ్చునట్లెన్నటికైన నొప్పుకొనవచ్చునా?' ఈమాటలే సత్యములైనచో బ్రిటిషుపరిపాలితభారత దేశ మిప్పటికిని, ఎప్పటికిని అధినివేశస్వాతంత్ర్యమును బడయకుండ ఆటంకములు కల్పించుట యగును. ఏల యన? సంస్థానాధిపతులకును, ఆంగ్లరాజునకునుగల సంబంధములు ఆవ్యక్తులకే ప్రత్యేకముగా సంబంధించినచో భారత దేశమును బ్రిటిషు పరిపాలితభారత దేశ మనియు, భారతసంస్థానము లనియు, ఎల్లకాలమును విభజింపక తప్పదు. భారతసంస్థానముల యెడల తమవిధ్యుక్తమును నిర్వర్తించుటకు, ఆంగ్లప్రజలెల్లకాలము సేనలను, నావికాదళమును, మన దేశములో నుంచక తప్పదు. ఈవాదములో నిపుణత్వముతప్ప ఇంకేమియు లేదని చెప్పసాహసించుచున్నాము. వాదము సరియైన ఉపమానముమీద నాధారపడి యుండలేదని చెప్పవలసియున్నది. ఆ ఉపమానమునుప్రయోగించుటయందు గూడ స్థితిగతులపరిజ్ఞానము బొత్తిగా లేకున్నది. సంస్థానాధిపతులకును, రాజుగారికిని గలసంబంధము లిద్దరు సామాన్యవ్యక్తులకు గలసంబంధమువలెనే యున్నవని

తలచుటకు కారణ మేదియు లేదు. తన లేఖలో నింతకు ముందు సంస్థానాధిపతులు కొన్ని యధికారములను ఆంగ్ల రాజుగారిపరము చేసినను ప్రభుచిహ్నములను గలిగియున్నా రని లెస్లీస్కాట్ గారు చెప్పియుండిరి. పర్యాప్తములగు అధికారములను గలిగినట్టి రాజులవలెనే, యింకొక రాజుతో (ఆ రాజు ఈస్టు ఇండియా సంఘమైనను సరే, లేదా పార్లమెంటుసలహాతో రాజ్యమేలుచున్న ఆంగ్ల రాజైననుసరే,) సంస్థానాధీశ్వరులు వ్యవహారము నడపియుందు రని తలపవలెను.

మరియు ఇద్దరువ్యక్తులు తమలో తాము చేసికొనినయొడంబడిక లన్నియు వారిచేతనే న్యాయముగా నిర్వహింపబడవలెనుగాని, మూడవవానిచే నిర్వహింపబడజాలనివిగా నుండు నని చెప్పుట సమంజసముగా నుండదు. ఒడంబడిక చేసికొనినవారిలో నొకరి కింకొకరిపై విశేషమైననమ్మకము గల దని చెప్పుటయు సత్యము కాదు. అప్పటిస్థితిగతులనుబట్టి యీయొడంబడిక లని పిలువబడు వానిని సంస్థానాధీశ్వరులు తప్పనిసరిగా చేసికొనవలసినవారైరి. బ్రిటిషుపరిపాలకులస్థానమున మరెవ్వ రుండినను, ఈయొడంబడికలు గాని, లేదా యిట్టియొడంబడికలు గాని చేసికొనబడియుండెడివి. లెస్లీస్కాటుగారివాదము ఇండియాప్రభుత్వమువారి చిరకాలానుగతాచారమును



సరకుగొనక, న్యాయశాస్త్రసమ్మత మగు నీసంబంధములను నిర్ణయించుటకు ప్రాతిపదికసూత్రముల నాశ్రయముగాగొని, ఈస్టిండియాసంఘ ప్రారంభదశనుండి సంస్థానాధిపతులతోడను, సంస్థానములతోడను భారతప్రభుత్వమే వ్యవహారము జరపుచుండెనను నిర్వివాదాంశమును గమనించకున్నది. సంస్థానాధిపతులకు ఆంగ్లప్రజలయెడల గల విశేషనమ్మకమేదో మనకు బోధపడదు. ఆంగ్లరాజుగారినుండి సర్వాధికారములనుబొంది భారతదేశమున పరిపాలనభారమును నిర్వహించినట్టియు, నిర్వహించుచున్నట్టియు భారతప్రభుత్వాధికారము సంస్థానాధిపతులకును, సంస్థానములకును సమ్మతమైనట్టును, ముందు స్థాపింపబడు ప్రభుత్వము, అధినివేశరాజ్యములవంటి దైనయెడల తమ కంగీకారము కానట్టును స్ఫురించుచున్నది. తేటమాటలలో దీనియర్థమేమి? ఇదివరకు పరిపాలన చేసినట్టియు, ఇప్పుడు పరిపాలన చేయుచున్నట్టియు ప్రభుత్వములు విజాతీయములు గనుకను, భారతనియోజకవర్గమున కెంతమాత్రమును బాధ్యులుకారు గనుకను సంస్థానాధీశ్వరుల కంగీకార మయ్యె ననియు, నికముందు స్థాపింపబడుప్రభుత్వము సజాతీయము గనుకను తమ స్వదేశస్థులతో గూడుకొనిన నియోజకవర్గమునకు బాధ్యులుగా నుందురు గనుకను, సంస్థానాధీశ్వరుల కంగీకారముగా నుండ దనియు

స్పష్ట మగుటలేదా? ఇది యిట్లే యని యూహించినను ఏ 'యొడంబడిక' యైనను ప్రత్యామ్నాయాధికారిచే నిర్వహింపబడవచ్చునని యున్నప్పుడు, నిర్ధారణవిషయములో ప్రభువునకు హక్కు లేదనియు, ఒడంబడికదారులలో రెండవవారికిమాత్రమే హక్కు గల దనియు చెప్పుట కేమి ప్రమాణ మున్నది? ఇంతవరకు ఈ 'ఒడంబడిక' తెల్ల ప్రతినిధులవలన, నల్లసంస్థానాధిపతులకు తృప్తికరముగా నగపడువిధమున నిర్వహింపబడె నని చూపియుంటిమి. తెల్లయధికారులే సంస్థానాధీశ్వరులకు తృప్తి గొలుపగలుగుచో స్వదేశీయులగు భారతీయు లాయొడంబడిక నంత తృప్తికరముగా నిర్వహింపజాల రని న్యాయశాస్త్రములో నేమాత్రమునం దున్నది? అంతకంటెను తృప్తికరముగానే నిర్వహింపగల రనుట సత్యము.

ప్రతినిధియొక్క క్షేమమునకును, విధ్యుక్తమునకును సంఘర్షణ కలుగునపుడు ప్రభువు తన కార్యనిర్వహణభారమును ప్రతినిధిమీద మోపరాదనువాదము నింకవిచారింతము. ఈవిషయమునగూడ స్థితిగతులనుగమనింపకపీరువాదనకు దిగిరని మనకు స్పష్టమగుచున్నది. రాజుగారి ప్రతినిధి, అనగా ప్రస్తుతప్రభుత్వముతన శ్రేయమునకును, విధ్యుక్తమునకును సంఘర్షణసంభవించునప్పుడెల్ల మనస్సంకోచ



ములను వీడి తన శ్రేయమునే చూచుకొనుచున్న దనుట ప్రసిద్ధము. తనయధికారి పక్షపాతబుద్ధితో వ్యవహరించుచున్నాడని ప్రభువుగాని, తమకన్యాయము జరుగుచున్నదని సంస్థానాధీశ్వరులుగాని బహిరంగముగా నెన్నడును చెప్పలేదు. ఆతరువాత లెస్లీస్కాట్‌గా రిట్లు చెప్పుచున్నారు. 'న్యాయసమ్మతములగు అన్యోన్యసంబంధము స్పష్టమైన తరువాత, (అనగాఆసంబంధమువిషయమున తనయభిప్రాయము వ్యక్తమైనతరువాత అని యర్థము) సంస్థానములకును, బ్రిటిషుపరిపాలిత భారతదేశమునకును అన్యోన్యతకుదుర్చుటకు తగిన రాజ్యాంగవిధాన మేర్పరుపవచ్చును. న్యాయసమ్మతమగు నేపద్ధతి నైనను తా మొప్పుకొనెదమని సంస్థానాధీశ్వరు లిదివరకే తెలియబరచినారు.' దీని యర్థమేమి? సర్ లెస్లీస్కాట్‌గారు నిర్వచించిన-స్వకీయ సంబంధములు, ఆంగ్లరాజుగారియందును, ఆంగ్లప్రజలయందును సంస్థానాధిపతులకుగల విశేషనమ్మకము, ఇందువలన ఆంగ్లప్రభువు సంస్థానాధిపతులను రక్షించుటకై యవసరమగు సేనలతోడను నావికాదళముతోడను భారతదేశమున నెల్లకాల ముండుట — అనువీని నన్నింటిని మన మొప్పుకొనినచో సంస్థానాధిపతులు బ్రిటిషుపరిపాలిత భారతదేశ వ్యవహారములలో నేదో ఒకన్యాయ మగు పద్ధతిని పాల్గొనదలతు రని దీనియర్థము. ఈవాదము సరి

క్రమైనదని యొప్పుకొంటిమా, భారతసంస్థానాధిపతులకును బ్రిటిషుపరిపాలిత భారతదేశమునకును అన్యోన్యత కుదుర్చుట కేర్పరుపబడువిధాన మేది యైనను, భారతదేశమునకు అధినివేశప్రతిపత్తి లభించు ననుమాట కల్ల. ఈవాద పద్ధతి సరియైనది కాదని నిరూపించితిమి. న్యాయశాస్త్రమునందలి నిపుణత్వము దేశక్షేమమునకు విరుద్ధము లగు కార్యములకు తోడ్పడకుండుగాతమని మనఃపూర్వకముగా కోరుచున్నాము. మరియు సంస్థానాధీశ్వరుల దేశభక్తికిని, రాజనీతికిని తోడు, సంస్థానప్రజల దేశభక్తియు, స్వేచ్ఛానురక్తియు, అనవసరమును, అనర్థదాయకమును నగు న్యాయశాస్త్ర సమ్మతము లగు సంబంధముల చర్చయందు వినియోగింపబడక, తమకును ముందు స్థాపింపబడబోవు భారతప్రజాస్వామ్యమునకును గల వ్యవహారములను పరిష్కరించుట కాచరణయోగ్య మగు నొకవిధానమును నిర్మింపబూనుటయందు వినియోగింపబడుట శ్రేయోదాయక మని మనవిచేయుచున్నాము. ఇద్దరును అంగీకరించినగాని సంబంధములు తృప్తికరముగా నుండజాలవు. సంస్థానములకును బ్రిటిషుపరిపాలిత భారతదేశమునకును ఈయన్యోన్యత కుదురుటకు చాల అవకాశము గలదు. కాని ప్రస్తుతస్థితిగతుల కెంతమాత్రమును సంబంధించియుండని వాదనైపుణిచే న్యాయసమ్మతము



లును, స్వాభావికములును నగు భారతప్రజలయాశయము లెంతమాత్రమును ఆటంకపరుపబడుటకు గాని భంగపరుపబడుటకు గాని మన మొప్పుకొనమని ముందుగా తెలుపవలసియున్నది.

సర్ లెస్లీ స్కాటుగారి లేఖలోని యీక్రిందివాక్యములు ప్రత్యేకముగా గమనింపదగియున్నవి.

"భారత సంస్థానాధిపతులకును బ్రిటిషుపరిపాలిత భారతదేశమునకును సంబంధమాలవలన కలుగు ఫలితములు భావి భారతరాజకీయములయం దెంతేని ప్రాముఖ్యము వహించుచున్నవి. వీనిని తెలివితేటలతో పరిష్కరించితిమేని బ్రిటిషుపరిపాలిత భారతదేశవ్యవహారములను విచారించుటకు పార్లమెంటుసభవా రేర్పాటుగావించిన సైమన్ సంఘముయొక్క కార్యభార నిర్వహణము జయప్రదముగా కొనసాగుట కవి యెంతేని తోడ్పడగలవు. సామ్రాజ్యశ్రేయము నాలోచించినను నివి ముఖ్యతమములే. ఇప్పుడు భారతసంస్థానాధిపతుల యెడల నుత్తమరాజనీతితో ప్రవర్తించితిమేని, ఆంగ్లసామ్రాజ్యము నెడల భావిభారతదేశమున కుండవలసినవైఖరి నిర్ణయించుటయందు మనప్రవర్తన యొక ముఖ్యహేతువుగ నుండును."

దీనియర్థ మేమి? బ్రిటిషుపరిపాలితభారత దేశప్రజలు బట్లరుసంఘము నెదుట తమ యభిప్రాయములను చెప్పుకొనుట కవకాశ మేమియు నియ్యక రహస్యముగా విచారణ జరపి, బట్లరుసంఘమువారు చేసిన నిర్ణయములు బ్రిటిషు పరిపాలిత భారత దేశప్రజలగతిని నిర్ధారణ చేయు ననియేకదా? ఇదిగాక 'ఎంతేని ప్రాముఖ్యము వహించిన యీ రాజకీయసంబంధములవలన గలుగు ఫలితములతో' సైమన్ గారికిని, అతని సంఘమునకును నిమిత్తము లేనట్లును, పార్లమెంటుమహాసభవారిచే నొసంగబడిన కార్యనిర్వహణభారమును వారు జయప్రదముగా కొనసాగింపవలసినయెడల బట్లరుసంఘము తెలివితేటలతో చేయు నిర్ణయములమీద నాధారపడి యుండవలె ననియు తేటపడుచున్నది. ఇట్లు జరుగు నని భారతీయు లెప్పుడో తెలిసికొనిరి. అనేకసభలలో నిదిబహిరంగముగా ప్రకటింపబడెను. సైమన్ సంఘము నిర్వహింపగల కార్యనిర్వహణభార మేదియో యిప్పుడు మనము సరిగా గ్రహింపగలిగి యున్నాము. ఈసమస్యలను తెలివితేటలతో పరిష్కరించుటకు సర్ లెస్లీస్కాటుగారు చేయుసూచన యొక్కటే గలదు. అది యతని వాక్యములలోనే 'భారతప్రభుత్వము తన బాధ్యతలను నిర్వహించుటకు తగిన సేనాబలముతోడను, నావికాదళముతోడను, భారత దేశమున నుండ



వలెను' అనియై యున్నది. సైమన్ సంఘము చేయబోవు సిఫారసు లిట్టి వని నమ్మకముగా మనకు జోస్యము చెప్పినందులకు సర్ లెస్లీస్కాటుగారిని మన మెంతయో అభినందింపవలసి యున్నది. ఈసంగతి తెలిసియే భారత దేశములోని ముఖ్యపార్టీలన్నియు సైమన్ సంఘము నెడల తిరస్కారభావములను వహించినవి. ప్రజలిట్లుచేయుటలో అధర్మ మేమియు లేదు.

సంస్థానాధిపతులకును, రాజుగారికినిగలసంబంధములను నిర్వచించు సిద్ధాంతముల నటుంచి యథార్థస్థితిగతులను విచారించినచో, సంస్థానప్రభువుల స్వవిషయములోగాని తమసంస్థానములపక్షమునగాని, సంస్థానాధిపతులకు గల వ్యవహారము లన్నియు భారతప్రభుత్వమువారితోనే జరుగుచుండుట యాచారమని మేముచేయుచున్న వాదము యథార్థమనిస్పష్టముకాకమానదు. భారతప్రభుత్వమువారి రాజకీయకార్యదర్శికి భారతసంస్థానములపై చాల అధికారము గలదని యందరకును తెలిసినవిషయమే. భారతప్రభుత్వములో నొకసభ్యుడు గాకుండ, సభ్యునికున్నయధికారముల నన్నిటిని అతడు నిర్వహించుచుండును. ఏలయన రాజకీయశాఖకు ప్రత్యేకపుసభ్యుడు లేడు,గవర్నరుజనరలే యీశాఖను స్వయముగా పరిపాలించు నని యూహింపబడుచున్నది. రాజకీయశాఖవారు సంస్థానాధి

పతులకుగాని, సంస్థానములకుగాని వ్యతిరేకముగా నేదైన తీర్పు నియ్యవలసివచ్చినయెడల, దీనికి సంస్థానాధిపతులు 'కొన్ని పరతులకును, కొన్ని హద్దులకును లోబడి భారత కార్యదర్శికి అపీలుచేయుట' కన్న వేరు గత్యంతరము లేదు. ప్రస్తుతస్థితిగతులలో సంస్థానాధీశ్వరు లిది యొక యమూల్యమగు హక్కని తలచుచున్నారని మాకు తెలియును. కాని ప్రప్రథమమున భారతదేశములోనే యీ వ్యవహారములను, పరిష్కరించుటకొకతృప్తికరమగుపద్ధతి లేకపోవుటచే నిది యవసరమయి యుండవచ్చునని మేము తలచుచున్నాము. చక్కగా విచారణ జరుగనట్టివ్యాజ్యెములో, అపీలు చేయుటకు అధికార మున్నను ప్రయోజనముమాలిన దని స్పష్టమగుచున్నది. అపీలుచేయుటకు మారుగా భావిభారతరాజ్యాంగవిధానములోనే యీ వ్యవహారమును తృప్తికరముగా పరిష్కరించుటకు తగిన కట్టుదిట్టములు చేసికొనుట మేలగు నని మేము తలచుచున్నాము.

సంస్థానములకునుభారతప్రభుత్వమునకునుసంబంధముగాని సంఘర్షణగానివచ్చెడివిషయములు, సుంకములు, మత్తుపదార్థములమీద పన్నులనువేయుట, ఎవరి నేరస్థులను వారి కొప్పజెప్పుట, రైల్లు,తపాలాకచ్చేరీలు, నౌకా



శయము లని అనుభవమువలన తెలియుచున్నది. ఇవిగాక యిద్దరకు సంబంధించిన ముఖ్యవిషయము, ఆత్మరక్షణము గలదు. ఈవిషయములలో సంస్థానాధీశ్వరుల యిబ్బంది లని సామాన్యముగా అనుకొనెడివానివిషయమున నిప్పుడు పరీక్షించుట యవసరములేదు. బాధ్యత వహించిన సంస్థానాధిపతులును, సంస్థానముల మంత్రులును, అప్పుడప్పుడు భారతప్రభుత్వము తమకన్యాయము చేసిన దని గోలపెట్టుట చూచుచునే యున్నాము. ఎంతవర కీయిబ్బందులను తొలగించుటకు వీ లగును? ఎట్లవి బాగుగా తొలగును? అనునవి విచారణవలనను, ఇద్దరు కలసి సంప్రతించుకొనుటవలనను తేలవలసిన విషయములు. కాని ప్రస్తుతభారతప్రభుత్వస్వరూప మిప్పు డున్నట్లే యుండిన ఈసమస్యాపరిష్కారము సాధ్యపడును గాని మారినయెడల సాధ్యపడ దని మేమొప్పుకొనజాలము. వివాదాంశములను పరిష్కరించుటకు ప్రత్యేకమును స్వతంత్రమును అగు విచారణసంఘము నొకదానిని నియమించుటగూడ అవసర మని మేము తలంపము.

సంస్థానాధీశ్వరులకును, భారతప్రభుత్వమునకును వచ్చు వివాదములను పరిష్కరించుట కొకప్రత్యేక సంఘము నేర్పాటు గావించుటనుగూర్చి యిటీవల కొలది మాసములనుండి రహస్యముగా జరుగుచున్నయాలోచన

లనుగురించి ప్రజల కేమియు తెలియుటలేదు గావున ఈ విషయమున నింతకంటె విపులముగా చర్చించుటకు వీలు కాకున్నది. కాని సంస్థానాధీశ్వరుల న్యాయవాది యగు సర్ లెస్లీస్కాటుగారు భారతదేశముననుండి యాంగ్లదేశమునకు వెళ్లుటకుపూర్వము ఈ సందర్భమున చేసిన కొన్ని ప్రకటనలనుండి సారాంశములను గ్రహింప వీలగుచున్నది. గవర్నరుజనరల్‌తో సంప్రతించి వ్యవహారము జరుపునట్టి సంస్థానాధీశ్వరుల ప్రత్యేకసంఘము నింకొక దానిని స్థాపించుటకు ప్రయత్నములు జరుగుచున్నట్లు గ్రహింపవచ్చును. ఇట్టిసంఘము నేర్పరచుట యెంతమాత్రమును పనికిరా దని మేము ముందుగా తెలియజేయవలసియున్నది. అనవసరముగానింకొక సంఘమును స్థాపించుట భార మగును. మరియు సంస్థానాధీశ్వరులుమాత్రమే ఆసంఘమునందు సభ్యులుగానుండుటవలన ఇప్పటిబ్రిటిషు ఇండియాప్రభుత్వముతోగాని, ముందు స్థాపింపబడబోవు భారతప్రజాస్వామ్యముతో గాని సంస్థానములకు వచ్చు వివాదముల నది పరిష్కరింపజాలదు. పలు అపభ్రంశములకును, ఇబ్బందులకును, రాజ్యాంగ సంబంధములగు చిక్కులకును కారణభూతమైన ద్వంద్వపరిపాలన విధానమును విస్తరింపజేయుట కిది యొక దుర్మార్గప్రయత్న మని మాకు తోచుచున్నది.



సర్ మాల్కం హెయిలీగారు తమ యుపన్యాసమునం దేదో ఒకవిధమగు సమాఖ్యపద్ధతిని(Federation) సూచించియుండిరి. సర్ లెస్లీస్కాటుగారి మనస్సులో గూడ నిట్టి యభిప్రాయమే యున్నట్లు మాకు నిస్సందేహముగా తెలియుచున్నది. మేము కూడ భారతదేశము సమాఖ్యపద్ధతి ననుసరించి యభివృద్ధినొందుటయే శ్రేయస్కర మని తలంచుచున్నాము. కాని భారతదేశ మిట్టి పద్ధతి ననుసరింపవలసినయెడల, సమాఖ్యపద్ధతి యన నేమో సరిగా గ్రహించుటయు, తద్రాజ్యాంగవిధానమున భారతసంస్థానముల కుండవలసిన యోగ్యస్థానమును స్పష్టముగా నిర్వచించుటయు అవసరము. భారతసంస్థానములు సరియగు సమాఖ్యపద్ధతిలో పాల్గొనుట కిచ్చగించుచున్నవా? సర్ లెస్లీస్కాటుగారును, సంస్థానాధిపతులును కృషిచేయుచున్న వైఖరిని గమనించినచో ప్రస్తుతము సమాఖ్యపద్ధతి యని యందరచే నంగీకరింపబడిన విధానమునందు చేరుటకు వారి కిష్టము లేనట్లు స్పష్టము కాగలదు. న్యూటర్క పండితుడు సమాఖ్యవిషయమున నిట్లు నుడువుచున్నాడు:—

'సమాఖ్య యనగా అనేక స్వతంత్రరాజ్యముల ఎడతెగని కలయిక. ఈకలయిక మొదటఆరాజ్యములుచేసికొనిన యొడంబడికలపై నాధారపడి యుండును. లేదా,

ఒకటేవిధమైన ప్రభుత్వముగలిగిచరిత్రాత్మకముగాసమాన ప్రతిపత్తిగల రాజ్యములసంబంధముపై నది యాధారపడియుండును. రెండవది, ఆరాజ్యములోనిపౌరు లొక సమాఖ్యరాజ్యాంగవిధానము నొప్పుకొనవలెను. సమాఖ్యప్రభుత్వము దానిలో కలసియున్న రాజ్యములమీదనే కాక వానియందలి పౌరులమీద గూడ అధికారము గలిగియుండును. సమాఖ్యలో చేరియున్న రాజ్యముల యాంతరంగిక స్వాతంత్ర్యము, ఇతరదేశములతో స్వతంత్రముగా వ్యవహారములు నడపుటకు గల స్వేచ్ఛ, తగ్గిపోవును. ఇతరదేశములతో వ్యవహరించుటకు సామాన్యముగా సమాఖ్యప్రభుత్వమునకే అధికార ముండును.'

భారతసంస్థానములు తమ వోట్లవలనను, ఇతరమార్గములవలనను భారతశాసనసభాతీర్మానములను, పద్ధతులను మార్పుచేయుటకుమాత్రమే సమాఖ్యలో చేర నిచ్ఛగించి సంస్థానములకు సంబంధించిన వ్యవహారములలో భారతశాసనసభాతీర్మానములకు బాధ్యులు కాకుండ నుండదలచినచో నీప్రభుత్వవిధానము సమాఖ్య యని యెట్లు చెప్పవచ్చును? ఈపద్ధతివలన సంస్థానాధిపతులకు లాభమును బ్రిటిషుపరిపాలితభారతదేశమునకు నష్టమును కలుగు నని వేరుగా చెప్పవలయునా? సమాఖ్యవిధానమునందలి బాగోగుల నన్నిటిని పూర్తిగా తెలిసి



కొని, భారతసంస్థానములు సమాఖ్యలో చేరుచో, వారి సంకల్పమును మనఃపూర్వకముగా నాదరించి వారి హక్కుల నన్నిటిని రక్షించుటకు మాచేతనైన దంతయు చేయగలము. కాని సంస్థానములలో నిప్పుడున్న ప్రభుత్వములు కొంచెమో గొప్పో మారవలసియుండు నని స్పష్టముగా గ్రహింపవలెను. అనుభవమువలన సమాఖ్యపద్ధతియే ఉత్తమపద్ధతి యని గ్రహించి, సంస్థానములు సమాఖ్యపద్ధతియందు నామకః చేరనిశ్చయించునని మేము నమ్ముచున్నాము. కాని ఈమధ్యకాలములో, సంస్థానాధీశ్వరులకును, బ్రిటిషుపరిపాలిత భారతదేశమునకును పరిపాలనవిషయమునందును, ఇతరవిషయములందును వచ్చు తగాదాలను పరిష్కరించుటకు తగిన విధానము నేర్పరుచుట వీలు కాదని మేము తలంపము. సంస్థానాధిపతులకు సంబంధము రాజుగారితోడనా, భారతప్రభుత్వమువారితోడనా యను నిరుపయోగమగు చర్చకంటె ఒడంబడికలవలన సంవాదింపబడిన హక్కులకు భంగము కలుగకుండ చేయుటయు, వా రనుభవించుచున్నట్టియు, కోరుచున్నట్టియు, స్వాతంత్ర్యమునకు భంగము లేకుండ చేయుటయు ఎక్కువ లాభకరము.

పైయుద్దేశముల ననుసరించి మే మీక్రింది సలహాల నిచ్చినాము. (1) సంస్థానాధిపతులు ఈస్టుఇండియా

సలహాలు

సంఘముతో చేసికొనిన యొడంబడికలను ఈస్టుఇండియాసంఘ మెంత మొందిన తరువాత నీచట్టము ప్రారంభమగువరకు నమలులో నున్న యొడంబడికల న్నిటిని భావిభారత ప్రజాస్వామ్య మంగీకరింపవలెను. (2) ఈ శాసననిర్మాణమునకు పూర్వము భారతప్రభుత్వము సంస్థానములయెడల నిర్వర్తించుచుండిన బాధ్యతలనే భావిప్రజాస్వామ్యప్రభుత్వము నిర్వహించుచుండవలెను. ఇవి దంభోక్తులు కావు, కేవలాదర్శములును గావు. ఈషరతులవలన భావిభారత ప్రభుత్వముపైబడు బాధ్యతల నన్నిటిని మేము బాగుగా నెరుంగుదుము. సంస్థానములకును బ్రిటిషుపరిపాలితభారతదేశమునకును సామరస్యమును పెంపొందించు నుద్దేశముతోడనే భావిభారతప్రభుత్వ మీబాధ్యతల నన్నిటిని నిర్వహించు ననియు, సంస్థానములకు ప్రియతమములగు హక్కులకును, అభీష్టములకును భంగము వాటిల్లు నట్లెన్నటికిని ప్రవర్తింప దనియు మా నమ్మకము. ఇట్టులే న్యాయస్థానముచే విచారింపదగిన తగాదాలలో నీక్రింది సూచన గావించినాము. 'సంధిపత్రములు, ఒడంబడికలు, సన్నదులు మొదలగు పత్రములవిషయమున భారతప్రభుత్వమునకును సంస్థానములకును వచ్చువిభేదములలో, కార్యనిర్వాహకసభవారి సలహాను బొందిన గవ



ర్నరు జనరల్‌గారు సంస్థానముల యొప్పందలమీద నా విషయమును సుప్రీముకోర్టునందు విచారణ జరిపించవలెను.' ఇప్పటియట్లు భారతప్రభుత్వము తానొకపార్టీగా నున్నవివాదములో తానే న్యాయాధిపత్యము వహించుటకంటె పక్షపాతరహితమగు ఉన్నతన్యాయస్థాన మొకటి యీవివాదములను పరిష్కరింపదగు నని మే మిచ్చిన సలహా ఉత్తమమైనది. ఈయున్నతన్యాయస్థానమునందలి న్యాయమూర్తులు న్యాయశాస్త్రవిశారదులును, ఉత్తములును, స్వతంత్రులును నై యుందురనియే మేముతలతుము.

న్యాయస్థానముచే పరిష్కరింపరాని, ఆర్థికపరిపాలనసంబంధము లగు వివాదములను సమావేశముల వలనను, సంప్రతింపులవలనను పరిష్కరించుకొనుట సులభసాధ్యమగును. ముం దేర్పడదగు పరిస్థితు లిప్ప డున్నంత యధమముగా నెన్నటికి నుండవు. వివిధసంస్థానములకును సహేతుకమైన వివాదములు కలిగినను, ఆవివాదములను ఎవ్వరికిని నష్టము కానివిధమునను, న్యాయబుద్ధితోడను పరిష్కరించుట కాసంస్థానములుస్వతంత్రముగాప్రయత్నములు సల్పుచుండును గావున నిప్పటికన్న ముందుపరిస్థితులు చాల బాగుపడగలవు. సంస్థానములును బ్రిటిష్ ఇండియాప్రజలును ఒండొరులయెడల సద్భావము గలిగి హిత మాచరించుకొనుచుండుటయును స్వార్థమునువీడి దేశ

హితైకతత్పరు లగుటయును ఎక్కువ లాభకరములు గాని సంస్థానాధిపతుల యధికారాధారములను గూర్చిన నిరర్థక శాస్త్రీయచర్చలు లాభకరములు గావు. దేశరక్షణమునం దికముందు భారతప్రభుత్వమును, సంస్థానములును తప్పక యేకము కావలసివచ్చు నని మాకుస్పష్టమగుచున్నది. ఇంతకుముం దంద రీవిషయమై సమాన బాధ్యతలను వహింపగలిగిరి. ఇద్దరును దేశరక్షణ మొకరి కర్తవ్యము కాదనియు, అందరకును సమానమగుధర్మమనియు గ్రహింపగలిగిరి. ఇదివరకే ఇట్లు జరిగిన నికముందుగూడ నిట్లు జరుగదని నిరాశచెందవలసిన యవసర మేమున్నది?

ఈయభిప్రాయములను తెలియజేయుటలో, సంస్థానాధిపతులప్రతినిధులతో సంప్రతించుభాగ్యము కలుగనందుకు చింతిల్లుచున్నాము. వారితో చర్చించినయెడల కొన్ని సంశయములు తీరియుండెడివి. కాని యిట్లు జరుగలేదు. ఐనను ఇందువిషయమున మా యభిప్రాయములను స్పష్టము చేయవలసియున్నది. సంస్థానములకైనను సరే రాష్ట్రములకైననుసరే యియ్యదగిన స్వాతంత్ర్యమునంతయు నిచ్చి సమాఖ్యలోచేర్చుట యొక్కటే బాధ్యతాయుత ప్రభుత్వమునకు గట్టి పునాదియని మేముతలతుము.



కాని నిరంకుశ మగు కేంద్రప్రభుత్వమే సంస్థానములకును బ్రిటీషుపరిపాలిత భారతదేశమునకును గల బాధ్యతలను చక్కగా నిర్వర్తింపగలుగును గాని, యితరప్రభుత్వ మేదియు నిర్వహింపజాల దను నెపమున, సంస్థానములు సమాఖ్యలో చేరనంతవరకు భారతదేశమునకు బాధ్యతాయుతప్రభుత్వము గాని, అధినివేశప్రతిపత్తి గాని యొసంగ వీలులేదను వాదమును మే మెన్నటికి నొప్పుకొనము. ఇట్టివాదనాపద్ధతివలన భారతసంస్థానములు బ్రిటిషు ఇండియా యభివృద్ధియందు సానుభూతిని నోటిమాటతో దెల్పుచు, మనయాశయములను, అభిప్రాయములను క్రియలో వమ్ముచేయుననుట కేసందియమును లేదు. సంస్థానము లిట్టిమార్గము నవలంబించినచో, తమశ్రేయమును రక్షించుకొనుచు, ఇతరులయభివృద్ధి కాటంకము గలుగకుండజేయు సరసమగు పద్ధతికి మారుగా మన యాశయములయెడలను, అభిప్రాయములయెడలను ప్రతికూలముగా ప్రవర్తించినవా రగుదురు.

ఈ విషయములనుగూర్చి సంప్రతించుటకును, చర్చించుటకును సంస్థానాధీశ్వరులు మాకు అవకాశము గలుగనియ్యకున్నను, సంస్థానప్రజలు అఖిలపక్షసమావేశమువారికి తమయభిప్రాయమునువిన్నవించుటకు ప్రతినిధుల నంపిరి. వారును కడు సమర్థతతో వారి వాదములను

దెల్పిరి. అఖిలపక్షమహాసభవారిచే నియమింపబడిన మొదటియుపసంఘము భారతసంస్థానములవిషయమున నిచ్చినసలహాలను మైసూర్ ప్రజాప్రతినిధిసభలో సభ్యుడగు హొసకొప్ప కృష్ణారావుగారు తీవ్రముగా ఖండించిరి. వీరు 'స్వరాజ్యవిధానము' నొకదానిని కూడ తయారుచేసిరి. మద్రాసులో సమావేశమైన అఖిలభారత సంస్థానప్రజలసభ కృష్ణారావుగారి స్వరాజ్యప్రణాళిక నంగీకరించినది. కృష్ణారావుగారివిమర్శలను వారి స్వరాజ్య విధానమును మేము కడు జాగరూకతతో పరిశీలించి తిమి. కాని పైని చర్చించిన రాజ్యాంగసంబంధములయం దలి సాధకబాధకములవలన బ్రిటిషుపరిపాలిత భారతదేశ మునకును, సంస్థానములకును కలసి యొక్క స్వరాజ్య విధానమును సిఫారసు చేయజాలనందుకు చింతిల్లు చున్నాము.

'భారతసంస్థానములు' అనుపదమువలన వాని లోని ప్రభుత్వవిధాన మేదియో తెలియదు. రాజ్యాంగ సంస్కరణ నివేదికా (మాంటేగ్యూ ఛెమ్సుఫర్డు నివేదిక) నిర్మాతలు సంస్థానముల నిట్లు వర్ణించిరి.

'ఈ సంస్థానములందలి యభివృద్ధి పలుదెరంగు లుగా నున్నది. వీనిలో కొన్ని ఏకచ్ఛత్రాధిపతుల పాల నమున నున్నవి. కొన్ని పాలేగారులయొక్కయు, జాగీర్దా



రులయొక్కయు పరిపాలనమున నున్నవి. కొన్నిటియం దింత కంటె కొంచెము హెచ్చు అభివృద్ధిగానగును. మరికొన్ని సంస్థానములయందు ప్రజాప్రతినిధిప్రభుత్వ మిప్పు డిప్పుడే మొలక లెత్తినది. పురాతనమార్గముల ననుసరించు చున్నను, ఆధునికప్రజాప్రతినిధిప్రభుత్వమును ప్రారంభించి నను, అన్ని సంస్థాములయందును సంస్థానాధిపతికి స్వయం నిర్ణయాధికారము గలదు. శాసననిర్మాణమునందును న్యాయపరిపాలనమునందును అతని కధికారము గలదు.

సంస్థానాధీశ్వరునికి గల స్వయంనిర్ణయాధికారము సంపూర్ణముగా మారనంతవరకు 'భారతసంస్థానము' అనుపదమున కా 'సంస్థానాధిపు' డని యర్థము చెప్పవలెను. కాని యీసంస్థానములలో స్వప్రభుత్వవిధాన మని చెప్పుటకు వీలులేదు. సంస్థానప్రభుత్వప్రతినిధు లగు సంస్థానాధీశుల యంగీకారము లేనిది యీగొప్పమార్పులను సక్రమమార్గ మున చేయుటెట్లు? కృష్ణారావుగా రిట్లు వ్రాయుచున్నారు. 'సంప్రదాయములు, ఆచారములు, అభిమానములు, గాఢమగు రాజభక్తి, తమ సంస్థానముల వ్యక్తిత్వమును కాపాడుకొనవలెనను ఇచ్ఛ, యనునవి సంస్థానప్రజలకు సంస్థానాధీశ్వరులయెడ దృఢమగు ప్రేమానుబంధమును గలుగజేసినవి. కావున వారు బ్రిటిషుపరిపాలితభారత దేశములో లీనమైపోవుటకు కోరుటలేదు; ఐకమత్యముతో

నుండుటకుమాత్రమే యిచ్ఛగించుచున్నారు.' సంప్రదాయములు, ఆచారములు, గాఢమగు రాజభక్తి మొదలగు వానివిషయమున వ్రాసియు కృష్ణారావుగారు సంస్థానాధీశ్వరులకోర్కెల నేమాత్రమును మన్నించుట లేదు. సంస్థానములకు రాజుగారితో గాని, ఆంగ్లపార్లమెంటు సభతో గాని, భారతకార్యదర్శితో గాని, గవర్నరుజనరల్‌తో గాని గలసంధిపత్రములను, ఒడంబడికలను రద్దు చేయవలె నని వారు కోరుచున్నారు. తాము నిర్మించిన రాజ్యాంగవిధాన మాచరణలోనికివచ్చినప్పటినుండియు, ఈ సంధిపత్రము లేవియు నమలులో నుండ నవసరము లేదని వారు నిరాఘాటముగా వ్రాయుచున్నారు. మరియు సంస్థానాధీశ్వరులు తనషరతు లంగీకరించుచో వారిరాజ్యము తగ్గింపబడరా దనియు, ఆంతరంగికస్వాతంత్ర్యమునకు భంగము కలుగరా దనియు, రాజ్యాంగవిధానము మార్చబడరాదనియు, సంస్థానప్రజల ప్రధానహక్కు లన్నియు గారంటీ చేయబడవలె ననియు వారు కోరుచున్నారు. ఈ షరతులను సంస్థానాధీశ్వరు లెప్పుడు నొప్పుకొనలేదు. తానేర్పరచినషరతులను సంస్థానము లొప్పుకొననియెడల పైనిజెప్పిన హక్కులసంరక్షణకు అభయహస్త మొసంగబడ దనియు వారు నిర్వచించుచున్నారు. కాని ఈరక్షణములను గాని, వానికి సంబంధించిన షరతులనుగాని సంస్థానాధీశ్వరు



లొప్పుకొననిచో నేమికావలెనో కృష్ణారావుగారు చెప్పుట లేదు. తన 'షరతులను' సంస్థానములు చెల్లింపనిచో తా నవలంబించు 'అవసరచర్య' యేదో కృష్ణారావుగారు చెప్పలేదు. సంస్థానములయందలి ప్రభుత్వవిధానమును వా రిట్లు వివరించుచున్నారు. "సంస్థానములప్రభుత్వము వంశపరంపరగావచ్చు రాచరికముగానుండవలెను. అనగా సంస్థానాధీశ్వరునివారసులు పరిపాలకులుగా నుండవలెను. ప్రజానియోజితశాసనసభయు, ఆసభకు బాధ్యు లగు కార్యనిర్వాహకసంఘమును ప్రతి సంస్థానాధిపతికి నుండవలెను." కృష్ణారావుగా రీ క్రిందివాక్యముతో తమ స్వరాజ్యవిధానమును ముగించుచున్నారు. "ఈరాజ్యాంగవిధానము ననుసరించి బ్రిటిషుప్రభుత్వమునకును, భారతప్రభుత్వమునకును ఒడంబడిక కుదురనిపక్షమున సంపూర్ణజాతీయస్వాతంత్ర్యము కోరుట కీసమాఖ్యకు సర్వాధికారములుండవలెను. అనగా రాజకీయ,ఆర్థిక,సాంఘికవిషయము లన్నిటియందును, ఆంగ్లదేశముతోగాని, స్వతంత్రజాతులసమూహ మనందగు ఆంగ్లసామ్రాజ్యముతో గాని సంబంధమేమియులేక వ్యవహరించుటకు హక్కుండవలెను. మరియు సంపూర్ణసమాఖ్య ప్రజాస్వామ్యపద్ధతి ననుసరించి (Federal Republic) భావిరాజ్యాంగవిధానమును నిర్మించుట కధికారము గలిగియుండవలెను." ఈ

పరతులయందలి యన్యోన్యవిరుద్ధభావములను దెల్పుట గాని, రాజ్యాంగనిర్మాణసూత్రముల ననుసరించి వీనిని విమర్శించుట గాని యవసరములేదు. పైని దెల్పినకారణములవలన రాజ్యాంగనిర్మాణసూత్రములకు వ్యతిరేకముగా విమర్శించుటకు మే మంగీకరింపలేదు.

ఇంతవరకు భారతప్రభుత్వమునకు సంస్థానములతో నుండవలసినసంబంధములను వివరించుచుంటిమి.

విదేశ రాజ్యములతోడి సంబంధములు

ఇప్పుడు భారతప్రభుత్వమునకు విదేశములతో నుండవలసిన సంబంధములను గూర్చి క్లుప్తముగా చెప్పెదము. కొన్ని అధినివేశరాజ్యములతో పోల్చి చూచినచో ఒకవిధముగా భారతదేశమునందలి స్థితిగతులు విపరీతముగా నున్నవి. భారతదేశమునకు పశ్చిమోత్తర దిక్కునను, ఈశాన్యమునను విశాలమగుసరిహద్దురాష్ట్రములు గలవు. ఈవైపులనున్న విదేశస్వతంత్రరాజ్యములతోడను కొంతవరకు స్వాతంత్ర్యమును గడించిన రాజ్యములతోడను భారతదేశము వ్యవహారము చేయవలసియున్నది. భారతప్రభుత్వవిదేశీయశాఖ విదేశీయకార్యదర్శి యధికారముక్రింద నున్నది. ఈయుద్యోగి గవర్నరు జనరల్‌గారి యాజ్ఞల ననుసరించి వ్యవహరించుచుండును. అతనికి పెక్కుపనులు; పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్ర



ముల నతడు పరిపాలింపవలసి యున్నది. 'ఏజన్సిభూముల'లోని వ్యవహారములను చూడవలసియున్నది. పశ్చిమోత్తరపరగణాయందలి కొండజాతులనాయకులతోడను, ఇతరప్రదేశములయందలి నాయకులతోడను అతడు వ్యవహారము జరుపవలసియున్నది. కొన్నివిషయములలో నతనికి పరిపూర్ణత గల్గు, ఏడెక వరకు అధికారము కలదు. అతనియధికారమునకు లోబడియున్న కొన్నివిషయములు భారతశాసనసభలో చర్చకు వచ్చుచుండును. అప్పు డతడు భారతప్రభుత్వమువారి పద్ధతులను సభవారికి వివరింపవలసి యుండును. సమర్థింపవలసియుండును. సామ్రాజ్యమున కంతటికి సంబంధించినగొప్పవిషయము లిచ్చట నిర్ణయింపబడుట లేదు. అవి యాంగ్లదేశమున నిర్ణయింపబడుచున్నవి. అనేకరాజ్యములు కలసి యొక్కప్రజాస్వామ్యముగా నుండనొప్పుకొన్నప్పుడు, ఆప్రజాస్వామ్యము విచ్ఛిన్నము కాకుండ నుండవలె ననినచో, అధినివేశముల స్వాతంత్ర్యములకు భంగము లేకుండ కొంతవరకైనను విదేశములతోడి సంబంధములయం దొక్కపద్ధతియుండుట యవసరము. అధినివేశములకు సంబంధించినంతవర కీపద్ధతి ఒడంబడికలవలనను, సంప్రతించుటవలనను నిర్ణయింపబడుచున్నది గాని నిరంకుశమగు ఆజ్ఞలవలన గాదు. ఆంగ్లేయసామ్రా

జ్యముయొక్క విదేశీయసంబంధములను నిర్ణయించుటకిటీవల కెనడా, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియాలు కోరుచున్న యధికారములు చాల హెచ్చినవి. ఇందువలన సామ్రాజ్యక్షేమమునకు భంగముకలుగలేదు. విదేశములతోడి సంబంధములయందు సామ్రాజ్యమున కుండవలసిన యేకాభిప్రాయమునకు భంగముకూడ పాటిల్లలేదు.

భారతదేశము నానుకొనియున్న ప్రాచ్యదేశములకును, ప్రభుత్వమునకునుగల యన్యోన్య సంబంధములను, బాధ్యతలను భారతప్రభుత్వమే యిప్పుడు నిజముగా నిర్వహించుచున్నది. అధినివేశప్రతిపత్తిని గడించిన భారతదేశ మీబాధ్యతలు నికముందు గూడ నేల నిర్వహింపరాదో మాకు బోధపడుటలేదు.

విదేశీయసంబంధములనుగూర్చినచర్చ కడు సునిశితమైన దనియు, ఈప్రశ్నలు శాసనసభలో చర్చింపదగినవిగా నుండవనియు మాకు తెలియును. ఈవిషయమున నితరాధినివేశరాజ్యములయందలి శాసనసభలలో ననుసరించుసరసమగు పద్ధతులను భారతశాసనసభకూడ ననుసరింపదగును.

---

# ఆరవ అధ్యాయము

---

ఇంక మేము నిర్మించిన రాజ్యాంగవిధానములోని ముఖ్యాంశములను విచారించెదము. ఈపరతు లధినివేశ

ఇతర సూచనలు

రాజ్యములయందలి రాజ్యాంగవిధానముల ననుసరించి యేర్పరుపబడిన వని యిదివరకే చెప్పియుంటిమి.

మే మేర్పరచు రాజ్యాంగవిధానము సార్వజనిక హక్కులపై నాధారపడి యుండవలె నని మద్రాసు

సార్వజనిక హక్కులు

నందు జరిగిన భారతజాతీయమహాసభా తీర్మానము కోరుచున్నది. ఈవిషయమునకు చాల ప్రాముఖ్య మొసంగబడెను. మరియు మేము పరిశీలించిన రాజ్యాంగవిధానము లన్నిటియందును సార్వజనికహక్కులనిర్వచనము చేయబడినది. కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికాదేశముల రాజ్యాంగవిధానమునందు సార్వజనికహక్కుల నిర్వచనము ప్రత్యేకముగా లేదు. కాని సార్వజనికహక్కు లనంగగిన ప్రాతిపదికసూత్రములు కొన్ని ఐరిష్ఫ్రీస్టేట్ రా

జ్యాంగవిధానమున నున్నవి. ఇందుకు కారణములు స్పష్ట
మే. సంధికిపూర్వము, ఐర్లండు దేశములోని స్థితిగతులు
ప్రస్తుతభారత దేశస్థితిగతులవలెనే యుండెను. తమకు లేని
హక్కులనుసంపాదించుకొనుట భారతీయులప్రధానకర్తవ్య
మని యిప్పుడెంచుచున్నట్లు, ఆసమయమున ఐరిషుప్రజలు
గూడ నెంచి వానినిర్వచనముకై ప్రయత్నించిరి. అధినివేశ
రాజ్యములయందలి స్థితిగతులు వేరు. ఆంగ్లేయులు వెళ్లి
స్థాపించిన వలసరాజ్యములనుండియే అధినివేశరాజ్యము
లభివృద్ధిని జెందినవి. అధినివేశములయందలిన్యాయశాస్త్ర
ముగూడ మొదట ఆంగ్లదేశమునుండి వెడలినవారిచే
గొంపోబడిన దని యూహింపబడుచున్నది. ఆంగ్లదేశము
తో కలసియుండుట కిష్టములేని ఐరిషుప్రజలనాంగ్లేయులు
బలవంతముగా కలుపుకొనిరి. బలవంతముగా పరిపాలించు
చుండిరి. కావునఐర్లండు దేశముమరల అధినివేశస్వాతంత్ర్య
మును బొందుట కాంగ్లదేశముతో సంధిపత్ర మవసర
మయ్యెను. భారతదేశమునందలి స్థితిగతు లించుమించుగా
నిట్టివే యని మేము తలచుచున్నాము. భారతదేశమాంగ్ల
దేశమునకు లోబడియున్న రాజ్యమే. సందేహము లేదు.
ఈస్థితి మారు టెట్లు? రెండు మార్గము లున్నవి. దౌర్జన్య
పద్ధతి యొకటి, ఇద్దరును సమాధానపడి శాంతియుతముగా
వ్యవహారములను పరిష్కరించు టింకొకటి. శాంతియుత



ముగా వ్యవహారములను పరిష్కరించుటకుతగిన రాజ్యాంగ
విధానసూత్రములను నిర్వచించునిమిత్తము మేము
నియమింపబడితిమి. ఇట్లు చేయుటలో, ఎట్టిపరిస్థితులలో
గూడ మన ప్రధానహక్కులకు భిన్నము రానివిధమున
వానిని గారంటీ చేయించుకొనుటయే ప్రథమకర్తవ్యము.
ఈ హక్కులను గారంటీ చేయించుకొనుటకు మన కున్న
కారణములు లేకపోయినను ఐరోపాఖండమునందలియాధు
నికరాజ్యాంగవిధానములలో దాదాపన్నిటియందు ప్రజల
కీహక్కులను సమకూర్పుటకు ప్రత్యేకపరతు లున్నవి.

సార్వజనికహక్కులనిర్వచనముకు ముఖ్యకారణ
మింకొకటిగూడ గలదు. మన దేశములో విషాదకరములగు
మత సాంఘికవైషమ్యములు ప్రబలియున్నవి. ఒకరియెడల
నింకొకరికున్న అవిశ్వాసములు, అనుమానములు తొలగి,
సామరస్య మేర్పడవలె ననిన కొన్ని రక్షణములును,
గారంటీలును అవసర మగుచున్నవి. దేశములో నన్ని
మతములవారును, అన్నిసంఘములవారును తమతమ
హక్కులను సంపూర్ణముగా ననుభవింపవలసినచో,
రాజ్యాంగవిధానమునకు 'మూలకందము లగు సార్వజనిక
హక్కులలో వీని నిముడ్చుటకన్న ప్రశస్తమగుపద్ధతి మరి
యొకటి లేదు.

మేము నిర్వచించిన సార్వజనికహక్కులను తిలకించినచో నీపై రెండుకారణములను మనమునం దిడుకొంటిమని స్పష్టము కాగలదు.

అఖిలపక్షమహాసభవా రేర్పచిన మొదటి సంఘమువా రీవిషయమున జాగరూకతతో విచారించిరి.

కవులుదార్ల భూమిహక్కులు

చాలమట్టునకు వారు నిర్ణయించిననిబంధనలనే మేముగూడ నొప్పుకొంటిమి. కార్మిక, కర్షకజనముయొక్క హక్కులను స్పష్టము చేయుచు మొదటిసంఘమువారు చేసిన నిబంధన నొకదానిని, సార్వజనిక హక్కులలో ప్రత్యేక సలహాగా మేము పొందుపరచితిమి. కాని 'న్యాయమగు కవులును నిర్ణయించుటకును, కవులుదారులకు భూమిపై స్థిరత్వ మేర్పరచుటకును భారతపార్లమెంటుసభవారు చట్టములు చేయవలెను' అని మొదటిసంఘమువారు చేసిననిబంధనను మాసలహాలో నిముడ్చలేదు. ఈ నిబంధనను వదలి వేయుటలో మాయుద్దేశము భూమిపై కౌలుదార్లకు స్థిరమైన హక్కుండ నవసరము లేదని కాదు. వారిహక్కులను స్థిరపరచుట యవసరమే. కాని ఈనిబంధన నంగీకరించి సార్వజనికహక్కులలో చేర్చినచో రహితులహక్కులను రక్షించుటకు మారుగా నది వారి భావియభివృద్ధి నాటంకపరుచును. భారతదేశములో చాలభాగముల



యందు భూమిని కౌలున కిచ్చు పద్ధతులు తృప్తికరముగా లేవు. వానిని సంపూర్ణముగా మార్చివేయుట యవసరము. కౌలుదార్లకు స్థిరత్వ మేమియు లేకపోవుటవలన వారికి పెక్కిబ్బందులు గలుగుచున్నవి. వారి కేమాత్రము స్థిరత్వ మేర్పరచినను ప్రస్తుతదుర్భరస్థితి చాలమట్టునకు తగ్గి వారి ప్రాణములకు హాయి చిక్కును. కాని తాత్కాలికలాభమున కాశించినయెడల నికముందు కౌలుదారుల హక్కులకు తీరనిభంగము కలుగజేసినవార మగుదుము. ఇట్లు చేయుట వివేకము కాదు. ప్రస్తుతస్థితిగతులే అమలులో నున్నంతవరకు కౌలుదారులహక్కులను రక్షించుటకు 'ప్రతికార్మికునకు జీవనభృతి సమకూర్చుటకు భారత పార్లమెంటుసభ తగినచట్టములను చేయవలెను' అని సార్వజనికహక్కులలో మే మేర్పరచినపరతు చాలును.

బాటలు, బావులు మొదలగువాని నుపయోగించుటకు హక్కు

రాచబాటలను, బావులను, ప్రజ లందరును చేరదగిన స్థలములను ఉపయోగించుకొనుటకు పౌరులందరకు సమాన మగు హక్కు గల దని సార్వజనిక హక్కులలో నొకనిబంధన చేర్చితిమి. ఈవిషయమును గూడ నిర్వచింపవలెనా యని కొందరు తలపవచ్చును. కాని దేశమునందలి విపరీతస్థితిగతులనుబట్టియు, ఆచారవ్యవహారములనుబట్టియు నిట్టి నిబంధ

నకు ప్రాముఖ్యము నిచ్చుట వాంఛనీయ మని తలచు చున్నాము.

ఇంక కొన్ని నిబంధనలలో కొన్ని మార్పులు చేసితిమి. కలుపవలసినచోట్ల కొన్ని వాక్యములను కలిపితిమి.

పాఠశాలలో వర్ణ భేదము లేదు.

నిర్బంధప్రాథమికవిద్యను బడయుట కందరకును సమానహక్కులు గలవని నిర్వచించునిబంధనలో జాతివర్ణవివక్షలుండరా దని యొకవాక్యము కలిపితిమి. అది యిట్లున్నది. 'ప్రభుత్వమువారిచే నిర్వహింపబడు పాఠశాలల యందును, ప్రభుత్వసాహాయ్యమును బొందుచున్న పాఠశాలలయందును పిల్లలను చేర్చుకొనుటకు జాతివర్ణవివక్షలుండరాదు.

* హేబియస్ కార్పస్ పత్రము

హేబియస్ కార్పస్ పత్రమునకు గల హక్కును గూర్చిననిబంధనలో 'యుద్ధసమయమున గాని, విప్లవ సమయమున గాని భారతశాసనసభ సమావేశము కానిరోజులలో, భారత ప్రజాస్వామ్య కార్యనిర్వాహకవర్గము

* ప్రభుత్వాధికారు లెవరినైనను చెరసాలలో వేసినచో, చెరసాలలో పెట్టబడినవారి బంధువులు అందుకు కారణములను దెల్పవలసిన దని కోరుదురు. ప్రభుత్వమువారు కారణములను వివరించుచు నొకపత్రమునియ్యవలెను. ఆపత్రముపేరు హేబియస్ కార్పస్ పత్రము.



వారు హేబియస్కార్పస్పత్రము నడుగుటకు ప్రజలకుగల హక్కును తాత్కాలికముగా రద్దుపరచి, శాసనసభ సమావేశముకాగానే, సదరు కార్యనిర్వాహకవర్గము వారు తగుచర్యకై ఆ విషయమును శాసనసభవారికి నివేదింపవలెను' అనునిబంధనను కలిపితిమి.

సిక్కులపక్షమున సర్దార్ మంగళసింగుగారికోర్కె ననుసరించి సార్వజనికహక్కులలో సిక్కు లెల్లప్పుడును

కృపాణములు

కృపాణములను ధరింపవచ్చు నని యొప్పుకొనుచు నొకనిబంధన చేసితిమి.

భారతదేశమున కంతటికిని శాసనములు చేయుటకు 'సెనేట్', 'ప్రజాప్రతినిధిసభ' అను రెండుసభ లుండవలెను. రాష్ట్రములలోమాత్ర మొక్కసభ యుండిన చాలును.

శాసనసభ

సెనేటుసభలో 200 సభ్యు లుండవలెను. ప్రజాప్రతినిధిసభలో 500 మంది సభ్యు లుండవలెను. అవసర మైనయెడల నీ సంఖ్యను జనాభా ననుసరించి అన్ని రాష్ట్రములయందును, అన్ని సంఘములయందును ఒకటేపద్ధతి ననుసరించి హెచ్చించుకొనవచ్చును. రాష్ట్రములలో లక్షజనాభాకొకసభ్యుడుండవలె నను నియమ మవసరము కాని కోటికరాటు

సభ్యులసంఖ్య

తక్కువజనాభాగల రాష్ట్రములయందు మొత్తముసభ్యుల సంఖ్య 100 గా నుండవచ్చును.

ప్రజాప్రతినిధిసభకును, రాష్ట్రీయ శాసనసభలకును ఎన్నికదారులు సాధ్యమైనంత హెచ్చుగానుండునట్లు చేయవలెనని మా యుద్దేశము. మాలో కొందరము మైనారటీ వెళ్లినవా రందరకు ఎన్నికాధికార ముండవలెనని యభిప్రాయపడితిమి. కొందరు ప్రజ లందరకు నెన్నికాధికార మిచ్చుట యాశయముగా నుండదగినను ప్రథమమున దానిని ప్రవేశపెట్టుటవలన పెక్కుబ్బందులు కలుగు నని తలచిరి. మే మనేకసూచనలనుగూర్చి యాలోచించితిమి. వానిలో మైనారటీ వెళ్లినవారి కందరకు వోటింగు అధికార ముండవలె ననుసూచన గాక యీక్రిందిసూచన లుండెను.

ఎన్నికాధికారము

I మైనారటీ వెళ్లినవా రందరకు నెన్నికాధికార ముండవలెను గాని, ఎన్నికలలో పాల్గొనదలచినవా రందరిపేర్లను రిజస్టరు చేయించుకొనవలెను.

II ఇప్పుడు ఎన్నికాధికారము కలిగినవారు దేశములో 60 లక్షలుమాత్రమే గలరు. ఈ యధికారమును 6 కోట్లప్రజల కియ్యవలెను. ఏపద్ధతిమీద నింతమంది కెన్ని



కాధికారము కలుగునో నిర్ణయించుటకొకయుపసంఘము నేర్పాటుచేయవలెను.

III ఈక్రిందివానిలో నేదైనను సరే.

ఈక్రిందివానిలో నేదైనను సరే

౧. నిర్ణీతమగు సిస్తుగాని, మక్తాగాని, ఇంటిబాడుగగాని, ఇంటిపన్ను మొదలగువానినిగాని, యిచ్చెడివారికి ఎన్నికాధికార ముండవలెను.

౨. చదువను వ్రాయను నేర్చినవారందరకు అధికార ముండవలెను.

3. కాయకష్టముచేసిగాని, మానసికకష్టము చేసిగాని బ్రదుకువారందరకు నెన్నికాధికారము ఉండవలెను.

౪. నిరుద్యోగులుగా ప్రభుత్వమువారి పుస్తకములలో నమోదు చేయబడినవా రందరకు అధికారము ఉండవలెను.

౫. అవిభక్తకుటుంబములలో చేరినవా రందరకును అధికారము ఉండవలెను.

౬. ఎన్నికదారుల భార్యలకు అధికారము ఉండవలెను.

పై నుదాహరింపబడినసూచనలలో మూడవదానినవలంబించినయెడల మైనారటీ వెళ్లినవారందరకు ఎన్ని

కాధికారమిచ్చినయెడల నెంతమందియెన్నికదారు లేర్పడుదురో అంతమందియెన్నికదారులేర్పడుదురు. మాలోకొందరము రెండవసూచన నభిమానించితిమి. దీనినవలంబించిన యెడల ఎన్నికాధికారము 6 కోట్ల ప్రజలకు గలుగును. కావున ప్రజలందరకు వోటింగుఅధికారమిచ్చుటకిదియొక సోపానముగా నుండును. మైనారటీ వెళ్లినవా రందరకు వోటింగుఅధికారమిచ్చినయెడల 12 కోట్లప్రజల కధికారముండును. మేమనుసరించు రెండవపద్ధతివలన నీసంఖ్యలో సగముమందికి అధికారముగలిగినను ప్రజలు చాల అభివృద్ధినొందినవా రగుదురు. కాని యీసూచన నంగీకరించుటకు కొన్నియిబ్బందులుగలవు. ప్రస్తుతసమయమున వివిధసంఘములయందలి యెన్నికదారుల తారతమ్యము వారివారి జనాభాయందలితారతమ్యముననుసరించియుండలేదు. పాంచాలమునందలిస్థితిగతులను విచారింతము. హిందూసిక్కుసంఘముల జనాభాకంటె పాంచాలమున మహమ్మదీయులు హెచ్చుగా నున్నారు కాని వారివోట్లు మాత్రము హిందూసిక్కువోట్లకన్న చాల తక్కువగా నున్నవి. హిందువులు మహమ్మదీయులకంటె సంపన్నులగుటయేదీనికికారణము. ఈయవకతవకల నంత మొందించి జనాభాననుసరించి, వోటర్లసంఖ్యనునిర్ణయించుట ప్రశస్తమగు పద్ధతి. మైనారటీవెళ్లినవారి కందరకు ఎన్నికాధి



కార మిచ్చితిమేని వివిధసంఘముల జనసంఖ్యనుబట్టి వారి వోట్లసంఖ్య వానియంతట నవియే నిర్ణయింపబడును.

ఇం కేసంకుచితపద్ధతి నవలంబించినను ఇట్లుజరుగ నేరదు. అప్పుడు వివిధసంఘములకు వివిధములగుయోగ్యతలను నిర్ణయింపవలసియుండును. వివిధ మతసంఘములకు ప్రాతినిధ్యమేర్పరుచు పద్ధతులలో గూడ తేడా లుండును. కొంతమంది కిది కష్టముగానుండును. ఈసాధక బాధకముల నన్నిటిని విచారించి మైనారటీ వెళ్లినవా రందరకు ఎన్నికాధికారము ఉండవలె నని నిర్ణయించితిమి. సింహళద్వీప రాజ్యాంగమును నిర్ణయించుట కేర్పరుపబడినసంఘము గూడ దీనినే సిఫారసు చేసెను. ప్రజలందరకు వోటింగు అధికారము ఉండవలెనుగాని, 30 సంవత్సరములుదాటిన స్త్రీలకుమాత్రమే యెన్నికాధికారము ఉండవలెనని వారు సలహా నిచ్చిరి. దీనికి కారణము 'వోట్లువిపరీతముగాపెరిగిపోకుండ చేయుటయే' అనివారు చెప్పుచున్నారు. వోట్లు పెరిగిపోకుండచేయుట కవసరమేమియు మాకు కనబడదు. ప్రజాప్రతినిధిప్రభుత్వములో వోటర్ల యెన్నికాధికారము నిట్లు కృత్రిమముగా నియమించుట ప్రజాపరిపాలనకే యనవసరముగా నాటంకములు గలుగజేయుట యగును. ప్రజాసామాన్యమందరకు ఎన్నికాధికార మిచ్చినయెడల ఎన్నికలను కొనసాగించుట కష్టసాధ్య మని చెప్పిన చెప్ప

వచ్చును. ఐనను మనమేర్పరుపదలచినది నిజమైన ప్రజా ప్రతినిధిప్రభుత్వమైనయెడల నెట్టియిబ్బందులు వచ్చినను నెదుర్కొనవలెను. సింహళద్వీపరాజ్యాంగ విధానమును నిర్ణయించుట కేర్పరుపబడినసంఘము క్రొత్త ప్రభుత్వ విధానము నొకదాని నేర్పరచుటకు సలహా నొసంగెను. ప్రపంచములో నెచ్చటను దీనికి సామ్యము గానుపింపదు. ఇది యెట్టిప్రభుత్వవిధాన మైనను ప్రజాప్రతినిధిప్రభుత్వ మనిమాత్రము చెప్పుటకు వీలులేదు. భారతదేశమునకు ప్రజాప్రతినిధిప్రభుత్వము నేర్పరుచుటయే మాకర్తవ్యము. కావున పురుషులకు లేనియాటంకమును స్త్రీలకు కల్పించుట మాయభిప్రాయము కాదు.

ప్రస్తుతము పాంచాలమున శిరోమణిగురుద్వార ప్రబంధకకమిటీవారి యెన్నికలన్నియు సార్వజనికవోటింగు విధానముమీదనే యాధారపడి యున్నవి. కొద్దిలో నివి జయప్రదముగానే కొనసాగుచున్నవి. దేశములోనొకభాగ మునజరుగుచున్నపద్ధతిని, దేశమునందంతటవ్యాపింపజేయుటకు కార్యనిర్వాహకులసంఖ్యను హెచ్చించుటతప్పమరేమియు నవసరములేదు. దీనికి ద్రవ్యము హెచ్చుగా వినియోగింపవలసియుండును. కష్టపడవలసియుండును. ఐనను ఇందంతయు అనవసరవ్యయ మని తలచుటకు కారణ



ములు లేవు. ప్రజాప్రతినిధిప్రభుత్వమునకు గట్టిపునాదులు వేయు మహాకార్యమున ద్రవ్యమునకు లోపించుటయు, కష్టములకు వెరచుటయు వివేకము కాదు.

ప్రజాసామాన్యమునకు విద్య లేదనియు, రాజకీయానుభవము శూన్య మనియు కొందరు చెప్పు నభ్యంతరములను మేము పాటింపము. ఇప్పుడుకూడ వ్రాయుటయు చదువుటయు నేర్చినవారిసంఖ్య కడు స్వల్పముగానే యున్నది. ఇప్పుడు ఎన్నికలలో పాల్గొనుచున్న వారివిషయమున గూడ నీయభ్యంతరములు వర్తించును. ఎన్నికాధికారమును మన మెంత నియమించినను అత్యధిక సంఖ్యాకులగు వోటర్లు విద్యలేనివారే యైయుందురు. కొంతద్రవ్యమును సంపాదించువానికి రాజకీయములలో పాల్గొనుట కవకాశ మిచ్చి, అంతకంటె కొంచెము తక్కువసంపాదించువాని కియ్యకపోవుట యెట్టిన్యాయము? రాజకీయములలో పాల్గొనుచుండుటవలననే రాజకీయానుభవము గలుగును గాని, కేవలము విద్య నేర్చుకొనుట వలన కలుగదు. ఈ రాజకీయానుభవమును సంపాదించుటకు ప్రతివానికిని సమాన మగునవకాశము లుండవలెను. ప్రపంచములో నభివృద్ధియందున్న రాజ్యము లేవియు, ప్రజ లందరును విద్యావంతు లైనప్పుడే వారికి ఎన్నికాధి

కార మియ్యవలె నని కనిపట్టుకొనియుండలేదు. భారత దేశముమాత్ర మెందుకు కనిపట్టుకొనియుండవలెను?

సెనేట్

సెనేట్ సభ్యులు రాష్ట్రీయ శాసనసభలనుండి యెన్నుకొనబడవలెను. జనాభా ననుసరించి ప్రతిరాష్ట్రము నకు కనీస మిన్నిస్థానము లుండవలె నని నిర్ణయము చేయవలెను.

అఖిలపక్షసమావేశమువారిచే నియమింపబడిన మొదటిసంఘములోనిసభ్యులలో అధికసంఖ్యాకులు సెనేట్ సభకు సంకుచిత మగు నెన్నికపద్ధతిని సూచించిరి. అల్పసంఖ్యాకులు మే మిచ్చిన సలహా నామోదించిరి. ఈసభకు సభ్యుల నెన్నుకొనుటకు రెండుపద్ధతులు గలవు. ప్రజాప్రతినిధిసభవలె ఎన్నికదారులే స్వయముగా తమ సభకు ప్రతినిధుల నెన్నుకొనుట యొకటి. ప్రజాప్రతినిధి సభకు సభ్యుల నెన్నుకొనుపద్ధతిని సంకుచితపరచి కొలదిమందివోటర్లకుమాత్రమే యధికార మిచ్చుట రెండవది. వీనిలో మొదటిపద్ధతి నవలంబించితిమేని ప్రజా ప్రతినిధిసభవంటిసభ మరియొకటి యేర్పడును. ఇది యవసరము లేదు. రెండవపద్ధతివలన ప్రత్యేకముగా కొందరకుమాత్రమే యెన్నికాధికార ముండుటవలన ప్రతిష్టంభనములును తగాదాలును కలుగుట కవకాశము లుండును. ప్రత్యేకసంఘప్రతినిధులతో గూడియున్నట్టియు



అభివృద్ధి నాటంకపెట్టెడివారితో నిండియున్నట్టియు సభ యవసరము లేదు. తమతమహక్కులను రక్షించుకొనవలె ననియు, అభివృద్ధిని నిరోధింపవలె ననియు వారు ప్రయత్నించుచుందురు. రాజ్యాంగములో రెండవశాసనసభ యుండుటవలన ప్రయోజన మేమి? వివాదాంశములు చర్చకువచ్చినప్పుడు ప్రజాప్రతినిధిసభ సావకాశముగాను, నిష్పక్షపాతబుద్ధితోడను విచారింపనివిషయములను హెచ్చు శాంతముగాను, సమానభావముతోడను పునర్విమర్శించు ననియేకదా! సాంఘికవైషమ్యములు ప్రబలియున్న భారతదేశమున సమభావముతో విమర్శించెడి రెండవ సభ యుండుట యత్యంతావసరమై యున్నది. సెనేటు సభకు గూడ సభ్యులను వోటరులే స్వయముగా నెన్నుకొనునట్లు చేసినయెడల ప్రజాప్రతినిధిసభవంటిదే యింకొకసభ యేర్పడును. లేదా స్వశ్రేయమును మాత్రమే రక్షించుకొనదలచినవారితో గూడినసభ యేర్పడును వా రెల్లప్పుడు నభివృద్ధిని నిరోధించుచుందురు. రాష్ట్రీయ శాసనసభలే సెనేటుసభకు ప్రతినిధుల నెన్నుకొనవలె నని మేము చేసినసూచనలో నిట్టియిబ్బంది లేదు. ఈ నియోజకవర్గమున మిక్కిలి బుద్ధికుశలు లగువారే యుందు రని యూహింపవలసి యున్నది. కనుక, సెనేటు సభలో సభ్యత్వము వహించుటకు తగినవారే యెన్ను

కొనబడుట కవకాశము లుండును. ఈపద్ధతివలన నెన్ను కొనబడువారు, ప్రస్తుతప్రజాప్రతినిధిప్రభుత్వములలోని యెన్నికలయందు పాల్గొను అసంఖ్యాకులగు నెన్నికదారులకేకలకును, గందరగోళమునకును విముఖు లగు వారై యుందురు. వారినియోజకవర్గము విశాల మైనది కాకపోయినను హోదామీదగాని, స్వశ్రేయముమీద గాని, సంఘాధిక్యముమీద గాని యాధారపడి యుండదు. దేశమునందలి యసంఖ్యాకులగు నెన్నికదారులయభిప్రాయమును తెల్పుననికూడ యూహింపవలసి యున్నది. సెనేటుసభకు జరుగునెన్నికలు దామాషాపద్ధతిప్రాతినిధ్యముపై నాధారపడియుండినయెడల, అల్పజనసంఖ్యాక సంఘములును, ప్రత్యేకరక్షణకు తగియున్నయితరులును ప్రాతినిధ్యమును బొందుటకు హెచ్చు అవకాశము లుండును. మే మీపద్ధతినే యభిమానించెదము.

ఈ సూచన నంగీకరించినయెడల మరియొకలాభము గలదు. భారతశాసనసభయందలిసభ్యులు స్వయముగా వివిధరాష్ట్రములలోని యెన్నికదారులవలన నెన్నుకొనబడినవారై యుందురు. సెనేటుసభలో రాష్ట్రీయదృక్పథములు వ్యక్త మగుచుండును. రాష్ట్రీయశాసనసభలకును, భారతశాసనసభకును అన్యోన్యసంబంధమును కలుగజేసి



రాజ్యాంగవిధానమును చక్కగా నడపవలె ననిన నీ పద్ధతి యత్యంతము కోరదగినది.

ప్రతిరాష్ట్రమునకు కొన్నిస్థానములు జనాభా ననుసరించి నిర్ణయింపబడవలె ననియు, రాష్ట్రమున కుండవలసిన కనీసప్రాతినిధ్యము నిర్ణయింపబడవలె ననియు, మేము సలహా నిచ్చితిమి. కాని కనీసమెన్నిస్థానము లుండవలెనో మేము నిర్ణయింపలేదు. సభ్యత్వస్థానములను సాధారణముగా జనాభా ననుసరించియే నిర్ణయింపవలె నని మా యుద్దేశము. కాని ప్రతిరాష్ట్రమునకును జనాభాననుసరించి సభ్యత్వములను నిర్ణయించినయెడల చిన్నరాష్ట్రములకు చాల తక్కువసభ్యు లెన్నుకొనబడెదరు. కావున ఒక్క జనాభానుమాత్రమే అనుసరించి సెనేటుసభకు స్థానములను నిర్ణయింపరాదు. అమెరికాయందలి సంయుక్తరాష్ట్రములలో కలసియున్న దేశము లన్నియు, జనభాహెచ్చుతగ్గులను పాటింపక సమానముగానే సభ్యుల నమెరికా సెనేట్ సభకుపంపుచున్నవి. మన దేశమునందు రాష్ట్రముల జనసంఖ్యలో చాల భేదము లున్నవి. కనుక అమెరికాయందువలె సమానముగా సభ్యులనునిర్ణయించుట యంత వాంఛనీయముకాదు. ఐనను సెనేటుసభయందలి వివిధ రాష్ట్రములప్రాతినిధ్యమునకు విపరీతమైన భేదము లుండరాదు.

**కాల నిర్ణయము**

ప్రజాప్రతినిధిసభ 5 సంవత్సరములవరకును, సెనేటుసభ 7 సంవత్సరములవరకును శాసనాధికారము గలిగి యుండవలె నని మేము సూచింతిమి.

**అధికార విభజన**

అఖిలపక్ష సభవారిచేత నియమింపబడిన మొదటి సంఘమువారి సలహాలనే చాలమట్టునకు మేమవలంబించితిమి. కాని వానికి కొన్ని కలిపితిమి. పలుమార్పులుగూడ చేసితిమి. ఒక్క శాఖలో భారతప్రభుత్వమునకును, రాష్ట్రీయప్రభుత్వమునకును, రెంటికినధికారము లేకుండ జేసితిమి. రెంటికి నధికారము లుండుటవలన విభేదములు గలుగును. కావున రాష్ట్రీయప్రభుత్వాధికారములకును, భారతప్రభుత్వాధికారములకును అన్యోన్యసంఘర్షణ కలుగకుండ శాఖల నేర్పరచితిమి.

శాసనసభలను గూర్చిన యితరషరతులు అధినివేశ రాజ్యములయందలి చట్టముల ననుసరించి నిర్ణయింపబడి యున్నవి. ఆర్థికచట్టములనుగూర్చి విచారించునధికారము ప్రజాప్రతినిధిసభకు మాత్రమే యొసంగితిమి.

ప్రధానామాత్యుడును, ఆగ్గురికి మించని మంత్రి వర్గమును భారతప్రజాస్వామ్యము యొక్క కార్యనిర్వా



**కార్యనిర్వాహక వర్గము**

హకవర్గముగా నుండవలె నని మేము సలహానిచ్చితిమి. వివిధసంఘములకును ప్రాతినిధ్య మిచ్చుటకై యీమంత్రుల సంఖ్యను హెచ్చింపవలె నని బహుశః కొందరు తలంచ వచ్చును. కాని మే మిట్లు హెచ్చించుట కొప్పుకొనము. రాష్ట్రీయస్వపరిపాలనము నేర్పరచుచున్నాము గావున కేంద్రకార్యనిర్వాహకవర్గమున నేడ్గురుమంత్రులు చాలు నని మేము తలచుచున్నాము. ఈకార్యనిర్వాహకు లందరును సమష్టిగా శాసనసభకు బాధ్యులుగా నుందురు.

ప్రధానామాత్యుడును, నల్గురు మంత్రులును కలసి రాష్ట్రములయందు కార్యనిర్వాహకులుగా నుందురు.

భారతప్రజాస్వామ్య కార్యనిర్వాహకుల యొక్కయు, రాష్ట్రీయకార్యనిర్వాహకవర్గముయొక్కయు అధికారములు అధినివేశరాజ్యములయందలి కార్యనిర్వాహకవర్గములయొక్క అధికారములను బోలియున్నవి.

**న్యాయస్థానములు**

ప్రస్తుత మున్నప్రధానన్యాయస్థానములు గాక, సుప్రీముకోర్టు (Supreme Court) నిర్మింపబడవలె నని మేము సలహా నిచ్చితిమి. మేము నిర్ణయించిన సందర్భములయందు తప్ప సాధారణముగా భారతదేశమున నుండి అప్పీళ్లేవియు రాజుగారిన్యాయస్థానమునకుగొంపోబడరాదు.

ఈసుప్రీమ్‌కోర్టునకు మే మొసంగిన 'ఒరిజినల్' అధికారములను పాఠకులు గమనింపదగియున్నది. వీనిలో చాలముఖ్యమైనవానినిమాత్ర మిచ్చట చేర్కొనెదము. భారత ప్రజాస్వామ్యమునకును సంస్థానములకును సంధిపత్రములు, ఒడంబడికలు, సన్నదులు మొదలగువానియందు వచ్చువివాదములను కక్షిదారులగు సంస్థానములవారియొప్పుదలపై కార్యనిర్వాహకవర్గముయొక్క సలహాను బొందిన గవర్నరు జనరల్‌గా రీసుప్రీమ్‌కోర్టునకు పంపవచ్చును.

**సుప్రీమ్‌కోర్టు**

దేశమున వసూలయ్యెడి పన్నులను భారత ప్రభుత్వమునకును, రాష్ట్రీయప్రభుత్వములకును విభజించుట, దేశరక్షణము, విద్య మొదలగు ముఖ్యవిషయములకు కావలసినద్రవ్యమును నిర్ణయించుట, చాల కష్టతరములైన సమస్యలు. వానిని చాల జాగ్రత్తగా నిర్ణయింపవలెను.

**ఆర్థికవిషయములు**

ప్రజాస్వామ్యము స్థాపింపగానే యీక్రిందివిషయములను విచారించుట కొకవిచారణసంఘము నేర్పాటు చేయవలెనని మేము సలహా నిచ్చితిమి.

**విచారణసంఘము**

(1) ప్రజాస్వామ్యమునకును, రాష్ట్రములకును నిర్ణయింపవలసిన పన్నుల నెట్లు సమకూర్పవలెను?



(2) భారతప్రభుత్వమునకును రాష్ట్రీయప్రభుత్వములకును ఉండవలసిన ఆర్థికసంబంధము లేవి?

ఈసలహా నిచ్చుటలో మేము దక్షిణాఫ్రికాయూనియన్‌యొక్క రాజ్యాంగవిధానమునందలి 118-వ సెక్షను మనపరిస్థితులకు తగి యున్న దని తలచి యనుసరించితిమి.

ఈవిచారణసంఘముపై మేము మరియొక కర్తవ్యమునుగూడ బెట్టితిమి.

i. అది యేదన సేనకును, నావికాదళమునకును, వైమానికదళమునకు నవసరమైనయుద్యోగులశిక్షణమునకు సంబంధించినవిషయముల నన్నిటిని విచారించుటకును, ఈశిక్షణకళాశాలల నేర్పరుచుటకును ప్రత్యేకమైన ఉపసంఘము నొకదానిని నేర్పరచుట.

**ఉద్యోగుల శిక్షణ**

ii. సామాన్యప్రాథమికవిద్యను ప్రవేశపెట్టుటను గూర్చియు, వెనుకబడియున్న జాతుల కొసంగవలసిన ప్రత్యేకవిద్యాసౌకర్యములను గూర్చియు, విచారించి నివేదించుటకు మరియొక యుపసంఘము నేర్పాటుచేయుట.

**ప్రాథమికవిద్య- వెనుకబడియున్న వారివిద్య**

iii. దాని కవసర మని తోచిన యితరోపసంఘముల నేర్పాటు చేయుట.

ఆయాశాస్త్రములయందు ప్రవీణు లగువారితో కూడినయీయాయుపసంఘములసాయము లేనిది మే మేర్పరుచుటకు సిఫారసు చేసినవిచారణసంఘము సమగ్ర మైన నివేదికను నిర్మింపజాల దని మా యభిప్రాయము.

ప్రజాస్వామ్యము స్థాపింపబడినవెంటనే ప్రభుత్వోద్యోగములనుగూర్చి విచారించుట కొకసంఘమును నియమింపవలె నని మేము సలహా నిచ్చితిమి.

ప్రభుత్వోద్యోగములు

ప్రస్తుతప్రభుత్వశాఖ లన్నియు, ప్రజాస్వామ్యస్థాపనానంతరము సంపూర్ణ మగుమార్పును జెందవలసి యున్నవి. క్రొత్తపద్ధతులమీద నిర్మింపబడవలసి యున్నవి. ప్రస్తుతపరిపాలన తలబరువు పరిపాలన యనియు, దేశప్రజలు దుర్భరదారిద్ర్యము ననుభవించుచున్నను ప్రభుత్వోద్యోగులు ప్రపంచమునం దన్ని దేశములకంటెను హెచ్చుగా జీతముల ననుభవించుచున్నా రనుట జగద్విదితము. దేశరక్షణమునకు, విద్యాభివృద్ధికి, పారిశ్రామికాభివృద్ధికి, ఆరోగ్యాభివృద్ధికి ధనము వెచ్చించుట మనప్రధానకర్తవ్యము. కావున సివిల్ ఉద్యోగులకును, మిలిటరీ ఉద్యోగులకును విపరీతములైన జీతముల నిచ్చి భరింపజాలము. ఉద్యోగులకొర కత్యధికముగా మనము వెచ్చించుచున్న ధనమును దేశాభివృద్ధికై వినియోగించుకొనవలసి యున్నది. మనయుద్యోగుల



జీతములు చాలా హెచ్చుగా నున్నవనియు, వానిని తగ్గించుట యవసరమనియు నోరుగలవా రందరును మొఱపెట్టుచుండిరి. మనప్రజలు మొరపెట్టగా పెట్టగా "లీసంఘ" మేర్పాటు గావింపబడెను. భారతీయు లేకగ్రీవముగా సంఘనిర్మాణము నడ్డుపెట్టినను, ఈసంఘము నియమింపబడెను. భారతశాసనసభాతీర్మానమునకు వ్యతిరేకముగా లీసంఘమువారిసిఫారసులను ప్రభుత్వమువా రంగీకరించిరి. కావున నూతనరాజ్యాంగవిధానమున నేర్పడుస్థితిగతుల ననుసరించి, ఎవరిని ఉద్యోగములలో నియమింపవలెను? ఏపద్ధతుల ననుసరించి వారిని నియమింపవలెను? వారి కెంత జీత మియ్యవలెను? ఎంత అలవెన్సుల నియ్యవలెను? ఈ మొదలగువిషయములను సమగ్రముగా పునర్విమర్శించుట యవసర మని మాయుద్దేశము. ఈవిచారణకొఱకు ఉద్యోగములవిచారణా సంఘమును(Pudlie service commission) నియమింపవలె నని సలహా నిచ్చితిమి. ఈ ఉద్యోగులవిషయమున తగుమార్పులు చేసినతరువాత సదరువిచారణసంఘమున కధికారము లేమియు నుండవు. ఉద్యోగులవిషయమున మార్పులు చేసినను, ప్రజాస్వామ్యము స్థాపింపబడునప్పుడు ఉద్యోగములలో నున్న వారికి తగుగారంటీ లేర్పరచితిమి. ఉద్యోగములం దుండ దలచినవారికిని, ఉద్యోగములను వదలుకొని పోవువారికిని

గూడ తగుగారంటీలు మే మేర్పరచితిమి. ప్రజాస్వామ్యస్థాపనసమయమున ఉద్యోగములను వీడి పోవువారికి వర్తించుషరతులు, మూడుసంవత్సరములవరకు ఉద్యోగులకు వర్తించునట్లు చేసితిమి. ఈమూడుసంవత్సరములలో వారెప్పు డుద్యోగములను మానుకొని పోదలంచినను, ప్రజాస్వామ్యస్థాపనసమయమున మానుకొనువారి కొసంగు నుపకారవేతనములు మున్నగుసౌకర్యముల నన్నిటిని పొందగలరు.

సైనికోద్యోగులు

సేనలోను, నావికాదళములోను, రాయల్ ఇండియన్ మెరైన్‌లోను, (నౌకావ్యాపారదళోద్యోగులు) వైమానికదళములోను నూతనరాజ్యాంగవిధానప్రారంభమున ఉద్యోగమునం దున్న వారికినిగూడ నిట్టి సౌకర్యములనే యొసంగితిమి.

ఈక్రిందియుద్యోగులతో కూడిన దేశరక్షకసంఘము నొకదానిని నిర్మింపవలె నని సలహా నిచ్చితిమి.

దేశరక్షణము

(1) ప్రధానామాత్యుడు

(2) దేశరక్షణమును చేయుమంత్రి

(3) విదేశీయవ్యవహారములను చూచుమంత్రి



(4) సర్వసేనాధిపతి

(5) వైమానికదళనాయకుడు

(6) నావికాదళాధిపతి

(7) సామాన్యోద్యోగ శాఖాప్రధాని

(8-9) ఇద్దరు యోధప్రవీణులు

దేశరక్షణవిషయమున ప్రభుత్వమువారు సామాన్యముగా ననుసరింపవలసినపద్ధతులనుగూర్చి సలహా నిచ్చుటయు, దేశమున కపాయము గలుగకుండ ప్రస్తుతపు వ్యయములో నెంత తగ్గింపవచ్చునో, వేనిలో తగ్గింపవచ్చునో సూచించుటయు, నీసంఘముయొక్క కర్తవ్యములు. ఈసంఘమువారి సిఫారసుమీదనే సాంవత్సరిక వ్యయముగూడ నిర్ణయింపబడవలెను. ఈపద్ధతుల ననుసరించితిమేని సేనలు దేశరక్షణ మొనరించుటకు తగిన సామర్థ్యములు గలిగియుండుటయే కాక, సేనాపరిపాలనయు చక్కగా జరుగును.

ఇతర సలహాలు వివరముగా నేడవయధ్యాయమున బొందుపరుపబడినవి.

---

# ఏడవ అధ్యాయము

---

## సలహాలు

శాసనసభయందు ప్రతిపాదించుట కుద్దేశింపబడిన బిల్లురూపమున ఈరాజ్యాంగవిధానమును వ్రాయుటకు మేము ప్రయత్నింపలేదు. ఐనను మా సలహాలు వాని నైజము ననుసరించి సామాన్యపుచిత్తుబిల్లులయందలి షరతులను బోలియేయున్నవి. వానిని బిల్లునందలిషరతులుగా భావింపవలె నని మాయుద్దేశము గాదు. వానిలో నిమిడి యున్న సూత్రములను ప్రతిపాదించుచున్నట్లుమాత్రమే గ్రహింపదగును. రాజ్యాంగసూత్రములనునిర్ణయించుటకు మాత్రమే మమ్ముల నఖిలపక్షమహాసభవారు నియమించిరి. ఈ సూత్రములను చట్టరూపమున వ్రాయుటయు, సూత్రార్థప్రతిపాదకములగు షరతులను కలుపుటయు, మేము వదలిపెట్టినవివరములనుచేర్చుటయు, చట్టమును వ్రాయుటయందు కుశలులగువారు చేయవలసిన పనియై యున్నది. రాజ్యాంగవిధానము నమలులో నుంచుటకు ట్రాన్సుఫరు ఆర్డరులను, (Transfer Orders) కౌన్సిల్ ఆర్డరులను, (Council orders) ఏర్పాటుచేయుట యుక్తమని మాకు నివేదింపబడిన కొన్నిచిత్తువిధానములు తెల్పుచున్నవి. ఇవి చాల ముఖ్యమే కాని యీయేర్పాటులన్నియు నీ రాజ్యాంగసూత్రములను శాసనముగా వ్రాయునతడు చేయదగును. కొన్నివిషయములను మేము చాల వివరముగా వ్రాసితిమి. కొన్నిటి నంత వివరముగా వ్రాయలేదు. ఇది బుద్ధిపూర్వకము కాదు. మేము అధినివేశరాజ్యముల రాజ్యాంగవిధానములను, డాక్టరు బెసెంటుగారి కామన్ వెల్తు ఆఫ్ ఇండియా బిల్లును (Common wealth of India Bill), శ్రీమాన్ విజయరాఘవాచారిగారు, శ్రీమాన్ శ్రీనివాస అయ్యంగారు, శ్రీమాన్ రంగస్వామిఅయ్యంగారులు తయారు చేసిన రాజ్యాంగవిధానములను, ఇండిపెండెంటు లేబర్ పార్టీవారేర్పరచినసంఘము తయారు చేసినవిధానమును, భారత ప్రభుత్వ శాసనమును, (Government of India Act) పరిశీలించి, వానిలో మనకు తగిన యంశముల నీ రాజ్యాంగ విధానమునందు పొందుపరచితిమి. అనేక స్థలములయందు పదములను మార్చుటమాత్రమే యవసర మయ్యెను. కొన్నిసందర్భములయందు ముఖ్యమైనమార్పులు చేయవలసివచ్చెను. అఖిలపక్ష సభవారేర్పరచిన మొదటిసంఘమువారు నిర్ణయించిన [illegible]

శబ్దనిర్వచనమును, అవతారికను కూడ మేము వదలివేసి తిమి. మాసలహాల నీక్రింద పొందుపరచుచున్నాము.

భారతదేశము అధినివేశములతో సమానముగా నుండవలెను.

(1) ఆంగ్లసామ్రాజ్యమనం దగు వివిధజాతుల సముదాయమునందు అధినివేశరాజ్యము లగు కెనడా, (డొమినియన్) ఆస్ట్రేలియా, (కామన్ వెల్తు) న్యూజీలాండు (డొమినియన్) దక్షిణ-ఆఫ్రికా (యూనియన్) ఐరిష్ ఫ్రీస్టేటులతోపాటు భారతదేశమునకును సమాన ప్రతిపత్తి యుండవలెను. భారతదేశముయొక్క శాంతి సౌఖ్యములకును, క్రమపద్ధతికిని, సుపరిపాలనమునకును అవసరములగు శాసనములను జేయునధికారము గలిగిన పార్లమెంటుసభయును, ఆ పార్లమెంటుసభకు బాధ్యులైన కార్యనిర్వాహకవర్గమును ఉండవలెను; మరియు నీ దేశము భారతప్రజాస్వామ్యము (Common wealth of India) అని వ్యవహరింపబడవలెను.

రాజ్యాంగవిధానముయొక్కయు శాసనములయొక్కయు వ్యాప్తి

(2) ఈశాసనమును, ఈశాసనము ననుసరించి ప్రజాస్వామ్యప్రభుత్వమువారిచే జేయబడు నితర శాసనములను, న్యాయస్థానములు, వివిధరాష్ట్రప్రజలు, ప్రజాస్వామ్యమునందలి ప్రతిభాగమును విధిగా నంగీకరింపవలెను. బ్రిటిషు ఇండియాకు వర్తించునట్లు భారతశాసనసభవారు చేసినశాసనములయందును, రాష్ట్రీయశాసనసభాశాసనములయందును, ఆంగ్లపార్లమెంటుసభాశాసనములయందును ఎట్లు విధింపబడి యున్నప్పటికిని అవి యీశాసనములను బాధింపవు. ప్రజాస్వామ్యశాసనములు హిందూదేశ సముద్రభాగములయందు వర్తించును.



పౌరశబ్దనిర్వచనము

(3) ఈరాజ్యాంగవిధానమునందు ప్రయోగింపబడిన పౌరశబ్దమున కీక్రిందివిధముగా నర్థము చెప్పవలెను.

౧. భారతప్రజాస్వామ్యముయొక్క సరిహద్దులలో పుట్టినవాడుగాని, ప్రజాస్వామ్యముయొక్క సరిహద్దులలో పుట్టినట్టి, లేదా అన్యదేశీయుడై ప్రజాస్వామ్య పౌరహక్కుల సంపాదించినట్టివానికుమారుడు గాని, ఏ యితరదేశమునందు పౌరసత్వపుహక్కులు లేనివాడైనయెడల పౌరుడుగా పరిగణింపబడును.

౨. తాత్కాలికముగ నమలులో నున్నశాసనము ననుసరించి ప్రజాస్వామ్యపౌరహక్కులను సంపాదించినవాడు పౌరుడుగా పరిగణింపబడును.

వివరము: అన్యదేశములయందలిపౌరు లెవ్వరును ఆ దేశములయందలిపౌరసత్వపుహక్కులను న్యాయశాస్త్ర

నిర్ణీతపద్ధతిని విసర్జించినం దప్ప భారతప్రజాస్వామ్యము యొక్క పౌరులు కాజాలరు.

### సార్వజనికహక్కులు

(4) ౧. ప్రభుత్వమువారియధికారము లన్నియు, మరియు శాసనాధికారము, కార్యనిర్వహణాధికారము, న్యాయాధికారము ప్రజలనుండియే పొందబడినవి. ఈ యధికారము లన్నియు నీరాజ్యాంగవిధానమువలన గాని దాని ననుసరించి కాని యేర్పరుపబడబోవు ప్రతిష్ఠాపనలమూలకముగా చెలాయింపబడవలయును.

౨. న్యాయసమ్మత మగువిధమున తప్ప నెవ్వరి స్వేచ్ఛకును భంగము కలుగజేయరాదు. ఇండ్లలోను, ఆస్తులలోను ప్రవేశింపరాదు. ఖామందుయొక్క భూమిని గాని, ఆస్తిని గాని, వశపరచుకొన రాదు, జప్తుచేయరాదు.

౩. ప్రజాశాంతికి భంగమును, నీతికి విరుద్ధమును కానివిధమున ఎవరి ఆత్మసాక్షిగా వారు ప్రవర్తించుటకును, ఎవరి కిష్టము వచ్చినమతమును వా రవలంబించుటకును ప్రతివానికిని హక్కు గలదు.

౪. ప్రజాశాంతికి భంగమును, నీతికి విరుద్ధమును కానివిధమున ఎవరియభిప్రాయమును వారు నిర్భయముగా ప్రకటించుటకును, యుద్ధపరికరము లేవియు లేకుండ



శాంతియుతముగా నొక్కచో జేరుటకును, ప్రజాసంఘముల నేర్పరుచుటకును ప్రతివానికిని హక్కు గలదు.

౫. ప్రజాస్వామ్యమునందలి పౌరుల కందరకును ఉచితప్రారంభవిద్యను బడయుటకు హక్కు గలదు. ప్రభుత్వమువారిచే నిర్వహింపబడునట్టి కాని ప్రభుత్వమువారిసాయమును బడయుచున్నట్టి కాని విద్యాలయము లన్నిటిలోను మత వర్ణ వివక్ష లేమియు లేక విద్యార్థులు చేర్చుకొనబడవలెను. ఈ విషయమున అధికారమొసంగబడినవారు తగినయేర్పాటులు చేయగానే యీ హక్కులు అమలులో పెట్టబడును.

౬. న్యాయశాస్త్రరీత్యా పౌరు లందరును సమానులే. అందరకును సమానములగు పౌరసత్వపుహక్కు లుండును.

౭. ఒకపౌరునికిని ఇంకొకపౌరునికిని భేదములను కల్పించుశిక్షాస్మృతు లేవియు నుండరాదు. శిక్షాస్మృతులను అమలులో నుంచునట్టివిధానముకూడ నందరకును సమానముగానే యుండవలెను.

౮. ఏపని చేయబడినసమయమున దానికి న్యాయశాస్త్రరీత్యా శిక్ష లేదో, అట్టిపనుల కెవ్వరిని శిక్షింపరాదు.

౯. దెబ్బలు కొట్టుట గాని, ఇతరహింసాత్మకమైన దండనములు గాని న్యాయసమ్మతములు గావు.

౧౦. ప్రతిపౌరుడును హేబియస్‌కార్పస్‌పత్రము నడుగుటకు హక్కు గలిగియున్నాడు. యుద్ధసమయమున గాని, ప్రజలు తిరుగబడినప్పుడు గాని, భారతశాసనసభ వారి చట్టముద్వారా నిట్టిహక్కు తాత్కాలికముగా రద్దుచేయబడవచ్చును. శాసనసభాసమావేశ మప్పుడు జరుగకపోయినయెడల గవర్నరుజనరలుగారే యీయధికారమును తాత్కాలికముగా రద్దుచేసి, శాసనసభసమావేశ మైనతరువాత సాధ్య మైనంతత్వరలో నీవిషయమున శాసనసభవారు తగుచర్య జరుపుటకు నివేదింపవలెను.

౧౧. భారతప్రజాస్వామ్యమున కభిమానమత మొక్కటి యుండరాదు. ప్రజాస్వామ్యములో నేరాష్ట్రమునకు గూడ నిట్టి యభిమానమత ముండరాదు. ప్రభుత్వమువారు ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని, యేమతము ననుసరించెడివారికినిగూడ ద్రవ్యసాహాయ్యము చేయరాదు. ఒకమతమునందు నమ్మకము గలవారి నాదరించుట గాని, యింకొకమతమునందు నమ్మకము గలవారిని నిరాదరించుట గాని ప్రజాస్వామ్యప్రభుత్వమునకు పనికిరాదు.

౧౨. ప్రభుత్వసాహాయ్యమును బడయుచున్నట్టి కాని ఇతరప్రజాద్రవ్యమువలన నడపబడుచున్నట్టి కా



పాఠశాలలకు వెళ్లుబాలురను, పాఠశాలలోని మతబోధచేసెడి తరగతులకు వెళ్లవలె నని నిర్బంధింపరాదు.

౧౩. జాతి మత వర్ణవిభేదములవలన, ప్రభుత్వోద్యోగములయందుగాని, అధికారము గలపదవులయందు గాని, గౌరవములయందు గాని యెవరియెడలను పక్షపాతము వహింపరాదు. వారివారి వృత్తులకును, వ్యాపారములకును ఆటంకములు గలిగింపరాదు.

౧౪. ప్రభుత్వమువారి రోడ్లమీద నడచుటకును, బావులలో నీరు త్రాగుటకును, ప్రజలు సమావేశ మగు నితరస్థలములయందు ప్రవేశించుటకును పౌరు లందరకును సమానహక్కు గలదు.

౧౫. కార్మికులస్థితిగతులను అభివృద్ధి చేయుటకును, దేశముయొక్క ఆర్థికసంపత్తిని వృద్ధిచేయుటకును, సంఘములను సమితులను స్థాపించుటకును ప్రతివ్యక్తికిని, ప్రతివృత్తికినిగలహక్కులు గారంటీచేయబడినవి. ఈస్వేచ్ఛను తగ్గించునట్టియు, ఆటంకపెట్టునట్టియు, ఒడంబడికలు, పనులు న్యాయవిరుద్ధములు.

౧౬. నౌకరీ సంబంధము లైనకాంట్రాక్టులను విచ్ఛిన్నము చేయుటగాని, విచ్ఛిన్నముచేయుటకు ప్రోత్సహించుటగాని నేరముగా పరిగణింపబడరాదు.

౧౨. పౌరులందరు నారోగ్యముగా నుండుటకును, పనిచేయుటకు తగినదార్ఢ్యము గలవారుగా నుండుటకును, అవసరమగు శాసనములను భారతపార్లమెంటు చేయవలెను. మరియు కార్మికుల కందరకు జీవనభృతిలభించుటకును, గర్భిణుల, ప్రసూతలరక్షణమునకును, బాలుర యోగక్షేమములకును, వార్ధక్య, దౌర్బల్య, నిరుద్యోగములవలన గలిగినదారిద్ర్యమును నివారించుటకును తగిన చట్టములను చేయవలెను.

౧౩. ప్రతిపౌరునకు, ఆయుధములు నుంచుకొనుటకును, ధరించుటకును (ఇందు విషయమున చేయబడు నిబంధనల ననుసరించి) హక్కు గలదు.

౧౪. స్త్రీలకును, పురుషులకును పౌరసత్వపు హక్కులు సమానములు.

వివరము: పైన వివరించిన నాగ్గవసూత్రమునందు వ్యతిరేకముగా నేమియున్నను, సిక్కులు కృపాణములను ధరించుటకు హక్కు గలిగియున్నారు.

పార్లమెంటు

(5) ప్రజాస్వామ్యము యొక్క శాసనాధికారము భారతపార్లమెంటువారికుండును. రాజు, సెనేటుసభ, ప్రజాప్రతినిధిసభ కలసి భారతపార్లమెంటు అని పిలువబడును.



(6) గవర్నరుజనరలు రాజుగారిచే నియమింపబడును. మరియు, ప్రజాస్వామ్యమునందు రాజుగారి చిత్తము వచ్చినంతకాలము శ్రీవారు తమపేర చెలాయింపవలసిన దని నిర్ణయించినయధికారములను గవర్నరుజనరలు చెలాయింపవచ్చును. కాని యీయధికారములన్నియు నీరాజ్యాంగవిధానమునకు లోబడి యుండవలెను.

(7) ౧. గవర్నరుజనరలుజీతమునిమిత్తము భారతదేశముయొక్క ఆదాయమునుండి సంవత్సరమునకు... మొత్తము రాజుగారికి చెల్లింపవలెను. భారతపార్లమెంటుసభవా రింకొకవిధమున నిర్ణయించునంతవరకు, ఈ మొత్తము నివేదికకడపట నున్న సెడ్యూలు ననుసరించి యుండవలెను.

౨. గవర్నరుజనరలుయొక్క ఉద్యోగకాలములో నీజీతము మార్చబడరాదు.

(8) సెనేటుసభలో రాష్ట్రీయశాసనసభలచే నెన్నుకొనబడుసభ్యులు 200 మంది యుందురు. జనాభా ననుసరించి, యింతకంటె తక్కువసభ్య లుండరా దని ప్రతిరాష్ట్రమునకు కొన్నిసభ్యత్వస్థానములను నిర్ణయింపవలెను. సింగిలుట్రాన్సుఫర్ బిల్ వోటుతో గూడిన దామాషాపద్ధతిప్రాతినిధ్యము ననుసరించి ఎన్నికలు జరుగవలెను. (హేర్ విధానము)

(9) న్యాయశాస్త్రరీత్యా నిర్ధారణ చేయబడు నియోజకవర్గములచే నెన్నుకొనబడినసభ్యులు 500 ప్రజాప్రతినిధిసభలో నుందురు. 21 సంవత్సరములు వయస్సుగల స్త్రీపురుషు లందరును, శాసనమువలన నిషేధింపబడిన తప్ప ఎన్నికలలో పాల్గొనుట కధికారము కలిగి యుందురు.

అవసరమైనయెడల శాసనసభ అప్పుడప్పుడీసభ్యులసంఖ్యను హెచ్చింపవచ్చును.

(10) ౧. ఒకపర్యాయ మెన్నుకొనబడినప్రజాప్రతినిధిసభ ప్రథమసమావేశమునుండి 5 సంవత్సరములవరకును, సెనేటుసభ 7 సంవత్సరములవరకు నమలులో నుండును.

ఐనను—

(క) ఈరెండుశాసనసభలను గవర్నరుజనరలుగారు గడువునకుపూర్వమే రద్దు చేయవచ్చును.

(చ) విపరీతపరిస్థితులయందతని కవసరమని తోచినయెడల నింకను కొంతకాలము శాసనాధికారమియ్యవచ్చును.

(ట) ఏశాసనసభనైనను గవర్నరుజనరలు రద్దుచేసినయెడల, రద్దు చేసినప్పటినుండి ఆరునెలలకు మించ



కుండ శాసనసభ మరల సమావేశమగుతారీఖు నతడు నిర్ణయింపవలెను.

౨. ఈరెండుసభలలో నేదానినైనను సమావేశపరచుస్థలములను గాని, సమయములను గాని, గవర్నరుజనరలుగారు తనకు ఉచితమని తోచినవిధముగా నిర్ణయింపవచ్చును. తాఖీదువలన గాని, ఇంకొకవిధమున గాని, శాసనసభలను రద్దు చేయుటకుగూడ నతని కధికారము గలదు.

3. ఈరెండుసభలలో నేద్దానికైనను తత్సభాధ్యక్షుడు వాయిదా వేయవచ్చును.

౪. సభలో హాజరైనసభ్యులలో అధ్యక్షుడు తప్ప మిగిలినసభ్యులలో నధికసంఖ్యాకులవోట్లవలననన్ని సమస్యలును పరిష్కరింపబడవలెను. ఇరుపక్షములకును సమానముగా వోట్లు లభించినయెడల అధ్యక్షుడు వోటు నిచ్చి సమస్యను పరిష్కరింపవలెను.

౫. శాసనసభలలో సభ్యత్వస్థానములు కొన్ని ఖాళీగా నున్నను, సభలయధికారము లన్నియు చెలాయింపబడవచ్చును.

(11) ప్రజాప్రతినిధిసభ కొకయధ్యక్షుడును, సెనేటుసభ కొకయధ్యక్షుడు నుందురు. వీరాయాసభలో

సభ్యులుగా నుండి, సభవారిచే నెన్నుకొనబడుదురు. ప్రతి సభకు ఉపాధ్యక్షుడుగూడ ఒక డుండును. అతడును ఈ విధముగానే ఎన్నుకొనబడును.

(12) సెనేటు, ప్రజాప్రతినిధిసభ లనుభవింపవలసినట్టియు, చెలాయింపవలసినట్టియు హక్కులును, ప్రత్యేక సౌకర్యములును, అధికారములను ప్రజాస్వామ్యము యొక్క పార్లమెంటువారిచే నప్పుడప్పుడు నిర్ణయింపబడినవిగా నుండవలెను.

(13) ఈ రాజ్యాంగవిధానమునందలి షరతులకు లోబడి, భారతపార్లమెంటుసభ యీక్రిందివిషయములను గూర్చి శాసనములుచేయుట కధికారము గలిగియుండును.

౧. రాష్ట్రీయ శాసనసభలయధికారమునకు లోబడి యున్నవని యీశాసనము నిర్వచించిన విషయముల యందు తప్ప తక్కినయన్నివిషయములయందును, ప్రజాస్వామ్యముయొక్క శాంతిసౌఖ్యములకును, ప్రజలక్రమపద్ధతికిని పరిపాలనమునకును శాసనములను జేయుట.

౨. భారతదేశమునందు ప్రజాస్వామ్యాధికారమునందు లేనియితరభాగములయందును విదేశములయందును వసించుప్రజాస్వామ్య పౌరులకును సేవకులకును శాసనములు చేయుట.



3. రాజుగారి సేనాదళములలో నధికారమును వహించినవారికిని, పదాతులకును, వైమానికులకును, ఇతర పరిజనమునకును,—వా రెచ్చట నుద్యోగము చేయుచున్నను సరే—శాసనములు చేయుట సైనికచట్టమునకును, వైమానికచట్టమునకును లోబడి యుండనివారికే ప్రజాస్వామ్యశాసనములు వర్తించును.

౪. భారతనౌకావ్యాపారదళములోను, భారతయుద్ధనౌకాదళములోను గల ఉద్యోగులకును, నౌకరులకును శాసనములు చేయుట.

భారతపార్లమెంటుసభవారికి ఏయేవిషయముల యం దధికారము కలదో యింతకంటె స్పష్టముగా వివరించుటకై, ఆయావిషయములను సమగ్రముగా మొదటి షెడ్యూలులో పొందుపరచితిమి. ఈసెక్షనునందలి పైషరతులను సంకుచితపరచకుండ (ఈచట్టములో వ్యతిరేకముగా నేమియున్నను సరే) మొదటిషెడ్యూలునందలి విషయము లన్నిటియందును భారతపార్లమెంటుసభ కధికారము గల దని తెలిసికొనదగదు.

(14) విదేశీయవ్యవహారములయందు అధినివేశరాజ్యములకు గలయధికారము లన్నియు భారతపార్లమెంటుసభవారికిగూడ నుండును.

(15) ఈచట్టము ననుసరించి చేయబడునిబంధనలలో, సభాకార్యక్రమమును జరుపుటకును, సభలో గందరగోళము లేకుండ నుంచుటకును, అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు లేనిసమయమున ప్రజాప్రతినిధిసభకు అధ్యక్షుని నియమించుటకును ఏర్పాటులు చేయబడవచ్చును. మరియు సభ జరుగుట కవసర మగుసభ్యులను నిర్ణయించుటనుగూర్చియు, ప్రశ్నలనియమనిషేధములనుగూర్చియు, చర్చను సక్రమముగా జరిపించుటనుగూర్చియు నిబంధనలు చేయబడవచ్చును.

(16) ౧. ప్రజాస్వామ్యప్రభుత్వముయొక్క సామాన్యసాంవత్సరికఖర్చులకు పన్నును గాని, ద్రవ్యమును గాని స్వీకరించుచట్టము అట్టిస్వీకారములను గురించిమాత్రమే తెల్పవలెను.

౨. పన్నులను విధించుచట్టములు ఒక్కపన్నులను వేయుటనుగురించిమాత్రమే వివరింపవలెను. ఇతర విషయములనుగురించి వివరించుపరతు లున్నయెడల వానికి ప్రయోజన మేమియు నుండదు.

3. ప్రజాస్వామ్యప్రభుత్వముయొక్కఋణమును గూర్చి కాని, పన్నులను, ద్రవ్యమును, స్వీకరించుటనుగూర్చి కాని, హెచ్చుపన్నును విధించుటను గూర్చి



గాని వివరించుచట్టములు కార్యనిర్వాహకవర్గమునందలి సభ్యునిచే ప్రతిపాదింపబడవలెను. ప్రజాప్రతినిధిసభయందే యిట్టిచట్టము ఉత్పత్తికావలెను.

(17) అర్థికచట్ట మనగా నీక్రిందివిషయములలో నన్నిటినిగురించి కాని, కొన్నిటినిమాత్రమేగురించి కాని వివరించుచట్టము. అవి యే వన:—

పన్నులను విధించుట, రద్దుచేయుట, ముదరా యిచ్చుట,మార్చుట,ఎక్కువతక్కువలను నియమించుట; ఋణములను తీర్చుటకు కాని యితర ఆర్థికబాధ్యతలను నిర్వహించుటకు గాని, ప్రజ లిచ్చు పన్నులో గాని, ద్రవ్యములో గాని కొంతభాగమును వినియోగించుట, వినియోగించుటయం దెక్కువతక్కువలను నియమించుట, అసలే వినియోగింపకుండుట; ప్రజాద్రవ్యమును ఇతరుల కిచ్చుట, తనకై వినియోగించుకొనుట,పుచ్చుకొనుట, భద్రముగా నుంచుట, నాణెములను పోత పోయుట, లెక్కలను తనిఖీచేయుట; ఋణమును పుచ్చుకొనుట, దానిని తీర్చుట; ఈ విషయములలో నంతర్గత మయిన వానిని గాని, ఏదానిలో నంతర్భాగ మయినవిషయమును గాని ఆర్థికచట్టము వివరింపవచ్చును. ఈ నిర్వచనమునందు పన్నులు అనుపదమునకు స్థానికాధికారులు విధించిన

పన్ను లని యర్థము కాదు. 'ప్రజాద్రవ్య' మనగా స్థానిక సంస్థలవలన స్థానికోపయోగములకై సేకరింపబడినధన మని కాదు. 'ఋణము' అనగా స్థానికాధికారులు స్థానిక ప్రయోజనములకై పుచ్చుకొనినఋణ మని కాదు.

(18) ఒకబిల్లు ఆర్థికబి ల్లైనది లేనిది ప్రజాప్రతినిధిసభాధ్యక్షుడు నిర్ణయించును.

(19) ప్రజాప్రతినిధిసభయం దామోదింపబడిన ఆర్థికబిల్లు సెనేటుసభకు వారి సలహాలకై పంపబడవలెను. **మరియు** ఈబిల్లు సెనేటుసభనుండి........ రోజులకు మించకుండ మరల ప్రజాప్రతినిధిసభకు పంపబడవలెను. ప్రజాప్రతినిధిసభవారు సెనేటుసలహాల నొప్పుకొని కాని, నిరాకరించి కాని, కొన్నిటి నొప్పుకొని కొన్నిటిని నిరాకరించి కాని, బిల్లు నామోదింపవచ్చును. ఇట్లామోదింపబడినబిల్లు రెండుసభలయందును ఆమోదింపబడినదిగా తలంపబడును.

(20) ౧. ఈచట్టముయొక్క షరతులకు లోబడి, ఒకబిల్లు ఏశాసనసభయందైనను ఉత్పత్తి కావచ్చును. ఉత్పత్తి యైనసభయం దామోదింపబడినచో నది రెండవ శాసనసభయందు ప్రతిపాదింపబడవలెను.



౨. ఈచట్టమునం దింకొకవిధముగా చెప్పిన తప్ప సవరణలు లేకుండ కాని రెండుసభలును ఒప్పుకొనగలిగిన సవరణలతోమాత్రమే కాని, ఒకబిల్లు రెండుశాసనసభలచే నామోదింపబడిన గాని శాసనముగా చేయబడినట్లు ఎంచబడదు.

౩. ప్రజాప్రతినిధిసభయం దొప్పుకొనబడినచట్ట మారుమాసములలోగా సవరణలు లేకుండ గాని, రెండుసభలు ఒప్పుకొనగలిగిన సవరణలతో గాని, సెనేటుసభలో నొప్పుకొనబడకపోయినయెడల, రెండుసభల ప్రతినిధులును కలసి సంప్రతించి పరిష్కరింపవలె నని యేసభలోనైనను తీర్మాన మామోదింపబడినచో, దీనిని పరిష్కరించుటకు రాజప్రతినిధి రెండుసభలసంయుక్తసమావేశము నేర్పాటు చేయవలెను. రెండుసభలప్రతినిధులు సమావేశమైనయిట్టిసభలో నున్న సభ్యులు, ప్రజాప్రతినిధిసభవారు రచనచేసి సూచించినబిల్లును, ఆ బిల్లునకు సెనేటుసభలో చేయబడినసవరణలను, ఆ సవరణలను మరల నీసభవారు నిరాకరించుట మొదలగువానిని గూర్చి విచారించి వోటు చేయవలెను. ఆసమావేశములో హాజరయినమొత్తముసభ్యులలో హెచ్చువోట్ల వలన నంగీకరింపబడినసవరణలు రెండుసభలచే నంగీకరింపబడినట్లు తెలంపవలెను.

(21) ౧. ఒకబిల్లు రెండుశాసనసభ లామోదించినతరువాత గాని, లేదా ఆమోదించినట్లు తలచినతరువాత గాని, రాజుగారిసమ్మతిని రాజుగారిపేర తెల్పుటకు బిల్లును గవర్నరుజనరలుగారికి నివేదింపవలెను. గవర్నరుజనరలుగారు బిల్లున కంగీకారము తెల్పవచ్చును, తెల్పకపోవచ్చును, లేదా రాజుగారిచిత్తము వచ్చినట్లు చేయుట కాపి యుంచవచ్చును.

౨. రాజుగారిపేర గవర్నరుజనరలు, రెండుశాసనసభ లామోదించినబిల్లున కంగీకారము దెల్పునంతవరకు, బిల్లు చట్టము కాజాలదు. రాజుగారు స్వయముగా తమయంగీకారమును దెల్పుట కాపి యుంచినబిల్లుల విషయమున, రాజుగారిప్రసంగమువలన గాని, శాసనసభలకు సందేశపూర్వకముగా కాని, ప్రకటనపూర్వకముగా గాని తనయంగీకారమును దెల్పునంతవరకు బిల్లు శాసనము కాజాలదు.

రెండుశాసనసభలు ఆమోదించి రాజుగారిపేర ననుమతించుటకు గవర్నరుజనరలుగారికి నివేదించినట్టియు, రాజుగారియామోదమునకై గవర్నరుజనరలాపి యుంచినట్టిబిల్లును, మరల కొన్నిసవరణల నాలోచింపవలసిన దని సిఫారసు చేయుచు, గవర్నరుజనరలుగారు మరల శాసనసభలకు పంపవచ్చును.



3. గవర్నరుజనరలుగారు సూచించిన సవరణలతో మరల పంపబడినబిల్లును సభవారు మరల చర్చించి, సవరణలతో గాని, సవరణలు లేకుండ గాని మరల నామోదింపబడినబిల్లును, రాజుగారిపేర ననుమతించుటకు రెండవసారి గవర్నరుజనరలుగారికి నివేదింపవచ్చును.

### ప్రజాస్వామ్య కార్యనిర్వాహక వర్గము

(22) ప్రజస్వామ్యముయొక్క కార్యనిర్వహణాధికారము రాజుగారియధీనమై యున్నది. మరియు రాజుగారిప్రతినిధి యగుగవర్నరుజనరలుగారు కార్యనిర్వాహకసభయొక్క సలహాతో, (ఈ చట్టమునందలి షరతులకును, ప్రజాస్వామ్యముయొక్క శాసనములకు లోబడి) ఈ యధికారమును చలాయించును.

(23) ౧. పార్లమెంటుసభ యింకొకవిధమున నిర్ణయించువరకును ప్రధానామాత్యుడును, ఆర్గురుమంత్రులతో కూడినకార్యనిర్వాహకసభయు నుండవలెను.

౨. ప్రధానామాత్యుడు గవర్నరుజనరలుగారిచే నియమింపబడును. ఆర్గురు ప్రధానులుగూడ ప్రధానామాత్యునిసలహా ననుసరించి గవర్నరుజనరలుగారిచే నియమింపబడుదురు.

3. కార్యనిర్వాహకసంఘమువారి యధికారము నకు లోబడియున్న అన్నివిషయములయందును కార్య నిర్వాహకసంఘసభ్యు లందరును సమష్టిగా శాసనసభకు బాధ్యు లగుదురు.

(24) భారతపార్లమెంటు ఇంకొకవిధమున నిర్ణ యించునంతవరకు, ఇతరభారతప్రభుత్వోద్యోగులను నియమించుటకును, తొలగించుటకును,(ఈయధికారమును గవర్నరుజనరలు గాని ప్రజాస్వామ్యచట్టములు గాని యింకొకరియధీనము చేసిన తప్ప) కార్యనిర్వాహకవర్గము యొక్క సలహాను బొందిన గవర్నరుజనరలుగారి కధి కార ముండును.

(25) సేన, నౌకాదళము, వైమానికదళముల యొక్క సర్వసేనాధిపత్యము రాజప్రతినిధి యగుగవర్నరు జనరలుగారియందే యుండును.

హైకమిషనర్ - విదేశములలో రాయబారులు

(26) కెనడా మున్నగు దేశములయం దున్నట్లే హైకమిషనరును, విదేశములలో భారత దేశప్రతినిధులను, నియమించెడియధికారము ప్రజాస్వామ్యమున కుండవ లెను. ఈయుద్యోగులను గవర్నరుజనరలే నియమింప వలెను. వారిజీతము, అధికారములు, విధులు, ఉద్యోగ



నియమములు మున్నగువానిని గూడ అతడే నిర్ణయించి నిబంధనలను చేయవలెను.

ఆర్థికపరిశీలనము

(27) ౧. ఆడిటర్ జనరలును గూడ కార్యనిర్వా హకవర్గముయొక్క సలహాను బొందినగవర్నరుజనరలే నియమించును. అతనిజీతము, అధికారములు, విధులు, ఉద్యోగనియమములు, ఉద్యోగము ఖాళీగా నున్నప్పుడును, అతడు సెలవు పుచ్చుకొనినప్పుడును చేయవలసినయేర్పా టులనుగూర్చి గవర్నరుజనరలే నిబంధనలు చేయును.

౨. నిబంధనలలో నుదాహరింపబడగల ఆర్థిక శాఖాధికారితో సంప్రతించినతరువాత గాని ప్రభుత్వో ద్యోగశాఖలయందు క్రొత్త ఉద్యోగములను కల్పింపరాదు. ఉద్యోగములను తగ్గించరాదు. ఉద్యోగులజీతములలో మార్పులు చేయరాదు. సదరు ఉద్యోగము రాష్ట్రీయ ప్రభుత్వమునకు లోబడి యున్నయెడల రాష్ట్రీయార్థిక శాఖాధికారితోడను, సదరు ఉద్యోగము ప్రజాస్వామ్య ప్రభుత్వమునకు లోబడియున్నయెడల ప్రజాస్వామ్యార్థిక శాఖాధికారితోడను సంప్రతింపవలెను. ఇది కార్యనిర్వా హకవర్గమువారిసలహా నొందినగవర్నరుజనరలు చేయు నిబంధనలకు లోబడి యుండవలెను.

రాష్ట్రీయశాసనసభ

(28) ఒకరాష్ట్రమునందు శాసనములను చేయు నధికారము రాజునకును, రాష్ట్రీయశాసనసభకును మాత్రమే యుండవలెను.

(29) రాష్ట్రమునకు ఒకగవర్నరుండును. అతడు రాజుగారిచే నియమింపబడి, ఆరాష్ట్రమునందు రాజప్రతినిధిగా నుండును.

(30) రాష్ట్రీయాదాయమునుండి గవర్నరుగారి జీతమునిమిత్తము రాజుగారికి........మొత్తము చెల్లింపవలెను. ఈమొత్తము, ప్రజాస్వామ్య మింకొకవిధమున నిర్ణయించువరకు, నివేదికకు అనుబంధముగా చేర్చబడిన షెడ్యూలులో నున్నట్లుండవలెను.

(31) ౧. ఒకరాష్ట్రమునందలి జనసంఖ్యను బట్టి లక్షమందికి ఒకసభ్యునివంతున రాష్ట్రీయశాసనసభకు సభ్యుల నెన్నుకొనుచుండవలెను. ఏరాష్ట్రమునం దైనను జనసంఖ్య కోటికి తక్కువగానున్నచో ఆరాష్ట్రీయశాసనసభయందు సభ్యులసంఖ్య 100 మందికి మించకుండ నుండవలెను.

౨. న్యాయశాస్త్రరీత్యా నిర్ణయింపబడు ఒక నియోజకవర్గమువలన ప్రతిసభ్యుడును ఎన్నుకొనబడవల



యును. 21 సం.ల ప్రాయముగలవా రందరకు స్త్రీపురుష వివక్షణము లేక (వోటు చేయరా దని న్యాయశాస్త్రము నిర్ణయించిన తప్ప) వోటునిచ్చెడియధికార ముండవలెను.

(32) i. ప్రతిరాష్ట్రీయసభయు 5 ఏండ్లవరకును అమలులో నుండును. ఐనను:—

అ. గవర్నరు ఈలోగనే దానిని రద్దుచేయ వచ్చును.

ఆ. ప్రత్యేకపరిస్థితులలో నవసర మని యతనికి తోచినయెడల 5 ఏండ్లకంటె హెచ్చుకాలముగూడ శాసనసభను అమలులో నుంచవచ్చును.

ఇ. శాసనసభను రద్దుచేసినతరువాత, ఆ తేది మొదలు ఆరునెలలకు మించకుండ సభ మరల సమావేశమగున ట్లతడు తారీఖును నిర్ణయింపవలెను.

ii. శాసనసభ లెచట నెపుడు సమావేశము కావలసినది, తనకు ఉచిత మని తోచినవిధమున గవర్నరే నిర్ణయింపవలెను. ప్రకటనలమూలకముగా గాని, మరియొకవిధమున గాని, శాసనసభ యెప్పుడు ముగియునో కూడ అతడే నిర్ణయించును.

iii. శాసనసభాసమావేశమును వాయిదా వేయుటకు సభాధ్యక్షుని కధికార ముండును.

iv. శాసనసభలో చర్చింపబడువిషయములను సభ్యులవోట్లను బట్టియే నిర్ణయింపవలెను. అనుకూలురును, ప్రతికూలురును సమానముగా నున్నప్పుడు తప్ప అధ్యక్షుడు వోటు చేయగూడదు. అప్పుడుమాత్ర మతడు వోటు నిచ్చి దానిని పరిష్కరింపవలెను.

v. శాసనసభలో కొన్నిస్థానములు ఖాళీగా నున్నను సభవారు అధికారమును చెలాయించుచునే యుండవచ్చును.

(33) ప్రతిసభకు నొకయధ్యక్షు డుండును. అత డా సభలో సభ్యుడుగా నుండి, సభవారిచే నెన్నుకొనబడవలెను. ప్రతిసభకు నొక ఉపాధ్యక్షుడుగూడ నుండును. అతడుగూడ అధ్యక్షునివలెనే యెన్నుకొనబడును.

(34) ఈ చట్టముయొక్క షరతుల ననుసరించి, ఏరాష్ట్రీయశాసనసభ యైనను, ఆరాష్ట్రములయందలి శాంతిసౌఖ్యములకును, సక్రమజీవనమునకును, సుపరిపాలనమునకును శాసనముల చేయుట కధికారము గలిగి యుండును. ఈనివేదికకు కడపట రెండవషెడ్యూలులో నిర్వచింపబడినవిషయము లన్నిటియందును రాష్ట్రీయ శాసనసభలకు శాసనాధికార ముండును.



(36) ఈచట్టము అమలులోనికి రాకముందు గాని వచ్చినతరువాత గాని,ఒక రాష్ట్రమునకు సంబంధించినయే విషయమునుగూర్చి భారతదేశములో నేయధికారులు జారీచేసిన శాసనము నైనను(ఆరాష్ట్రమునకు వర్తించునది మాత్రమే)రాష్ట్రీయశాసనసభ మార్చవచ్చును. లేదా రద్దుచేయవచ్చును.

(36)రాష్ట్రీయాదాయమును,వ్యయమునుగూర్చిన తీర్మానములను గవర్నరుగారికార్యనిర్వాహకసంఘ సభ్యుడే శాసనసభలో నుపపాదింపవలెను.

(37) రాష్ట్రీయశాసనసభయందామోదింపబడిన చట్టమును అంగీకరించుటకు గాని, తిరస్కరించుటకు గాని గవర్నరుగారి కధికార ముండును.

(38) గవర్నరు అంగీకరింపనిచో బిల్లు చట్టము కానేరదు.

(39) గవర్నరు ఒక చట్టము నామోదించినపిమ్మట దానిని గవర్నరుజనరలునకు పంపవలెను. గవర్నరుజనరలు దానికి సమ్మతించి, అట్లు తెల్పునంతవరకు, గవర్నరు ఆసమ్మతిని ప్రకటింపనంతవరకు, దానికి ప్రయోజనమేమియు నుండదు.

(40) గవర్నరుజనరలే చట్టమునైనను అంగీకరింపనిచో, నందులకు కారణముల నతడు వ్రాతమూలకముగా గవర్నరునకు తెలుపవలెను.

(41) గవర్నరుజనరలుగూడ చట్టము నామోదించినను, రాజుగారు దాని కనంగీకారమును జూపుట కధికారముగలదు.

(42) ఏచట్టమునకైనను రాజుగారనంగీకారమును దెల్పినచో, ఆవిషయమును గవర్నరు వెంటనే ప్రకటింపవలెను. అప్పటినుండి ఆచట్టమమలులో నుండదు.

రాష్ట్రీయ కార్యనిర్వాహక వర్గము

(43) రాష్ట్రమునందలి కార్యనిర్వహణాధికారము గవర్నరుగారియధీనమై యుండును. వారు రాష్ట్రీయ కార్యనిర్వాహకసభ్యులతో నాలోచించి పరిపాలనను జేయవలెను.

(44) ప్రతిరాష్ట్రమునకు 5 గురికి మించని కార్యనిర్వాహకులసభ యుండును. కార్యనిర్వాహకసభ్యులను గవర్నరు నియమించుచుండును.

(45) కార్యనిర్వాహకసభను నియమించుటలో, గవర్నరు ప్రధానామాత్యుని నియమించి, అతనిసలహాననుసరించి యితరులను నియమింపవలెను.



న్యాయవిచారణశాఖ

(46) ఒక సుప్రీమ్‌కోర్టుండవలెను. ఈకోర్టుయొక్క అధికారములు భారతపార్లమెంటు నిర్ణయించును. ఈ న్యాయస్థానమునం దొకప్రధానన్యాయాధ్యక్షుడును, భారతపార్లమెంటువారు నిర్ణయించునంతమంది యితర న్యాయమూర్తులును ఉందురు.

(47) ప్రజాస్వామ్యముయొక్క న్యాయాధ్యక్షుడును, ప్రజాస్వామ్యస్థాపనానంతరము నిర్ణయింపబడు నితరన్యాయమూర్తులును, గవర్నరుజనరలుగారిచే నియమింపబడుదురు. భారతపార్లమెంటువారు నిర్ణయించిన జీతము వారి కొసంగబడును. ఇట్లు నియమింపబడు వ్యక్తులు తమయుద్యోగములయం దుండువరకు, వారిజీతములు తగ్గింపబడవు.

(48) ప్రజాస్వామ్యముయొక్క న్యాయాధ్యక్షుడుగాని, ఇతర న్యాయమూర్తులుగాని, అక్రమముగా ప్రవర్తించి రని కాని, తమవిధులను చక్కగా నిర్వర్తింపలే దని కాని, రెండుశాసనసభలును కలసి, ఏకకాలమున విజ్ఞప్తి పంపుకొనినప్పుడే గవర్నరుజనరలు తన కార్యనిర్వాహక వర్గమువారితో నాలోచించి వారిని ఉద్యోగములనుండి తొలగింపవలెను. అంతవరకును తొలగింపరాదు.

(49) ఈసుప్రీమ్‌కోర్టునకు నీక్రిందివిషయముల యందు 'ఒరిజనలుసైడు' అధికారము లుండును.

౧. 85 సెక్షనుక్రింద కార్యనిర్వాహకవర్గము యొక్క సలహాను బొందిన గవర్నరుజనరలు పంపినయభియోగములను విచారించుట.

౨. ప్రజాస్వామ్యము పార్టీగా చేరియున్నప్పుడును, ప్రజాస్వామ్యపక్షమున నొకడు వాదిగా గాని ప్రతివాదిగా గాని చేరినప్పుడును.

3. విదేశరాయబారులకును ఇతరప్రతినిధులకును సంబంధించినవ్యాజ్యములయందును.

౪. ఒకరాష్ట్రమునకును మరియొకరాష్ట్రమునకును సంబంధించిన విషయములందును.

౫. రాజ్యాంగవిధానమునందలి యేవిషయమునకైనను వ్యాఖ్యానము చేయుట గాని, రాజ్యాంగవిధానము ననుసరించి యేర్పడుక్లిష్టపరిస్థితులను పరిష్కరించుట గాని.

(50) పార్లమెంటుసభవారు నిషేధించినవిషయములను వదలివేసి, వారు చేసిననిబంధనలకు లోబడి, సుప్రీమ్‌కోర్టువారికి క్రిందిన్యాయస్థానములతీర్పులను, డిక్రీలను, ఆజ్ఞలను విమర్శించుట కధికారము గలదు.



౧. సుప్రీమ్‌కోర్టులో ఒరిజనలుసూట్లుమాత్రమే విచారింపదగిన న్యాయమూర్తియొక్క తీర్పులను విమర్శించుట.

౨. ఏరాష్ట్రీయోన్నతన్యాయస్థానమున నుండియైనను, ప్రజాస్వామ్యస్థాపనసమయమున రాజుగారికి అపీలు చేయుటకు నిబంధనలప్రకార మవకాశము గల యేన్యాయస్థానముననుండియైనను, వచ్చు అపీళ్లను విమర్శించుట.

(51) ఇట్టి యభియోగములయం దన్నిటియందును సుప్రీమ్‌కోర్టువారిపరిష్కారమే స్థిరమైనది. ఏయితర న్యాయస్థానమువలన గాని, న్యాయాధికారివలన గాని సుప్రీమ్‌కోర్టువారితీర్పులు విమర్శింపబడవు. విమర్శింపబడుటకు వీలుకూడ లేదు.

### రాజుగారికి అపీలు

(52) ౧. ప్రజాస్వామ్య ప్రభుత్వమునకును ఒక రాష్ట్రీయప్రభుత్వమునకును లేదా పెక్కురాష్ట్రీయప్రభుత్వములకును మధ్య, తమప్రభుత్వాధికారపరిమితులను గూర్చినయేతగాదా యందైనను, (ఆ తగాదా యెట్లుత్పన్నమైనను సరే) లేదా రాష్ట్రీయప్రభుత్వములలో పరస్పరము కలిగెడితగాదాలయందును సుప్రీమ్‌కోర్టువారు

చెప్పెడితీర్పులను పునర్విమర్శిన చేయుటకై రాజుగారి సమక్షమున అపీలు చేయుటకు వీలులేదు. రాజుగారి న్యాయస్థానమున నే ఆదావా పరిష్కరింపబడవలె నని సుప్రీమ్‌కోర్టువా రాజ్ఞాపించినచో నట్లు అపీలు చేయ వచ్చును.

౨. అపీలు చేయుటకు ప్రత్యేక కారణము లున్న వని సుప్రీమ్‌కోర్టువారు తలచినయెడల వా రట్లాజ్ఞాపింప వచ్చును. అటుతరువాత నింకెవ్వరియాజ్ఞయు నవసరము లేకుండ రాజుగారి కపీలు చేయవచ్చును.

3. ఎట్టివిషయములందు రాజుగారి కపీలు చేయ వచ్చునో, అట్టివిషయములను నియమించుచు భారత పార్లమెంటువారు చట్టములు చేయవచ్చును. కాని సుప్రీమ్ కోర్టునుండి తనన్యాయస్థానమున కపీలు చేయున ట్లాజ్ఞా పించుటకు రాజుగారికి గలస్వతస్సిద్ధమగు అధికారమున కీచట్టములు భంగమును కలుగజేయరాదు.

### రాష్ట్రీయోన్నతన్యాయస్థానములు

(53) ఈచట్టములో, ఉన్నతన్యాయస్థానములు అనుపదమునకు బ్రిటిషుఇండియాలో తాత్కాలికముగా నేర్పడియున్న న్యాయస్థానము లని యర్థము.



(54) ప్రతి ఉన్నతన్యాయస్థానమునందును ఒక ప్రధాన న్యాయమూర్తియు, గవర్నరుజనరలుగారు అవసర మని నియమించినంతమంది యితరన్యాయమూర్తులును ఉందురు.

ఐనను:—

౧. అవసరమునుబట్టి యితరులనుగూడ రెండేండ్లకు మించకుండ తాత్కాలిక న్యాయమూర్తులనుగా నియమించుటకు గవర్నరుజనరలున కధికారము గలదు. ఇట్లు నియోగింపబడిన న్యాయమూర్తులకు గూడ తక్కిన న్యాయమూర్తులకు గల యధికారము లన్నియు నుండును.

౨. ఏన్యాయస్థానమునందైనను, ప్రధానన్యాయమూర్తి, అవసరన్యాయమూర్తులతోకూడ కలసి, న్యాయమూర్తులసంఖ్య 20 మందికంటె హెచ్చుగా నుండరాదు.

(55) ఉన్నత న్యాయస్థానమునందలి న్యాయమూర్తులు ఏదైన నొక యున్నతన్యాయస్థానములో 10 ఏండ్లకు తక్కువకాకుండ అడ్వొకేటుగా పనిచేసినవారై యుండవలెను. ఈచట్ట మమలులోనికి వచ్చినప్పు డుద్యోగములో నున్న న్యాయమూర్తులకు పైనిబంధన వర్తింపదు.

(56) i. ఏ న్యాయమూర్తి యైనను సద్వర్తనము కలిగి యున్నంతకాల మధికారము వహింపవచ్చును.

ii. ఏన్యాయమూర్తియైనను తన కుద్యోగము చేయ నిష్టము లేనిచో రాజీనామాను రాష్ట్రీయప్రభుత్వమునకు పంపవచ్చును.

(57) ఉన్నతన్యాయస్థానములయందలి ప్రధాన న్యాయమూర్తిని గాని, యితరన్యాయమూర్తులను గాని అధికారమునుండి తొలగించుటకు గవర్నరుజనరలునకు మాత్రమే అధికారము గలదు. రాష్ట్రీయశాసనసభవారు గవర్నరుజనరలును కోరినప్పుడే అతడటులు తొలగింపవలెను.

(58) ౧. న్యాయమూర్తులజీతములు, అలవెన్సులు, సెలవులు, పింఛనులు గవర్నరుజనరలే నిర్ణయింపవచ్చును. మార్చవచ్చును. కాని ఆ తేదీకిపూర్వము నియమింపబడిన న్యాయమూర్తిజీతమునకేమార్పు వర్తింపదు.

౨. ఒకానొకడు న్యాయమూర్తి యధికారమును వహించినది మొదలు, ఈసెక్షను ననుసరించి న్యాయమూర్తికి నియమింపబడిన జీతమును గ్రహించుట కర్హత గలదు.

(59) ౧. ఒక ఉన్నతన్యాయస్థానమున ప్రధాన న్యాయమూర్తిపదవి ఖాళీయైనప్పుడు గాని, న్యాయస్థానమునకు కొంతకాలమువరకు వారు రాజాలకపోయినగాని



తాత్కాలికముగా తక్కిన న్యాయమూర్తులలో నొకరిని ఆపదవికి నియమించుటకు రాష్ట్రీయప్రభుత్వమున కధికారముండును. గవర్నరుజనరలు మరియొకరిని ప్రధాన న్యాయమూర్తిగా నియమించి, ఆన్యాయాధికారి యతని పనులలో ప్రవేశించువరకుగాని, అంతకుపూర్వ మాపదవియందున్న న్యాయమూర్తి మరల వచ్చువరకు గాని, రాష్ట్రీయప్రభుత్వముచే నియమింపబడిన తాత్కాలిక న్యాయమూర్తి అధికారమందుండును.

౨. ఇతర న్యాయమూర్తుల పదవులలో నేవయిన ఖాళీలు వచ్చినచో, లేదా ఏ న్యాయమూర్తియైనను న్యాయస్థానమునకు రాజాలనిచో, లేక ప్రధాన న్యాయమూర్తిగా నియమింపబడినచో ఉన్నత న్యాయస్థానమునందు న్యాయమూర్తిగా నుండదగిన యోగ్యతగలయొకనిని రాష్ట్రీయప్రభుత్వమువారు న్యాయమూర్తిగా నియమింపవచ్చును. గవర్నరుజనరలు స్థిరముగా మరియొకని నియమించి, యతడు తనపనిలో ప్రవేశించువరకు గాని, న్యాయస్థానమునకు రాజాలనిన్యాయమూర్తి వచ్చువరకు గాని, రాష్ట్రీయప్రభుత్వమువారు అవసరన్యాయమూర్తి పదవిని రద్దుచేయువరకుగాని, అతడాపదవియందుండును.

### ఉన్నతన్యాయస్థానముల పరిశీలనాధికారము

(60) ప్రతి ఉన్నత న్యాయస్థానమును క్రిందికోర్టు యొక్కరికార్డును పరిశీలించి తీర్పుచెప్పు న్యాయస్థానముగా నుండును. మరియు ఒరిజనలుసూట్లు, అప్పీళ్లు, సముద్రముపై జరుగు నేరములు మున్నగువానిని విచారించుటకు ఉన్నతన్యాయస్థానముల కధికారముగలదు. న్యాయపరిపాలనకుసంబంధించిన సర్వవిషయములయందును, న్యాయశాఖోద్యోగులను నియమించుటయందును ఉన్నత న్యాయస్థానములకు సర్వాధికారము గలదు. ఉన్నత న్యాయస్థానముల కధికార మొసంగుచట్టముల (లెటర్సు పేటెంటు) ననుసరించి న్యాయస్థానకార్యక్రమమును నిర్వహించుటకు తగిన నిబంధనలను న్యాయస్థానమువారు చేయవచ్చును. ఈలెటర్సుపేటెంటులకు లోబడి ఈచట్టములలోనికివచ్చునప్పుడు న్యాయస్థానములకుగల సర్వాధికారములను వారు చెలాయింపవచ్చును.

ఉన్నత న్యాయస్థానముల కిట్టి యధికారముల నొసంగుచట్టములు (లెటర్సుపేటెంటులు) క్రొత్తలెటర్సు పేటెంటులవలన మార్చబడవచ్చును.

(61) ఉన్నత న్యాయస్థానములకు అప్పీళ్లను విచారించుటకు గల యధికారమునకులోబడి, ప్రతి ఉన్నత



న్యాయస్థానమునకును రాష్ట్రమునందున్న యితరన్యాయస్థానము లన్నిటిపై నధికార ముండును. ఈ క్రింద వివరించినవానిలో వేనినైనను హైకోర్టువారు చేయవలసిన దని తమకు లోబడియున్న న్యాయస్థానముల నాజ్ఞాపింపవచ్చును.

౧ లెక్కలను పంపవలె నని యాజ్ఞాపించుట.

౨. అభియోగములను ఒకకోర్టునుండి, సమానాధికారము గాని యెక్కువ యధికారము గాని గలమరియొకకోర్టునకు మార్చుట.

3. క్రిందికోర్టు సామాన్యముగా ననుసరింపవలసిన నిబంధనలను చేయుట. కోర్టువారికార్యక్రమము జరుగుటకు తగిననమూనాపత్రములు మున్నగువానిని నిర్ణయించుట.

౪. న్యాయస్థానములయందలి యుద్యోగులు లెక్కలను వ్రాయుట, ఆదాయవ్యయముల వివరములను సరిగా నుంచుట మొదలగునవి బాగుగా నిర్వర్తించుటకు వీలగు లెక్కపుస్తకముల నిర్ణయించుట.

౫. షెరీఫులు, అటార్నీలు, గుమాస్తాలు, అధికారులు మున్నగువారికి ముట్టదగిన రుసుములను నిర్ణయించుట.

ఈ నిబంధనలు, నమూనాపత్రములు, లెక్కపుస్తకములు తత్కాలమున నమలులోనున్న చట్టములకు విరుద్ధముగా నుండరాదు. ముందుగా రాష్ట్రీయప్రభుత్వముచే నివి యామోదింపబడి యుండవలెను.

(62) ౧. ప్రతి ఉన్నతన్యాయస్థానము, ఆన్యాయస్థాననిబంధనల ననుసరించి తమ యధికారమునకు లోబడి యున్న ఒరిజనల్ సూట్లను, అపీళ్లను విచారించుట కొక న్యాయాధిపతిని గాని, కొందరను గాని నియమించుచుండవచ్చును.

౨. ఒక యభియోగమును విచారింప వలసిన న్యాయమూర్తిని ప్రధానన్యాయమూర్తి నిర్ణయించును. మరియు, అత డొక్కడే విచారింపవలెనా? లేక యితర న్యాయమూర్తులతో కలసి విచారంపవలెనా? తనతో కలసి యెవ్వరు విచారింపవలెను? అను విషయములను గూడ ప్రధానన్యాయమూర్తియే నిర్ణయించును.

(63) ఒక ఉన్నతన్యాయస్థానముయొక్క పరిపాలనకు లోబడియున్న ప్రాంతమునుగాని, స్థలమునుగాని గవర్నరుజనరలు మరియొక ఉన్నతన్యాయస్థానమునకు మార్చవచ్చును. అంతకుపూర్వము ఒక ఉన్నతన్యాయస్థానముయొక్క పరిపాలనకు లోబడియుండని భాగము



పైని కోర్టునకు గల సర్వాధికారములను గాని, కొన్ని యధికారములను గాని చెలాయించుటకు ఏయున్నత న్యాయస్థానమున కైనను గవర్నరుజనరలు అధికార మొసంగవచ్చును. బ్రిటిష్ పౌరుడై తాత్కాలికముగా భారత దేశమునందు ప్రజాస్వామ్యమునకు వెలుపల నెచ్చట నున్నను, అట్టివానిపై కోర్టువారి యధికారమును చెలాయించుట కేయున్నతన్యాయస్థానమున కయినను గవర్నరుజనరలు అధికార మియ్యవచ్చును.

(64) [1] గవర్నరుజనరలు, రాష్ట్రముల గవర్నరులు, భారత ప్రభుత్వముయొక్కయు, రాష్ట్రీయ ప్రభుత్వముయొక్కయు కార్యనిర్వాహక సంఘసభ్యులు, వారి వారి యధికారరీత్యా చేసిన పనులకును ఇచ్చిన సలహాలకును, ఏయున్నతన్యాయస్థానమువారుకూడ వారిపై 'ఒరిజినల్ సైడు' అధికారము గాని 'అప్పెలైటు' అధికారము గాని, పునర్విమర్శనాధికారము గాని, (రివిషినల్) చెలాయించి చర్య జరుపుట కధికారము లేదు.

ii ఉన్నతన్యాయస్థానము నందలి ప్రధానన్యాయమూర్తులకును, ఇతర న్యాయమూర్తులకును ఈ మినహాయింపు వర్తించును.

(65) అవసర మని తోచినయెడల గవర్నరుజనరలుగారు లెటర్సుపేటెంటుల మూలకముగా ప్రజాస్వా

మ్యములో నే ప్రాంతమందైనను, (ఆ ప్రాంతము ఇంకొక ఉన్నతన్యాయస్థానమువారి యధికారమునకు లోబడి యున్నను, లోబడకున్నను) క్రొత్త ఉన్నత న్యాయస్థానమును స్థాపింపవచ్చును. ఇట్లు స్థాపించిన యే యున్నతన్యాయస్థానమునకైనను గవర్నరుజనరలుగారు, ఈచట్ట మమలులోనికి వచ్చినప్పుడు ఉన్నతన్యాయస్థానముల కున్న యధికారములను గాని, యియ్యబడగల యధికారములను గాని యియ్యవచ్చును. ఇంకొక యున్నతన్యాయస్థానము వారి యధికారమునకు లోబడియున్న ప్రాంతములో నిట్టి న్యాయస్థానము స్థాపింపబడినట్లయిన, గవర్నరుజనరలు లెటర్సుపేటెంటులద్వారా ఈ హద్దులను మార్చి, యీ మార్పులవలన అవసరమైన కట్టుదిట్టముల నన్నింటిని చేయవలెను.

### ప్రభుత్వన్యాయవాది (అడ్వొకేట్ జనరల్)

(66) ప్రతిరాష్ట్రమునకు ఒక అడ్వొకేటుజనరలును రాష్ట్రీయప్రభుత్వమువారు నియమింపవచ్చును. అడ్వొకేటుజనరలు ఉద్యోగము ఖాళీగానున్నప్పుడును, అతడు సెలవుపుచ్చుకొన్నప్పుడును, ఇతరపనిచూచుటకు నియమింపబడినప్పుడును రాష్ట్రీయప్రభుత్వమువారు మరియొకరిని వారిస్థానమున నియమింపవచ్చును. గవర్నరుజనరలు స్థిరమైన అడ్వొకేటుజనరలును నియమించి యతడుద్యోగ



ములో ప్రవేశించునంతవరకు, నియమింపబడిన యితర కార్యములను సమాప్తిచేసికొని కాని సెలవునుండి గాని, మరల అసలు అడ్వొకేటుజనరలు ఉద్యోగములో చేరునంతవరకు, లేదా రాష్ట్రీయ ప్రభుత్వమువా రాపదవిని రద్దుచేయునంతవరకు, రాష్ట్రీయప్రభుత్వమువారిచే నియమింపబడిన తాత్కాలికోద్యోగి అడ్వొకేటుజనరలుగారి యధికారములను నిర్వహించుచుండవలెను.

### ఆస్తి, ఆదాయము, ఖజానా

(67) 1858, 1915, 1919 సంవత్సరముల ప్రభుత్వచట్టముల ప్రకారము రాజుగారివశము గాని, గవర్నరుజనరలువశము గాని చేయబడిన ఆస్తియు, ఇట్లు వశము చేయబడిన ఆస్తివలనను, హక్కులవలనను ఏర్పడునట్టియు, చేకూరునట్టియు ఆస్తిపాస్తులను భారతప్రభుత్వకార్యనిర్వాహకసంఘముతోగూడిన గవర్నరుజనరలునకు సంక్రమించును.

(68) భారతదేశపు ఆదాయము లన్నియు కార్యనిర్వాహకసంఘముతో గూడిన గవర్నరు జనరలుగారి యధీనమున నుండును. అత డీచట్టముయొక్క షరతులకు లోబడి, భారత దేశముకొరకుమాత్రమే యీసొమ్మునంతయు వ్యయపరుచుచుండవలెను.

(69) ఈ చట్టమునందు వివరింపబడిన 'భారత దేశపు ఆదాయము' అనుపదమునందు బ్రిటిష్ ఇండియా దేశమునందు సమకూరెడు రాష్ట్రీయాదాయము (టెరిటోరియలు రెవెన్యూ) మున్నగుఆదాయములుమాత్రమే కాక ఈ దిగువ వివరింపబడిన ఆదాయములుకూడ చేరును.

౧. 1858-వ సం.లో ఇండియాప్రభుత్వచట్టము చేయబడియుండనిమెడల ఈస్టిండియా కంపెనీవారివలన గాని, వారిపేరట గాని, వసూలుచేయబడదగిన రాష్ట్రీయ సంబంధములగు కప్పములు, మున్నగు వసూళ్లు.

౨. బ్రిటిష్ ఇండియాదేశమునం దేన్యాయస్థానమునందైనను విధింపబడిన జరీమానాలు,అపరాధపుసన్నులు మున్నగువానివలనను, అపరాధములు చేసినవారి స్థిర చరాస్తులను వశపరుచుకొనుటకు న్యాయాధిపతులుచేసిన యుత్తరువులవలనను లభింపదగినమొత్తము లన్నియును.

3. బ్రిటిష్ ఇండియాలో వారసులు లేకపోవుట వలన ప్రభుత్వమునకు దఖలుపడవలసిన స్థిర చరాత్మకములగు సొత్తులన్నియు, బ్రిటిషుఇండియాలోన్యాయమైన హక్కును బుజువుపరచగలవారు లేకపోవుటవలన దొరతనమువారికి చెందవలసిన అన్నివిధములగు సొత్తులును.



(70)భారతపార్లమెంటువారు'ఇనుపదారుల,నౌకాశయములనిధి' యని ఒకనిధినేర్పాటు చేయవలెను. ఇనుపదారులు, తపాలాకచ్చేరీలు, నౌకాశయములవలన వసూలు చేయబడిన ధనమును కార్యనిర్వాహకవర్గముతో గూడిన గవర్నరుజనరలుగారు ఈ నిధియందు చేర్చుచుండవలెను. పార్లమెంటుసభవారు నిర్ణయించునట్టి పద్ధతిప్రకారము ఆనిధిలోని ద్రవ్యమును ఇనుపదారులు, తపాలాకచ్చేరీలు నౌకాశయములకు మాత్రమే పార్లమెంటువారు వ్యయపరుచుచుండ వలెను. 'సకలాదాయములనిధి' అనుపేరుగల మఱియొకనిధినిగూడ వారేర్పరచవలెను. కార్యనిర్వాహకసంఘమువారి సలహాను బొందిన గవర్నరుజనరలుగారు వసూలుచేయునట్టి యితరవిధములగు ఆదాయముల నన్నిటిని ఈ నిధిలో జమకట్టుచుండవలెను. ఈ చట్టమునందు విధింపబడిన నిబంధనలకును, మరియు ఈచట్టము ననుసరించి చేయబడునిబంధనలకును లోనై యీనిధిలోనిద్రవ్యమును ప్రజాస్వామ్యముకొరకు పార్లమెంటువారు వినియోగించుచుండవలెను.

(71) ఈదిగువ నిచ్చినవానికన్నిటికి భారతదేశాదాయమునుండియే ద్రవ్యము వెచ్చింపవలెను.

౧. ఈస్టిండియా కంపెనీవారు చేసిన ఋణములు.

౨. 1858, 1915, 1919 సంవత్సరములలో ఇండియా ప్రభుత్వచట్టములు చేయబడకుండినయెడల ఈస్టిండియా కంపెనీవారు సంధులు, ఒడంబడికలు, కంట్రాక్టులు విరాళములు, ఋణములకొరకు భారత దేశాదాయమున నుండి చెల్లింపవలసిన మొత్తములలో, నీచట్టము అమలులోనికి వచ్చుసరికి చెల్లింపవలసి యుండిన అన్ని మొత్తములు, ఖర్చులు, వ్యయములు మున్నగునవి.

3. భారత ప్రభుత్వ నిర్వహణార్థము న్యాయసమ్మతముగా చేయబడిన ఖర్చులు, ఋణములు, బాధ్యతలు.

౪. ఈచట్టము ననుసరించి చెల్లింపదగిన యితర మొత్తము లన్నియు (ఈ చట్టములో నింకొక విధముగా నేర్పాటు చేయబడినవి తప్ప)

(72) i. ప్రజాస్వామ్యము స్థాపింపబడిన తరువాత సాధ్యమైనంతత్వరలో నీక్రిందివిషయములనుగూర్చి విచారణ చేయుటకు గవర్నరుజనరలు ఒకవిచారణసంఘము నేర్పరుపవలెను. ఆ సంఘమునకు ప్రజాస్వామ్యాధికారి యొకడు అధ్యక్షుడుగా నుండును. దానిలో రాష్ట్రీయమున కొక్క ప్రతినిధి చొప్పునను ప్రజాస్వామ్య ప్రభుత్వమున ......ప్రతినిధులును ఉండవలెను.



(అ) ప్రజాస్వామ్య ప్రభుత్వము, రాష్ట్రీయప్రభుత్వములు చక్కగా పరిపాలన సాగించుటకును, వారి యధీనమున నున్న శాఖలను వృద్ధి నొందించుటకును, వారి వారికి వశపరచవలసిన ఆదాయ వసతులను కల్పించుట.

(ఆ) ప్రజాస్వామ్య ప్రభుత్వమునకును, రాష్ట్రీయ ప్రభుత్వములకును ఉండవలసిన ఆర్థిక సంబంధములను నిర్ణయించుట.

(ఇ) ఈ సంబంధములను అమలులో నుంచుటకు అవలంబింపదగిన విధానమును నిర్ణయించుట.

ii సేన, నౌకాదళము, విమానదళములలో ఉద్యోగులుగా నుండదగినవారిని సిద్ధపరుచుటను గూర్చియు, సైనికవిద్య నేర్పుటకు కావలసిన పాఠశాలలను, కళాశాలలను ఏర్పరుచుటను గూర్చియు సాకల్యముగా పరిశీలించుటకు మీా విచారణసంఘమువా రొక ఉపసంఘము నేర్పరుపవలెను.

iii సైనిక శిక్షణమున కవసరమగు పాఠశాలల సంఖ్య, వానిలో ఉపాధ్యాయులుగా నుండదగిన వారి సంఖ్య, వానిస్థాపనకు తగినప్రదేశములు, ఆయా సంస్థల యందు బోధింపబడదగిన విద్యాపరిమితి, వీనికి కావలసిన

ప్రారంభవ్యయము, వార్షికవ్యయములు మున్నగు వానిని గూర్చి ఉపసంఘమువారు విచారణసంఘమువారికి నివేదింపవలెను.

iv ప్రజాస్వామ్యమునం దంతట సామాన్యప్రారంభ విద్యను ప్రవేశపెట్టుటను గూర్చియు, వెనుక బడియున్న ప్రజాసంఘముల యభివృద్ధికొరకు ప్రత్యేక విద్యాసౌకర్యములను కల్పించుటనుగూర్చియు విచారణచేసి నివేదికను పంపుటకు మరియొక ఉపసంఘమునుగూడ విచారణసంఘమువా రేర్పాటు చేయవలెను.

v ఇట్టులే యితర విషములనుగూర్చి విచారణచేసి నివేదికలను పంపుటకును, ఇతర ఉపసంఘములను నియమించుటకును గూడ ఈ విచారణసంఘమున కధికారము ఉండవలెను.

vi విచారణ సంఘమువారు ఈ రీతిగా విచారణలను జరిపించి, మొదటిక్లాసులో మేము సలహానిచ్చిన విషయమునుగూర్చి గవర్నరుజనరలునకు నివేదికను పంపవలెను. మరియు 2, 3, 4 క్లాజులలో చెప్పబడిన విషయముల నిమిత్తము ప్రజాస్వామ్యాదాయముననుండియు, రాష్ట్రీయాదాయములనుండియు నొసంగబడదగిన మొత్తములనుగూర్చికూడ విచారణసంఘమువారు కార్యనిర్వా



హకవర్గమువారి సలహాను బొందిన గవర్నరుజనరలునకు నివేదింపవలెను.

(73) ఈ విచారణసంఘమువారి నివేదికనంతయు, దానిపై తనయభిప్రాయములను, కార్యనిర్వాహకవర్గమువారి సలహా నొందన గవర్నరుజనరలుగారు భారతపార్లమెంటుసభవా రందువిషయమున తగు శాసనముచేయుటకుగాని యితరచర్య పుచ్చుకొనుటకుగాని భారతపార్లమెంటుసభవారికి పంపవలెను.

(74) ఈ విచారణ పూర్తియగువరకు, 68 వ క్లాజు ప్రకారము పార్లమెంటువారు చర్యజరుపుట పూర్తియగువరకు ఆదాయవసతులును, ఆర్థికసంబంధములును అదివరకున్న రీతినే అమలులో నుండవలెను.

### దేశరక్షణ

(75) ఈ క్రిందిసభ్యులతో గూడిన దేశరక్షకసంఘము నొకదానిని కార్యనిర్వాహకవర్గముయొక్కసలహానొందిన గవర్నరుజనరలు నియమింపవలెను.

౧ 1. ప్రధానామాత్యుడు, 2. దేశరక్షకమంత్రి 3. విదేశీయ వ్యవహారములు చూచు మంత్రి, 4. సర్వసేనాధిపతి, 5. వైమానికదళాధిపతి, 6. నౌకాదళాధిపతి 7. సామాన్యోద్యోగశాఖాప్రధాని (Chief of tne General Staff), మరియిద్దరు నిపుణులును.

౨. ఈ సంఘమునకు ప్రధానామాత్యుడు అధ్యక్షుడుగా నుండును. ఈ సంఘమునకు ఒక కార్యదర్శియును, ఇతరోద్యోగులును స్థిరముగా నుండవలెను.

3. దేశరక్షణమునుగూర్చియు, దేశరక్షణపద్ధతులనుగూర్చియు ప్రభుత్వమువారికిని, వివిధప్రభుత్వశాఖలకును. ఈసంఘమువారు సలహా నిచ్చుచుండవలెను.

౪. ఈ సంఘ మేర్పడినవెంటనే భారతదేశరక్షణమునకు భంగము కలుగనివిధమున ప్రస్తుతసైనికవ్యయమును తగ్గించుటనుగూర్చి యీ సంఘమువారి సూచనలను కార్యనిర్వాహకవర్గము యొక్క సలహాను బొందిన గవర్నరుజనరలుగారు తీసికొనవలెను.

(76) దేశరక్షణమున కని ప్రత్యేకింపబడవలసిన ఆదాయమును గురించిగాని, ద్రవ్యమును గురించిగాని, గవర్నరుజనరలు చేయు సూచనలు ప్రజాప్రతినిధిసభవారి యామోదమునకై పంపబడవలెను.

(77) విదేశీయు లెవరయినను భారతదేశముపై భూమార్గమున గాని, సముద్రమార్గమున గాని, ఆకాశమార్గమున గాని దాడి వెడలివచ్చినను లేక దాడి వెడలిరానున్నా రని రూఢివర్తమానము తెలిసినను, ఈపైనిబంధనలతో సంబంధము లేకయే, దేశరక్షణమున కవసరమైన



వ్యయములను చేయుటకు కార్యనిర్వాహకవర్గముయొక్క సలహాను బొందిన గవర్నరుజనరలు గారికి అధికారము గలదు. అప్పుడు శాసనసభ జరుగుచున్నచో ఆవిషయమున తా నవలంబించిన మార్గమును గురించి గవర్నరుజనరలు వెంటనే శాసనసభవారికి తెలియజేయవలెను. శాసనసభ అప్పుడు జరుగుచుండనియెడల సాధ్యమైనంత త్వరలో సభను సమావేశపరచి తాను జరిపిన చర్యను గూర్చి సభవారికి నివేదించవలెను.

(78) ఈ రాజ్యాంగవిధానము ననుసరించి స్థాపింపబడిన దేశరక్షకసంఘమువారిసలహా లేనిది సైనికనౌకావిమానదళములను గూర్చిన యే చట్టములును పార్లమెంటుసభలో నుపపాదింపబడరాదు.

### పరిపాలకోద్యోగివర్గము

(79) భారతదేశములో ప్రజాస్వామ్యప్రభుత్వ మేర్పడినవెంటనే, ఈ సెక్షనునకుతరువాత రానున్న సెక్షనునందలి నిబంధనలకు లోబడి ప్రస్తుతప్రజాపరిపాలకోద్యోగు లందరును ప్రజాస్వామ్యప్రభుత్వమువారియుద్యోగులే యగుదురు.

(89) ప్రజాస్వామ్య ప్రభుత్వస్థాపనకు పూర్వమున్నట్టి యుద్యోగశాఖలలో జరుగవలసిన మార్పులను

గూర్చి విచారణచేసి నివేదిక నంపుటకు ప్రజాస్వామ్య ప్రభుత్వ మేర్పడినవెంటనే గవర్నరుజనరలుగా రొక విచారణసంఘమును నియమింపవలెను.

(81) భారతదేశమునందలి సివిలు సర్వీస్ ఉద్యోగముల విభజనను నిర్ణయించుట, ఈ యుద్యోగముల కెవరిని నియమింపదగునో, యెట్టిపద్ధతుల ననుసరించి నియమింపదగునో నిర్ణయించుట, ఉద్యోగధర్మములు, వారిజీతములు, బత్తాలు, మొదలగునవి, వారివిధులు సద్వర్తనము మున్నగువానినిగూర్చి నిబంధనలను పార్లమెంటువారు చేయవచ్చును. మరియు, ఏ విషయములయందు, ఎంతవర కధికార మిచ్చుట మంచిదో నిర్ణయించి పైని జెప్పబడినచట్టముల ననుసరించి నిబంధనలను చేయుటకు గవర్నరుజనరలునకు కాని, రాష్ట్రీయప్రభుత్వములకు గాని పార్లమెంటువా రధికారము నొసంగవచ్చును.

(82) ౧. ప్రజాస్వామ్యస్థాపనానంతరము కార్యనిర్వాహకవర్గమువారి సలహాను బొందిన గవర్నరు జనరలు శాశ్వతమగు ప్రభుత్వోద్యోగనిర్ణయసంఘమును (పబ్లిక్ సర్వీస్ కమిషన్) స్థాపింపవలెను. ప్రభుత్వోద్యోగముల కర్హతలను నిర్ణయించుటయందును, ఉద్యోగులను నియమించుటయందును వారి యుద్యోగధర్మములను, వారియుద్యోగవిధేయతలను, ఉద్యోగులు తమ పదవులను విరమించుటను, వార్ధక్యదోషమువల్ల తమ విధులను నెరవేర్చలేనివారియనర్హతలను నిర్ణయించుటయందును ఆ సంఘమున కధికారముండును.



౨. ఈ శాశ్వతప్రభుత్వోద్యోగ నిర్ణయసంఘసభ్యులు, నియమింపబడినది మొదలు ఐదేండ్లవరకు అధికారము గలిగియుందురు.

(73) ప్రజాస్వామ్యప్రభుత్వ మేర్పడిన మూడు సంవత్సరములకులోగా నేయుద్యోగియైనను చాలించు కొనదలచినను, ఉద్యోగమునుండి తొలగింపబడినను ప్రజాస్వామ్యము స్థాపింపబడకుండినచో నాస్థితియందున్నవారి కొసంగబడు పింఛనులు, బత్తాలు, గ్రాట్యుయిటీలు మున్నగువానిని బడయుట కర్హులుగా నుందురు.

సైనికోద్యోగులు

(84) ప్రజాస్వామ్యప్రభుత్వ మేర్పడు సమయమున సేనలోను, నౌకాదళములోను, నౌకావ్యాపారోద్యోగములలోను, వైమానికదళములోను, ఉద్యోగములు చేయుచున్న భారతీయులకును, ఆంగ్లేయులకును జీతములు, బత్తాలు, పింఛనులు అదివరకున్నట్లే యుండ

వలెను. లేనిచో వానిని నష్టపడినందులకు పరిహారముగా ప్రజాస్వామ్యప్రభుత్వ మేర్పడకుండినయెడల ఆ యధికారుల కాస్తిగతులలో నెట్టి సదుపాయములు చేయబడియుండెడివో, అట్టి సదుపాయములనే కార్యనిర్వాహక సంఘముయొక్క సలహాను బొందిన గవర్నరుజనరలుగారు వారి కిప్పుడుగూడ చేయవలెను. మరియు, ప్రజాస్వామ్యప్రభుత్వ ప్రారంభసమయమున నెవరి కెంత మొత్తము పింఛనుగా నియ్యబడుచుండెనో ఆ మొత్తములే యటుతరువాతగూడ వారి కీయబడుచుండవలెను.

స్వదేశసంస్థానములు

(85) స్వదేశసంస్థానములవిషయమున నిదివరకు చేసికొనబడిన ఒడంబడికలు మున్నగువాని ననుసరించి భారతప్రభుత్వమువా రేహక్కులను, బాధ్యతలను వహించియున్నారో, అట్టిహక్కులను, బాధ్యతలను ప్రజాస్వామ్యప్రభుత్వమువారు గూడ గలిగియుందురు.

ప్రజాస్వామ్యప్రభుత్వమునకును, ఒక సంస్థానమునకును ఒడంబడికలు, సంధులు, సన్నదులు మున్నగా గలవానిలో వేనినిగూర్చి యయినను భిన్నాభిప్రాయము గలిగినపుడు, కార్యనిర్వాహకవర్గము వారి సలహాను బొందిన గవర్నరుజనరలు, ఆసంస్థానముయొక్క అనుమతిని గైకొని ఆయభియోగమును సుప్రీమ్‌కోర్టువారి విచారణకొరకు పంపవచ్చును.



రాష్ట్ర పునర్నిర్మాణము

(85) ఏరాష్ట్రమునందయినను అధికసంఖ్యాకులు పునర్విభజనము కోరినచో, ఆర్థికసంబంధములైన చిక్కులు లేనియెడలను, పరిపాలనసౌకర్యమునకు భంగము కలుగకుండినయెడలను, భాష ననుసరించి రాష్ట్రవిభజనము చేయదగును.

రాజ్యాంగ విధానమును సవరించుట

పార్లమెంటువారు, రాజ్యాంగవిధానము నందలి యేనిబంధనలనయినను, శాసనపూర్వకముగా రద్దుచేయవచ్చును; లేదా మార్చవచ్చును. కాని అట్టి మార్పును రెండు భారతశాసనసభలలోని సభ్యులు కలసి చర్చించి యామోదింపవలెను. ఈచట్టమును* మూడవసారి ప్రతిపాదించినప్పుడు, రెండుశాసనసభలసభ్యుల మొత్తములో 2/3 భాగము ఆమోదింపవలెను. రెండుశాసనసభల సభ్యుల సంయుక్తసభలో నిట్లామోదింపబడినచట్టము, రెండుశాసనసభలలోను ఆమోదింపబడినట్లుతలంపవలెను.

---

* ఒకబిల్లును మూడుసార్లు ప్రతిపాదించుట ఆచారము. ఆంగ్లములో వీనిని రీడింగు లందురు. మూడుసార్లు ప్రతిపాదింపబడియామోదింపబడిన గాని ఒక బిల్లు శాసన మగుటకు వీలులేదు.

షరా: సాంఘికవిషయములనుగురించియు, నిశ్చిత వివాదాంశములను గురించియు మే మొసంగిన సలహాలు.

సాంఘిక ప్రాతినిధ్యము

I. ప్రజా ప్రతినిధి సభకును, రాష్ట్రీయ శాసన సభల కన్నిటికిని సంయుక్త మిశ్ర నియోజకవర్గముతే యుండవలెను.

II. మహమ్మదీయుల సంఖ్య తక్కువగా నున్న రాష్ట్రములలో మహమ్మదీయులకును; పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రములయందలి మహమ్మదీయేతరులకును తప్ప మరేసంఘమునకును ప్రజాప్రతినిధిసభలో ప్రత్యేక స్థాననిర్ణయము ఉండగూడదు. మహమ్మదీయులసంఖ్య తక్కువగానున్న ప్రతిరాష్ట్రములోను మహమ్మదీయుల జనాభా ననుసరించియు, పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రములలోని మహమ్మదీయేతరులకు వారి జనసంఖ్యను బట్టియు మాత్రమే ప్రత్యేకస్థాననిర్ణయము జరుగవలెను. ఇట్లు ప్రత్యేకస్థాన నిర్ణముము చేయబడిన రాష్ట్రముల యందు మహమ్మదీయులును, మహమ్మదీయేతరులును ఇతర స్థానములకుగూడ పోటీచేయుటకు హక్కు గలిగి యుండురు.



III. రాష్ట్రములలో

(౧) పాంచాలమునందును, వంగదేశమునందును ఏ సంఘమునకును స్థానములను ప్రత్యేకింపరాదు.

(౨) ఈరెండు రాష్ట్రములుగాక తక్కిన రాష్ట్రములలో స్వల్పసంఖ్యాకులగు మహమ్మదీయులకు వారి జనాభా ననుసరించి ప్రత్యేకస్థాననిర్ణయ ముండును. ఇదిగాక వారు ఇతరస్థానములకు పోటీచేయుటకు అధికారము గలిగి యుందురు.

(3) పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రములలోనిమహమ్మదీయేతరులకుగూడ నిట్లే స్థానములను ప్రత్యేకింపవలెను. ఇతరస్థానములకు వారుగూడపోటీచేయవచ్చును.

IV. ఇటుల స్థానములను ప్రత్యేకించు పద్ధతి 10 సంవత్సరములవరకు మాత్రమే అమలులో నుండును.

రాష్ట్రపునర్విభజన—రాష్ట్రముల ప్రతిపత్తి

V. సింధురాష్ట్రమునందలిఆర్థికస్థితిగతులనుగూర్చి అవసరమయిన విచారణ చేయించిన తరువాత సింధు రాష్ట్రమును బొంబాయినుండి విడదీసి ప్రత్యేక రాష్ట్రముగా చేయవలెను.

VI. మైసూరుసంస్థానమున కావలచిందరవందరగానున్న కొన్ని ప్రాంతములను తప్ప తక్కిన కర్ణాటభూమి

సంతయు నిదివరకున్న రాష్ట్రమునుండి విడదీసి యొక ప్రత్యేకరాష్ట్రముగా చేయవలెను.

VII. పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రమునకును, ఇటుపైని క్రొత్తగానిర్మింపబడు రాష్ట్రముల కన్నిటికిని గూడ, నిప్పుడు భారతదేశమునందలి రాష్ట్రములం దెట్టి పరిపాలనవిధాన మున్నదో, అట్టి పరిపాలన విధానమే యుండవలెను.

మోతీలాల్ నెహ్రూ, ఎస్. ఆలీ ఇమామ్,
తేజబహదూర్ సప్రూ, ఎమ్. ఎస్. ఆనీ,
మంగళసింగు, షు అబ్ ఖురాషీ,
సుభాష్ చంద్రబోస్, జి. ఆర్. ప్రధాన్.

---

* ఈచిత్తునివేదికను చర్చించిన ఆఖరుసభకు షుఅబ్ ఖురాషీగారు రాజాలకపోయిరి. ఐనను ఈచిత్తువిధానము వారికంపబడెను. మూడవఅధ్యాయములోని విషయమునకు సంబంధించిన సలహాలలో, మహమ్మదీయులకు భారతశాసనసభయందు మూడవవంతు స్థానములు ప్రత్యేకింపబడవలెనని వారు తెలియజేసినారు. మరియు వారిట్లు వ్రాయుచున్నారు. "జులై 7 వ తారీఖున ఇష్టాగోష్ఠిసభలో చేయబడిన తీర్మానముతో నేకీభవించుచున్నాను. కాని దానిని సమర్థించుటకు తెల్పబడిన వివరములతోడను వాదములతోడను నే నేకీభవింపను."

సర్ ఆలీ ఇమామ్, శ్రీయుత సుభాష్ చంద్రబోసుగారు, జి. ఆర్. ప్రధాన్‌గారుకూడ సంఘమువారుచేసిన ఆఖరుసభకు రాజాలకపోయిరి; ఐనను ఈచిత్తు నివేదికను చదివినతరువాత దాని నొప్పుకొనినట్లు వారు తెలియజేసిరి.

# ఇష్టాగోష్ఠిసభ — తరువాతి వృత్తాంతము

---

నివేదికయందు ౧౦౮-వ పుటలో నుల్లేఖింపబడిన ఇష్టాగోష్ఠిసభవారి తీర్మానము 1928 వసంవత్సరము జులై 7 వ తారీఖున నామోదింపబడెను. తీర్మానము నొప్పుకొనినట్లు సంతకములు చేసినవారిలో డాక్టరు ఎమ్. ఏ. అన్సారీగారు, పండితమోతీలాల్ నెహ్రూగారు, పండిత మదనమోహనమాలవ్యాగారు, సర్ ఆలీ ఇమామ్‌గారు, సర్ తేజబహద్దూరు సప్రూగారు, అబ్దుల్ కలమ్ అజద్ గారు, సచ్చిదానందసింహాగారు, సి. వై. చింతామణి గారు, టి. ఏ. కే. షేర్వానీగారు, మంగళసింగు గారు, మహమ్మద్ షాఫీదావూదీగారు, ఎమ్. ఎస్. ఆనీగారు, ఎస్. డి. కిచ్లూగారు, సుభాష్ చంద్రబోసుగారు, షు అబ్ ఖురాషీగారు, ఖాలిక్—ఉజ్—జమాన్‌గారు, డి. ఆర్. రంజిత్ సింగుగారు, సయ్యద్ మహమ్మద్, ఏ.ఎమ్.ఖ్వాజా, జవాహర్లాలు నెహ్రూగారు లుండిరి. సభలోనున్న మరికొందరుగూడ నీతీర్మానము నంగీకరించిరి గాని సంతకములు పుచ్చుకొనిన సమయములో వారు సభలో లేక

పోయిరి. తరువాత నెహ్రూకమిటీవారిచే మరల నీ తీర్మానము చర్చింపబడెను. ఆసమయమున ఆహ్వానింపబడిన కొందరు పెద్దలుగూడ నుండిరి. కమిటీవారి కార్యక్రమములోని భాగముల నీక్రింద నిచ్చుచున్నాము.

జులై 8 వ తారీఖునాటి కార్యక్రమము

ఉదయము జరగినసభ, హాజరయిన సంఘసభ్యులు

పండిత మోతీలాలు నెహ్రూగారు, ఎమ్.ఎస్.ఆనీగారు, షుఅబ్ ఖురాషీగారు, సర్దార్ మంగళసింగుగారు, సుభాష్ చంద్రబోసుగారు.

సభకు దయచేయవలసినదని మేము కోరినవారిలో నీక్రిందివా రుండిరి.

డాక్టరు ఎమ్. ఏ. అన్సారీగారు,మౌలానాఅబ్దులు కలమ్ అజద్గారు, టి. ఏ. కే. షేర్వానీ గారు, మహామ్మద్ షాఫీదావూదీగారు, డాక్టర్ ఎస్. డి. కిచ్లూగారు, ఖాలీక్—ఉజ్—జమాన్గారు, డాక్టర్ సయ్యద్ అహామ్మద్గారు, జవాహర్లాలు నెహ్రూగారు.

మహామ్మదీయాల్పసంఖ్యాకులకు భారత శాసనసభలో స్థానములను ప్రత్యేకించువిషయ మాలోచింపబడెను. నిన్నటి యొడంబడిక ననుసరించి [మొదటి భాగము] అల్పజనసంఖ్యాక సంఘములకుగూడ స్థానములను ప్రత్యేకించుపద్ధతి యుండరాదని యొక్క కొందరు



చెప్పిరి. మరికొందరుస్థానములనుప్రత్యేకించుపద్ధతి యసలే లేకపోయినయెడల 500 సభ్యులు గలిగినభారతశాసనసభలో మహామ్మదీయులు 30, 40 సభ్యులకంటె హెచ్చుగా నెన్నుకొనబడ రని వాదించిరి. మహామ్మదీయులు స్వల్పసంఖ్యాకులుగా నున్న రాష్ట్రములలో గూడ నిట్లే జరుగు నని వారు చెప్పిరి. అధికసంఖ్యాకులకు స్థానములను ప్రత్యేకించుట యవసరము లేదు గాని, అతిస్వల్పసంఖ్యాకులకు భారతశాసనసభలోను, రాష్ట్రీయ శాసనసభలలోను స్థానములను ప్రత్యేకించుటవలన నెట్టి యిబ్బంది తొలగు నని కొందరు సూచించిరి. ఇట్లు చేసినయెడల నిన్నటియొడంబడికను మార్పవలసివచ్చును. సభవా రప్పటికిమాత్ర మిదమిత్థమని తీర్మానింపలేదు. సాయంకాలము జరగుసభకు విషయ మాపియుంచబడెను.

జులై 8 వ తారీఖు సాయంకాలము జరగినసభ

ఎస్. డి. కిచ్లూ, డాక్టరు సయ్యద్ మహామ్మద్ గారులు తప్ప ఉదయము సభలో నున్నవారందరు సభకు దయచేసిరి.

సర్ తేజబహద్దూర్ సప్రూగారుకూడ దయచేసిరి.

ఉదయము సభలో కొంత చర్చించి వదలివేసిన అల్పజనసంఖ్యాకసంఘములకు స్థానములను ప్రత్యేకించు

సమస్యనుగూర్చి మరల చర్చ ప్రారంభమయ్యెను. భారత శాసనసభలో అల్పజనసంఖ్యాకసంఘములకు జనాభా ననుసరించి స్థానములను ప్రత్యేకించుటకు వీలగునట్లు 7 వ తారీఖున చేయబడిన తీర్మానములోని మొదటిభాగమును మార్చుట కేకగ్రీవముగా నంగీకరింపబడెను.

అనంతరము అత్యల్పజనసంఖ్యాక సంఘములకు రాష్ట్రీయశాసనసభలో ప్రాతినిధ్యమునుగూర్చి సభవారు చర్చించిరి.

భారతశాసనసభలో అల్పసంఖ్యాకు లగువారికి జనాభా ననుసరించి స్థానములను ప్రత్యేకించుటకు జెప్పిన కారణము లన్నియు, రాష్ట్రీయశాసనసభలకు గూడ వర్తించు నని సంఘసభ్యులలో షుఅబ్ ఖురాషీగారు తప్ప తక్కినవా రందరునుతలచిరి. ఈయభిప్రాయమును సంఘ సభ్యులు కానిపెద్దలు గూడ నామోదించిరి. కావున రాష్ట్రీయశాసనసభలలో అత్యల్పజనసంఖ్యగలసంఘము లకు వారి జనాభా ననుసరించి స్థానములను ప్రత్యేకించి ఇతరస్థానముల కెన్నిటికేని యభ్యర్థించు హక్కు నీయ వలసిన దని అఖిలపక్షసమావేశమువారికి నివేదించుటకు తీర్మానింపబడెను.

# మొదటి షెడ్యూలు

---

## భారతప్రభుత్వమునకు లోబడియున్న శాఖలు

(1) భారతదేశములో వర్తకవ్యాపారములు. విదేశములతో వాణిజ్యము. మరియు వర్తకవ్యాపారసంబంధ మైనట్టియు, ఆర్థికసంబంధమైనట్టియు దేశీయ విదేశీయ ప్రతిష్ఠాపనలను స్థాపించుట.

(2) రాష్ట్రములకును, వానిలో భాగములకును ఈ రాజ్యాంగవిధానమునందు మినహాయించిన పన్నులు భారతప్రభుత్వశాఖలుగా నుండవు. కాని సుంకములు, ఆదాయము, మత్తుపదార్థములమీదిపన్ను, రాబడిపన్ను, సూపర్ టాక్సు, కార్పొరేషనులాభములపన్ను (Corporation profits-tax) నల్లమందు, దానిని పండించుట, వండుట, అమ్ముట, విదేశములకెగుమతిచేయు నల్లమందు పై పన్నువేయుట, భారతప్రభుత్వశాఖలుగా నుండును.

(3) పారిశ్రామికాభివృద్ధికిని, వాణిజ్యాభివృద్ధికిని సాహాయ్యముచేయుట.

(4) ప్రజాస్వామ్యముయొక్క ఆస్తిమీద గాని, ఆదాయముమీద గాని, నమ్మకముమీద గాని ఋణము చేయుట; ప్రజాస్వామ్యప్రభుత్వము ప్రజాహితమునకై చేయు ఋణము.

(5) నాణెములను పోతపోయుట, నాణెముల చెలామణి, నాణెములవిలువను నిర్ణయించుట.

(6) బ్యాంకువ్యాపారము, భీమా, సేవింగ్సుబ్యాంకులు; బ్యాంకులస్థాపన, నోట్లువేయుట, స్టాకుఎక్సుఛేంజి.

(7) మారకపుబిల్లులు, చెక్కులు, హుండీలు, ప్రామిసరీనోట్లు.

(8) సముద్రముమీదను, దేశప్రదేశములందును, ప్రయాణమునకై... 

(8) సముద్రముమీదను, దేశ్రశేయోభివృద్ధికరములగు నదులమీదను ఓడవర్తకముచేయుట; నౌకాశయములు, పెద్దరేవులు, ఓడలకు దిక్కుతెలియుటకై రేవుననుండు దీపస్తంభములు, ఇతర గురుతులు, తేలికపారు ఓడలు; అడుగుననున్న రాళ్లు మొదలగువానిని తెలిసికొనుటకు తేలవేయు గుర్తులు.

(9) ఇనుపదారులు, భారతదేశమునకంతటికిని కావలసిన రాదార్లు, సేనల రాకపోకలకు వీలగురోడ్లు.

(10) విమానములు, వానితో సంబంధించిన సర్వ[illegible]యములు.



(11) తపాలకచ్చేరీలు, టంతివార్తలు, దూరశ్రవణయంత్రములు, తీగలులేకుండ పంపు వాయువార్తలు.

(12) భారతదేశరక్షణము, సైనికదళము, నౌకాదళము, వైమానికదళములతో సంబంధించిన సర్వవిషయములు, అవసరపటాలములు, భారతనౌకావ్యాపారము, రాష్ట్రీయప్రభుత్వములు పోషించుచున్న సేన, పోలీసుదళములుగాక, దేశములో నిర్మింపవలసిన సేనాదళములను, పోలీసుదళములను నిర్మించుట; సేనకును, నౌకలకును అవసరములగు పరికరములను తయారుచేయుకర్మాగారములు; సైనికులకు, నావికులకు, వైమానికులకు శిక్షణకళాశాలల నేర్పరుచుట.

(13) విదేశములతోడను, భారత సంస్థానములతోడను, తమవశముననుంపబడిన ఇతరప్రదేశములతోడను సంబంధములు; మన దేశమును నివాసస్థానముగా చేసికొనిన విదేశీయులతో సంబంధము, పౌరసత్వపు హక్కుల నిచ్చుట, ఇతరదేశస్థులతో సంబంధము, పాస్‌పోర్టులు; విదేశయాత్రలు.

(14) దేశాంతరము వెళ్లినవారికొరకును, విదేశములనుండి మన దేశమునకు వచ్చి కాపురము చేయువా[illegible] కొరకును చట్టములుచేయుట.

(15) ఓడలలో వెళ్లువారి యారోగ్యపరీక్ష, నావికాచికిత్సాలయముల నేర్పరచుట.

(16) యావద్భారతదేశమునకును సంబంధించిన ఉద్యోగములు, ప్రజాస్వామ్య ఉద్యోగనియామకసంఘము.

(17) ప్రజాస్వామ్యముయొక్క లెక్కలతనిఖీ.

(18) ప్రజాస్వామ్యము యొక్క సుప్రీమ్‌కోర్టు, ఉన్నతన్యాయస్థానములకు సంబంధించిన శాసనములు చేయుట.

(19) సివిల్‌చట్టము, దానిలో నంతర్భాగములగు ప్రతిపత్తి, కాంట్రాక్టు, ఆస్తి, సివిల్‌హక్కులు, బాధ్యతలు, సివిల్‌ప్రోసీజరు.

(20) శిక్షాస్మృతి, శిక్షాస్మృతుల అమలు, ఎవరి నేరస్థులను వారి కొప్పజెప్పుటకు సంబంధించిన చట్టములు.

(21) దివాలా.

(22) వివాహము, భార్యాభర్త లొండొరుల విడనాడుట, వివాహవిషయములు, తల్లిదండ్రుల కుండవలసిన హక్కులు, పసిపిల్లలసంరక్షణ, వారి హోదా యుక్తవయస్సు.

(23) కాపీరైట్లు, వార్తాపత్రికలు, గ్రంథములు, నూతన వస్తునిర్మాతలకు హక్కులు, సరకులు చేయువాడు వాటిపై తనకుగల హక్కు తెలియజేయుటకు వేసికొన్న గురుతులు, చిత్రములు, ట్రేడుమార్కులు.



(24) ప్రజాస్వామ్యముకొరకు భూమిని సంపాదించుట.

(25) పత్రములను, దస్తావేజులను రిజిస్టరుచేయుటకు చట్టములను చేయుట.

(26) చావులు, పుట్టుకలు, వివాహములు రిజిస్టరు చేయుట.

(27) జనాభా, లెక్కల వివరములు.

(28) ఆయుధములు, మందుగుండుసామగ్రిపై యధికారము.

(29) ౧ శిలాతైలము, (పెట్రోలియమ్) ప్రేలుడు సామగ్రిపై యధికారము.

౨ విషములపై యధికారము.

(30) తూకపురాళ్లు, కొలతమానము లేర్పరచుట.

(31) మూడుమైళ్ల కావల భారతదేశము నానుకొనియున్న సముద్రములో చేపలుపట్టుట.

(32) భారతదేశములో భూమికొలత, భూగర్భపరిశోధన, జ్యోతిశ్శాస్త్రపరిశోధన, వాతావరణశాస్త్రపరిశోధన.

(33) పార్లమెంటుసభల యెన్నికలు.

(34) ప్రజాస్వామ్య ప్రభుత్వముయొక్క రాజధాని పట్టణ నిర్ణయము.

(35) రాష్ట్రీములకును రాష్ట్రీములకును సంబంధించిన విషయములు.

(36) ఫ్యాక్టరీ చట్టనిర్మాణము.

(37) పారిశ్రామికవిషయములు :

౧ కార్మికుల క్షేమము.

౨ ప్రావిడెంటుఫండు.

3 పారిశ్రామిక భీమా, పారిశ్రామికుల ఆరోగ్యము, ప్రమాదములు సంభవించినప్పుడు చేయవలసిన సాహాయ్యము.

(38) గనులపై యధికారము.

(39) వైద్యుని కుండవలసిన యోగ్యతలు-విద్యా పరిమితి నిర్ణయించుట.

(40) ప్రజాస్వామ్యముయొక్క భాండారము, కాగితములు, కలములు మున్నగు వ్రాతసాధనములు.

(41) కేంద్రప్రకటనశాఖ, రహస్యవార్తాగ్రహణ శాఖ.



(42) జంతుశాస్త్రపరిశోధన, వృక్షశాస్త్రపరిశోధన, పురాతనవస్తుశాస్త్ర పరిశోధన.

(43) పరిశోధనకై ప్రతిష్ఠాపనలను నియమించుట, వివిధవ్యాపారములకుగాని, ఉద్యోగములకుగాని ప్రత్యేక శిక్షనొసంగు కళాశాలల స్థాపించుట.

(44) రాష్ట్రాధికారమునకు లోబడని ప్రదేశములను పునర్విభజించుట, మార్చుట దానికి సంబంధించిన చట్టములను ప్రకటించుట.

(45) ప్రజాస్వామ్యముయొక్క ఆస్తి.

(46) అడవులనుగురించి చట్టములుచేయుట.

(47) దస్తావేజుస్టాంపులు గాక తక్కినస్టాంపుల విషయమున చట్టములను చేయుట.

---

# రెండవ షెడ్యూలు

---

## రాష్ట్రప్రభుత్వములకు లోబడియున్న శాఖలు

(1) భూమిసిస్తు, మినహాయింపబడిన భూమిసిస్తుతో సహా; భూమిమీదగాని, భూమిమీదవచ్చు ఆదాయము మీదగాని వేయబడగల యితరపన్నులు; నీటితీరువ; సర్వే, సెటిల్‌మెంటు, పోరంబోకుభూములను ఆసామీలకిచ్చి వేయుట; ప్రభుత్వమువారి యెస్టేటులను పరిపాలించుట.

(2) ఎక్సైజు, అనగా కల్లు సారాయి మొదలగువానిని; నల్లమందుతప్ప తక్కినమత్తుపదార్థములను పండించుట, ఇతర దేశములకు పంపుట, స్వాధీనము, కొనుగోలు, అమ్మకము. ఈ పదార్థములమీదను, నిషేధింపదగిన యిట్టి పదార్థములమీదను ఎక్సైజుపన్నును విధించుట, లైసెన్సుల నిచ్చినందులకు రుసుము వసూలుచేయుట.

(3) సుంకములవంటిస్థానికపన్ను లన్నియు; మరియు భూమి సెస్సు లేక భూమిఖరీదుమీద సెస్సు, ఇండ్లమీద పన్ను; బండ్లమీద, పడవలమీద పన్ను; జంతువులమీద పన్ను, గేటువద్ద పుచ్చుకొనే పన్ను, ఒకప్రదేశమునుండి



యింకొకప్రదేశమునకు సరుకులను పంపునప్పుడు వసూలుచేయు సుంకములు, వ్యాపారము, ఉద్యోగము, వృత్తులమీద పన్ను; సొంతమార్కెటులమీదపన్ను, పత్రికాప్రకటనలమీదపన్ను, వినోదములమీదను, వేడుకలమీదను పన్ను, జూదములపైపన్ను, స్థానికప్రతిష్ఠాపనలు ప్రజలకు చేయు ఉపకారముకుగాను వసూలుచేయు పన్నులు.

(4) ఆయా రాష్ట్రములలో, రాష్ట్రీయప్రభుత్వములు సంపాదించుభూములు.

(5) అటవీపరిపాలనము, వేటమృగములరక్షణ.

(6) వ్యవసాయము, వ్యవసాయశాస్త్రమునకు సంబంధించిన పరిశోధనసంస్థలను నెలకొల్పుట, వస్తుపరీక్షపొలములను బాగుగాపండించువిధమును ప్రజలకు నిదర్శనపూర్వకముగా బోధించుటకు ప్రభుత్వమువారు స్వాయముగా పొలములను వ్యవసాయముచేయుట, పురుగుపట్టకుండ, తెగులు తగులకుండ పైరులను రక్షించుట.

(7) చేపలుపట్టు స్థలములు. (ప్రజాస్వామ్యాధికారమునకు లోబడియున్నవి తప్ప)

(8) నీటిసప్లయి, సాగుబడికై కాల్వలను త్రవ్వించుట, మురుగునీరుపోవు కాల్వలను త్రవ్వించుట, కాలువ

కట్టలు, నీటిని నిలువచేయుట, నీటినుండి వచ్చు విద్యుచ్ఛక్తి. (రాష్ట్రములకు లోబడియున్న వ్యవహారములును, ఒకరాష్ట్రమునకును స్వదేశసంస్థానమునకుగాని, యితర రాజ్యములకుగాని సంబంధించిన విషయములును తప్ప)

(9) రాష్ట్రములోని కట్టడములు, రోడ్లు, వంతెనలు, బల్లకట్లు, భూమిలోను కొండలలోను తొలచిన మార్గములు, పల్లపుభూములలో వేయబడు బరంతులు, కప్పీలమూలకముగా బొగ్గు మొదలగువాని నెత్తు సాధనములు, ట్రాంబట్లు, ముఖ్యమైన యినుపదారులకు చేర్చు శాఖాయినుపదారులు, నదులు, కాల్వలు మున్నగు ప్రయాణసౌకర్యములు, రాష్ట్రప్రజాసౌకర్యార్థము తలపెట్టు ఇతరకార్యములు. ఈ క్రిందివిషయములు తప్ప.

౧. భారతప్రభుత్వమునకు లోబడియున్న ఇనుపదారులు, రోడ్లు, కాల్వలు, నదులు మొదలగునవి.

౨. రాష్ట్రముయొక్క సరిహద్దులకు మించిపోయే పనులు.

3. రాష్ట్రములసరిహద్దులలోనేయున్నను, భారతదేశమున కంతటికిని ముఖ్యమని పార్లమెంటుసభ నిర్ణయించిన విషయములు.



(10) పరపతిసంఘములు.

(11) ఖనిజసంపత్తిని వృద్ధిచేసికొనుట.

(12) క్షామనివారణ.

(13) భారతదేశములో యాత్రలు జరుపుట.

(14) రాష్ట్రమునందలి స్థానికసంస్థలు, మునిసిపాలిటీలు, గ్రామపంచాయతీలు, అభివృద్ధికై యేర్పరుపబడిన ప్రతిష్ఠాపనలు, పట్టణనిర్మాణ సంఘములు, ఇత్యాదిస్థానిక ప్రభుత్వ ప్రతిష్ఠాపనలు. ఈ స్థానిక ప్రతిష్ఠాపనలలెక్కల తనిఖీ.

(15) వైద్యశాఖాపరిపాలన, దానికి సంబంధించిన చికిత్సాలయములను, ఔషధశాలలను, శరణాలయములను, వైద్యవిద్యాబోధనకళాశాలలను, ఏర్పరుచుట.

(16) విద్యాశాఖ, దానికి సంబంధించిన విశ్వవిద్యాలయస్థాపన, శిల్పవిద్యలను నేర్పు పాఠశాలలస్థాపన, వృత్తివిద్యను ప్రోత్సాహము చేయుట, అందుకై పాఠశాలలను స్థాపించుట.

(17) ప్రజారోగ్యము, పారిశుద్ధ్యము, మరణ లెక్కలు.

(18) కోర్టు ఆఫ్ వార్డ్సు, అప్పులపాలయిన ఆస్తిని పరిపాలించుట, జప్తుచేయబడిన భూస్థితులు.

(19) భూసారమును అభివృద్ధిచేయుట, వ్యవసాయముకొరకైన ఋణములు.

(20) భూమియొక్క అనుభవము, రహితులును, భూస్వాములునుపరస్పరము చేసికొను కవులు కబోలియెత్ సంబంధమైన యేర్పాటులు, సిస్తునిర్ణయచట్టములు.

(21) భారత శాసనసభాశాసనములకు లోబడి; అడ్మినిస్ట్రేటర్, ఆఫిషియల్ ట్రస్టీల నియామకము.

(22) పారిశ్రామికాభివృద్ధి; పారిశ్రామిక పరిశోధన.

(23) పోలీసుశాఖ, రాష్ట్రములుభరించు మిలిటరీ పోలీసు, ఆయుధపాణులగు పోలీసులు, రైల్వేపోలీసుదళములు. రైల్వేపోలీసుదళవిషయములో పోలీసు లెంతవరకు అధికారము చేయవచ్చునో, రైల్వేపోలీసులను భరించుటకు రైల్వేవా రెంత ధనము నియ్యవలెనో నిర్ణయించుచు భారతపార్లమెంటుసభవారు చేయు నిబంధనలకు రాష్ట్రీయప్రభుత్వములు లోబడి యుండవలెను.

(24) భోజనసామగ్రిలోను ఇతర వస్తువులలోను కల్తీ.

(25) ౧ బండ్లమీద్ధ అధికారము, మోటారు బండ్లవిషయమున, భారతదేశమునం దంతటి వర్తింపగల



లైసెన్సులయందు రాష్ట్రీయప్రభుత్వములు భారతప్రభుత్వమువారి యధికారమునకు లోబడియుండవలెను.

౨. నాటకప్రదర్శనములను, సినిమెటగ్రాఫుప్రదర్శనములను నియమించుటయం దధికారము.

(26) చెరసాలలు, ఖైదీలు, నేరస్థులకు నీతిబోధన చేయుటకు ఏర్పరచినపాఠశాలలు, దేశద్రిమ్మరితనము.

(27) వెనుకబడియున్నవారి యభివృద్ధి, వారికి నివాసము లేర్పరచుట.

(28) నిధినిక్షేపములు.

(29) రాష్ట్రములో న్యాయపరిపాలన, సివిల్, క్రిమినల్ అధికారముగల న్యాయస్థానముల నిర్మాణము, వానిని భరించుట.

(30) రాష్ట్రీయశాసనసభలకు ఎన్నికలు.

(31) రాష్ట్రమునకు సంబంధించిన శాసనములకు వ్యతిరేకముగా నడచుకొనినందులకు జరిమానాలు, దండన ఖైదు మొదలగుశిక్షలను విధించుచు చేయు చట్టములు.

(32) భారతప్రభుత్వమువారి యనుమతికి లోబడి రాష్ట్రములు తమ సొంతపలుకుబడిమీద ఋణములను చేయుట, రాష్ట్రముయొక్క ఆదాయము, ఆస్తి.

(33) జననములను, మరణములను వివాహములను రిజిస్టరుచేయుటకు సంబంధించిన చట్టముల నమలులో నుంచుట.

(34) రాష్ట్రీయ లా రిపోర్టులు.

(35) చిన్న రేవుపట్టణములు.

(36) కలకత్తా ఇంపీరియల్ లైబ్రరీ తప్ప తక్కిన పుస్తక భాండాగారములు, కలకత్తాలోని ఇండియన్ మ్యూజియమ్, ఇంపీరియల్ వార్ మ్యూజియమ్, విక్టోరియా మెమోరియల్ తప్ప తక్కిన చిత్రవస్తుప్రదర్శన శాలలు, జంతుప్రదర్శన శాలలు, తోటలు, మరియు సంఘములను రిజిస్టరుచేయుట.

(37) బందిలిదొడ్లు, గొడ్లను ఇతరుల స్థలములకు పోనియ్యకుండ చేయుట.

(38) జంతుచికిత్సాశాఖ, పశుచికిత్సయందు కుశలులగువారి శిక్షణకై తగు నేర్పాటులు చేయుట, పశుగణమును వృద్ధిచేయుట, పశువులకు రోగములు రాకుండ ముందు జాగ్రత్త పుచ్చుకొనుట.

(39) భారతశాసనసభవారిశాసనములకు లోబడి ఫ్యాక్టరీలపై నధికారము.

(40) కార్మిక వివాదములను పరిష్కరించుట.



(41) గ్యాస్, విద్యుచ్ఛక్తి.

(42) బాయిలర్లు.

(43) పొగబాధ.

(44) కార్మికులకు ఇండ్లు కట్టించుట.

(45) దుర్మరణ విచారణసంఘాధికారుల నియామకము.

(46) రాష్ట్రీయ భాండాగారము, వ్రాతసామగ్రి.

(47) రాష్ట్రీయప్రభుత్వ ముద్రణాలయము.

(48) రాష్ట్రీయోద్యోగములు, రాష్ట్రీయోద్యోగవిచారణసంఘము.

(49) రాష్ట్రీయప్రభుత్వ కార్యస్థానము.

(50) భారతప్రభుత్వమువారి నియామకములకు లోబడి, ఎన్నికలను జరపుట.

(51) కోర్టుఫీజు మున్నగు రుసుములు, మరణశాసనములపై రుసుములు, వారసత్వముపైనను ఆస్తిమీదను పన్నులు.

(52) భారతశాసనసభవారుచేయు శాసనములకు లోనై, సరకులను ఉత్పత్తిచేయుటకును, పంపకముచేయుటకును, అధికారము గలిగియుండుట.

(53) భారతశాసనసభవారు చేయు నిబంధనలకు లోనై, పరిశ్రమలను వృద్ధిచేసికొనుట.

(54) భారతశాసనసభవారుచేయు శాసనములకు లోనై దేవాదాయ ధర్మాదాయములను పరిపాలించుట.

(55) భారతశాసనసభవారి శాసనములకు లోనై జూదములాడుటను పందెములను వేయుటను నియమించుట.

(56) భారతశాసనసభవారి శాసనములకు లోబడి, పశువులయెడల క్రూరత్వమును ఆపివేయుట, అడవులయందలి మృగములను, పక్షులను రక్షించుట.

(57) భారతశాసనసభవారి శాసనములకు లోబడి, రాష్ట్రీయప్రభుత్వములకు దస్తావేజు స్టాంపులమీద అధికార ముండును. కోర్టుఫీజుస్టాంపులవిషయమున గూడ, ఉన్నతన్యాయస్థానముల 'ఒరిజినల్ సైడ్' అధికారములకు లోబడియున్న దావాలలోను, తీర్పులలోను విధింపబడే కోర్టుఫీజు మొత్తములలో, భారతశాసన సభాశాసనములకు లోబడి రాష్ట్రీయప్రభుత్వముల కధికారము లుండును.

(58) భారతశాసనసభవారి శాసనములకు లోబడి, దస్తావేజులను, పత్రములను రిజిస్టరుచేయుట.

(59) భారతశాసనసభవారి శాసనములకు లోబడి, తూకపురాళ్లను కొలతమానములను నిర్ణయించుట.



(60) భారతశాసనసభవారి యధికారమునకు లోబడి విషములపైని, యుద్ధపరికరములు, మందుగుండుసామగ్రులపైని; శిలాతైలము, ప్రేలుడుసామగ్రులపైని అధికారము.

(61) భారతశాసనసభవారి శాసనములకు లోబడి వార్తాపత్రికలపై నధికారము.

(62) భారతశాసనసభవారి యధికారములకు లోబడి, వైద్యవృత్తి నవలంబించుటకును, ఇతరవృత్తుల నవలంబించుటకును తగిన యోగ్యతలను, విద్యాపరిమితులను నిర్ణయించుట.

(63) స్థానికసంస్థల లెక్కలను తనిఖీచేయుట.

---

# ఒకటవ అనుబంధము

మతముల ననుసరించి పాంచాలమునందలి
జనాభా వివరములు

ఈ యనుబంధము పాంచాలమునందలి జనసంఖ్యా వివరములను దెల్పును. శాసనసభలో వివిధమతముల వారికి లభింపగల శాసన సభ్యత్వస్థానముల సంఖ్యను ప్రత్యేకముగా వివరించును.

ఈ యనుబంధము ఈ క్రింది యూహలపై నాధారపడియున్నది.

1. భూవైశాల్యము ననుసరించి జిల్లా కింద రని కాని, ఖండమున కింద రని కాని సభ్యుల నెన్నుకొను పద్ధతియుండును.(Territorial representation) సంయుక్త నియోజకవర్గము లుండునుగాని స్థానములను ప్రత్యేకించుట యుండదు.

2. మైనరులు కానివా రందరకు వోటింగు అధికార ముండును. లేదా వివిధసంఘములయందలి యెన్నికదారుల సంఖ్య వారివారి జనాభా ననుసరించు ఒకానొక వోటింగుపద్ధతిమీాద నైనను ఆధారపడి యుండును.



మొత్తము జనాభాలో, అత్యధికసంఖ్యగల సంఘములవారు నూటికెన్నింటను లున్నారో యీ సంఖ్యలు సూచించును. పచ్చరంగు వేసిన మండలములయందు మొత్తము జనాభాలో మహమ్మదీయులు నూటి కెన్నింటను లున్నారో తెలియజేయబడినది. ఎఱ్ఱరంగు వేసిన మండలములలో హిందువులును సిక్కులును కలసి నూటికెన్ని వంతులని తెలియజేయబడెది.

ఈ యనుబంధములలోని వివరములు 1921-వ సంవత్సరపు జనాభా లెక్కలమీద నాధారపడియున్నవి. ఐనను పాంచాలమునందు హిందువుల యభివృద్ధికంటె మహమ్మదీయులలో నభివృద్ధి హెచ్చుగానున్నదని చెప్పవలసియున్నది. మహమ్మదీయులలో నభివృద్ధి హెచ్చుగా నుండుటకు కారణము హిందువులు మహమ్మదీయమతమును స్వీకరించుటవలన గాదనియు మహమ్మదీయులలో విధవావివాహము లుండుటవలనను, బాల్యవివాహములు లేకుండుటవలనను, ఇత్యాది సాంఘిక కారణములవలన నని జనభా నివేదిక తెలుపుచున్నది. బాల్యవివాహములవలన హిందువులలో శిశువుల మరణసంఖ్య మహమ్మదీయులలో శిశువుల మరణసంఖ్యకంటె హెచ్చుగా నున్నది. కావున ఈనాడు పాంచాలములోని మహమ్మదీయుల సంఖ్య 1921-వ సంవత్సరమున నున్న జనాభాకంటె కొంచెము హెచ్చుగా నుండును. రాబోవు జనాభా లెక్కలీ భేదమును స్పష్టముగా ప్రకటింపగలవు. కావున 1921-వ సంవత్సరపుజనాభా లెక్కల ననుసరించి మేము నిర్ణయించిన సభ్యత్వస్థానములు వారికి నిజముగావచ్చు స్థానములకంటెతక్కువగానే అంచనా వేయబడినవి. వారి జనాభా వృద్ధిమైనది గనుక వారి కింకను కొన్ని స్థానములు లభించుట నిశ్చయము.

జనాభానివేదికలలోని లెక్కల ననుసరించి శాసన సభలోని ప్రాతినిధ్యమును సరిగా నిర్ణయించుట సాధ్యము కాదు. చాలమట్టుకు శాసనసభాప్రాతినిధ్యము నియోజక వర్గముల యేర్పాటుమీద నాధారపడి యుండును. సంయుక్త నియోజకవర్గములలో హిందువుడు హిందువునకే వోటు నిచ్చుననియు, మహమ్మదీయుడు మహమ్మదీయునికే వోటు నిచ్చుననియు నిశ్చయముగా చెప్పజాలము. కోరదగినదికూడ కాదు. మా గుణకారములలో నిట్టివానినిమేము పరిగణింప వీలుకాదు. కేవల సాంఘికపద్ధతులమీదనే ఈ సమస్యను చర్చించుచున్నాము గాన సాంఘికాభిమానముమీదనే యందరును వోట్ల నిచ్చెదరని తలంపవలెను. నియోజకవర్గము లేర్పడలేదు గావున ప్రతిజిల్లాకు జనాభా వివరములను, వానినిబట్టి ఆయాజిల్లాలకు లభించు శాసన సభ్యత్వస్థానములను నిర్ణయింపవలెను. ఒకజిల్లాగాని, జిల్లాలో నొకభాగముగాని ఒక నియోజక వర్గముగా చేయబడవచ్చును.

పాంచాలములోని జనాభా (సంస్థానములుగాక) 1921-వ సంవత్సరమున నీ క్రిందివిధముగా నుండెను.

| | | | |
|---|---|---|---|
| మహమ్మదీయులు | 1,14,44,321 | ... | 55.3% |
| హిందువులు | 65,79,260 | ... | 31.8% |
| సిక్కులు | 22,94,207 | ... | 11.1% |



| | | | |
|---|---|---|---|
| ఇతరులు (హెచ్చుగా క్రైస్తవులు) | 3,67,236 | ... | 1.8% |
| వెరసి | 2,06,86,024 | ... | 100% |

ఈ పై సంఖ్యలవలన మహమ్మదీయు లితరులందరికన్నను చాల హెచ్చుగా లేకపోయినను, కొంచెము హెచ్చుగా నున్నారని తెలియగలదు. పాంచాలములోని జనసంఖ్య విభాగముల నింకకొంచెము జాగరూకతతో విచారించితిమేని పాంచాలమునందలి మొత్తముజనాభా ననుసరించి వారి కుండదగిన ప్రాబల్యముకంటె హెచ్చు ప్రాబల్యము వారి కున్నదని తేటపడగలదు. ప్రస్తుత సమయమున రాష్ట్రమునకు దక్షిణమున—అంబాలా జలంధరు డివిజనులలో హిందువులును సిక్కులును హెచ్చుగా నుండుటయే దీనికి కారణము. ఈ రెండుడివిజనులలోను మహమ్మదీయులు అల్పసంఖ్యాకులుగా నున్నారు. కాని యితరస్థలములయందు వారిజనాభా హెచ్చుగా నుండుట వలన ఈ లోపమును వారు తీర్చుకొనుచున్నారు.

పాంచాలమును హెచ్చుతగ్గుగా మూడు నైసర్గిక విభాగములుగా విభాగింపవచ్చును. 1. మహమ్మదీయులు చాలహెచ్చుగానున్నవిభాగము. 2. ఇద్దరు నించుమించుగా సమానముగానుండి మహమ్మదీయులే కొంచెము హెచ్చుగానున్న భాగము. 3. హిందూసిక్కువిభాగము. ప్రస్తుత డివిజనులను ఈక్రింది పరగణాలక్రింద విభజింపవచ్చును.

1 రావల్‌పిండి, ముల్టాన్ డివిజనులు మహమ్మదీయపరగణాలో చేరును. ఇచ్చట మహమ్మదీయులు చాల హెచ్చుగా నున్నారు. [రావల్‌పిండిలో 86.9%, ముల్టాన్‌లో 76.9%.]

11 లాహోర్ డివిజన్. ఇచ్చట హిందువులును మహమ్మదీయులును కొంచెము హెచ్చుతగ్గుగా సమానమే కాని, మహమ్మదీయులే హెచ్చు.

111 అంబాలా, జలంధరు జిల్లాలు. ఇవి హిందూసిక్కుపరగణాగా విభజింతుము. మహమ్మదీయు లిచ్చట స్వల్పసంఖ్యాకులుగా నున్నారు. [అంబాలాలో 26.3%, జలంధరులో 32.8%]

ఈసాంఘిక పరగణాల ననుసరించి శాసనసభలలో ప్రాతినిధ్యమును కొంచెము హెచ్చుతగ్గుగా నిర్ణయింపవచ్చును. నూరువేల ప్రజల కొక్క సభ్యుడైనచో ఈ క్రిందనిచ్చిన సభ్యత్వస్థానములు వారికి లభించును.

| | పాంచాలముయొక్క జనాభా | జనాభా వేలలో | శాసనసభ్యుల సంఖ్య | |
|---|---|---|---|---|
| | మొత్తము | 20,685 | 207 | |
| i | రావల్‌పిండి డివిజన్ | 3,461 | 35 | 77 |
| | ముల్టాన్‌డివిజన్ | 4,218 | 42 | |
| ii | లాహోర్ డివిజన్ | 4,997 | 50 | 50 |
| iii | అంబాలాడివిజన్ | 3,827 | 38 | 80 |
| | జలంధర్ డివిజన్ | 4,182 | 42 | |
| | | | | 207 |



మహమ్మదీయులు మహమ్మదీయ పరగణాలలో నన్నిస్థానములను ఆక్రమించుకొందు రనియు, హిందూసిక్కులు హిందూసిక్కు పరగణాలలో నన్నిస్థానములను ఆక్రమించుకొందు రనియు తలచెదము. లాహోర్ డివిజనులో నిద్దరు స్థానములను పంచుకొనవచ్చును. ఇది సంపూర్ణముగా నిట్లుజరుగదు జరుగకూడదు. ప్రతి డివిజనులో నెన్నుకొనబడువా రందరు ఒక్క సంఘమునకు జెందియుండుట కోరదగినది కాదు. హెచ్చు తగ్గుగా మనము గుణించుచున్నప్పుడు, హిందూసిక్కు పరగణాలో మహమ్మదీయులకు వచ్చు స్థానములును, మహమ్మదీయ పరగణాలో హిందూసిక్కులకు వచ్చు స్థానములును సరిపోవు నని తలంపవచ్చును. నిజ మాలోచించిన యెడల మహమ్మదీయులకు హిందూసిక్కు పరగణాలో కొద్దిస్థానములు లభించుట వీలగునేమో కాని, మహమ్మదీయ పరగణాలో హిందూసిక్కులకు చొరవ గలుగుట యసంభవము. రావల్‌పిండి మూల్టాన్ జిల్లాలలో మహమ్మదీయులు చాల హెచ్చుగా నున్నారు. [86.0%,76.9%]

కావున పైసంఖ్యలవలన తేలినసారాంశ మేమి ? మహమ్మదీయులకు వారి పరగణాలో 80 స్థానములు తప్పవు. హిందూ సిక్కులకు వారి పరగణాలో 77 స్థానములు వచ్చును. మూడవ పరగణాలో—లాహోర్ డివిజన్—ఇద్దరికి స్థానములు లభించును గాని మహమ్మదీయులకే హెచ్చుస్థానములు లభించుటకు అవకాశము లున్నవి. వారు జనాభాలో నూటికి 57.0 చొప్పున నున్నారు. హిందువులు 20.7%, సిక్కులు 16.2% ను ఉన్నారు. క్రైస్తవాదులు 6.%. క్రైస్తవాదుల విషయమున నిచ్చట నేమియు చెప్పనవసరము లేదు. వారికి మహమ్మదీయులయెడ విరుద్ధభావ మేమియు నుండు నని తలంప వీలులేదు. వారిని హిందూసిక్కులతో కలుపుటకు గూడ కారణములులేవు. కావున నీపరగణాలోమహమ్మదీయులు హిందువులకన్న $1\frac{1}{2}$ వంతు లున్నారు. భేదము చాల నున్నది గాన, ఎన్నికలలో నీభేదము తప్పక కనబడును. జనాభా ననుసరించి న్యాయముగా రాదగిన స్థానముల కంటె మహమ్మదీయులకు సామాన్యముగా హెచ్చుస్థానములు లభింపవలెను. కాని జనాభా ననుసరించియే స్థానములు వచ్చునని తలచినను వారికి 29 స్థానములు వచ్చును. వారికి మహమ్మదీయ పరగణాలో రాదగిన స్థానములకు దీనిని కలిపినయెడల వారికి లభించు స్థాన



ములు 106. శాసనసభలో మొత్తము స్థానములసంఖ్య 207 గనుక వారికి ఇతరసంఘము లన్నిటికంటె హెచ్చు స్థానములు లభించును. అల్పసంఖ్యాకులలో 'ఇతరులు' గూడ చేరియుందురుగనుక, హిందూ-సిక్కులకంటె మహమ్మదీయులకు చాల హెచ్చుస్థానములు లభించును.

హిందువుల శ్రేయమును సిక్కుల శ్రేయమును ఒక్కటే యనియు, అన్నివేళలయందు వారు కలసియే యుందు రనియు తలచుటవలన పై ఫలితములు గలిగినవి. ఇట్టియూహ కవకాశ మేమియు గానరాదు. అన్నివేళలయందు వారు కలసి వోట్లనిత్తురనుట యసంభవము. వారు కలసి ప్రతినిధుల నెన్నుకొననిచో అధికసంఖ్యాకు లగు మహమ్మదీయులముందు అత్యల్పసంఖ్యాకు లగు హిందువుల యొక్కయు, సిక్కుల యొక్కయు దౌర్బల్యము ఇంకను పరిస్ఫుటముగా నగపడును.

లాహోర్ డివిజనులోని స్థితిగతులు చాల క్లిష్టముగానుండవచ్చును గనుక ఈసమస్య నింక కొంతవివరముగా నాలోచించెదము. ఈ డివిజనులోని ఆరుజిల్లాలలో మూడు జిల్లాలయందు—సైలుకోట్, గుజరన్‌వాలా, షేక్‌పూరా, మహమ్మదీయు లత్యధిక సంఖ్యాకులుగా నున్నారు. ఈ జిల్లాలలో 'ఇతరులు' [క్రైస్తవాదులు] గూడ చాలమంది యున్నారు. కనుక, వీరిని హిందూ

సిక్కు జనాభానుండి మినహాయించిన యెడల మహమ్మదీయుల యాధిక్యము మరింత హెచ్చును.

ఈ వివరములను గమనింప దగును.

| సెయిల్ కోట్ జిల్లా | | స్థానములు |
|---|---|---|
| మహమ్మదీయులు | 61.9% | |
| హిందువులు | 19.5% | |
| సిక్కులు | 8.0% | $9\frac{1}{2}$ |
| ఇతరులు | 10.5 | |

హిందువులును సిక్కులును కలసి 27.5% ఉన్నారు. మహమ్మదీయులు 61.9% ఉన్నారు. కావున మహమ్మదీయులు హిందూ సిక్కు జనాభాకంటె రెండింతలకన్న హెచ్చుగా నున్నారు.

| గుజరన్‌వాలా జిల్లా | | స్థానములు |
|---|---|---|
| మహమ్మదీయులు | 71.0% | |
| హిందువులు | 15.8% | |
| సిక్కులు | 8.2% | $6\frac{1}{4}$ |
| ఇతరులు | 5.1% | |

ఈ జిల్లాలో హిందువులు సిక్కులు కలసి 24.0% మహమ్మదీయులు 71.1% కావున మహమ్మదీయులు హిందూసిక్కుజనాభాకన్న దాదాపు మూడింతలున్నారు.



| షేక్‌పురాజిల్లా | | స్థానములు |
|---|---|---|
| మహమ్మదీయులు | 63.3% | |
| హిందువులు | 16.0% | |
| సిక్కులు | 15.9% | $5\frac{1}{4}$ |
| ఇతరులు | 4.8% | |

ఈజిల్లాలో హిందువులు సిక్కులు కలసి 31.9% మహమ్మదీయులు 63.3%. కావున మహమ్మదీయులు హిందూ సిక్కుజనాభాకన్న రెండింత లున్నారు.

ఈమూడుజిల్లాలలో మహమ్మదీయు లతిబలాఢ్యులై యున్నారు. ఈమూడుజిల్లాలు నిజముగా మహమ్మదీయ పరగణాతో కలుపబడవలసినది. ఈజిల్లాలు మూడును కలసి శాసనసభకు 21 సభ్యులను పంపగలుగును. ఈ సభ్యులను 77 తో కలిపినచో 98 గురుసభ్యులు మహమ్మదీయపరగణానుండియే పంపబడుదురు.

లాహోర్ డివిజనులో నితరజిల్లాలస్థితి యీ క్రింది విధముగా నున్నది.

| లాహోర్ జిల్లా | | స్థానములు |
|---|---|---|
| మహమ్మదీయులు | 57.3% | |
| హిందువులు | 21.5% | |
| సిక్కులు | 15.9% | 11 |
| ఇతరులు | 5.3% | |

ఇచ్చట హిందూసిక్కుజనాభా 37.4%. మహమ్మదీయజనాభా 57.3%. ఉత్తరజిల్లాలలో హిందువుల కన్న మహమ్మదీయు లున్నంత హెచ్చుగా నిచ్చట లేక పోయినను, హెచ్చుగానే యున్నారు. మహమ్మదీయులు హిందూ సిక్కుజనాభాకన్న 1½ వంతులకన్న హెచ్చుగా నున్నారు.

| అమృతసరముజిల్లా | | స్థానములు |
|---|---|---|
| మహమ్మదీయులు | 45.6% | |
| హిందువులు | 21.6% | |
| సిక్కులు | 30.9% | 9 |
| ఇతరులు | 1.8% | |

ఈజిల్లాలో హిందువులు సిక్కులు కలసి 52.5%. మహమ్మదీయులు 45.6%. కావున హిందూసిక్కు లిచ్చట కొంచెము హెచ్చుగా నున్నారు.

| గురుదాస్ పూర్ జిల్లా | | స్థానములు |
|---|---|---|
| మహమ్మదీయులు | 49.6% | |
| హిందువులు | 26.9% | |
| సిక్కులు | 16.2% | 8½ |
| ఇతరులు | 8.2% | |

ఇచ్చట మహమ్మదీయులు హిందూసిక్కుజనాభా కంటె హెచ్చుగా నున్నారు. మహమ్మదీయులు 49.%



హిందూసిక్కులు 42.2%. కాని హెచ్చుతారతమ్యము లేదు. అమృతసరములోని స్థితిగతు లిచ్చట తారుమారైనవి. ఇచ్చట ఇతరులుగూడ విశేషముగా నున్నారు.

కావున సీమూడు జిల్లాలలో మహమ్మదీయులు లాహోర్ జిల్లాలో బలీయముగాను, గురుదాస్‌పూర్‌లో సామాన్యముగాను, అమృతసరములో బలహీనస్థితియందును ఉన్నారు. గురుదాస్‌పూరుజిల్లాయందైనను మహమ్మదీయులు ప్రత్యేకముగా హిందువులకన్నను, సిక్కులకన్నను హెచ్చుగా నున్నారు.

ఈ జిల్లాలలో, తప్పకుండ లాహోర్‌లో మహమ్మదీయులు కొన్నిస్థానములను సంపాదించెద రనుట నిశ్చయము.

కావున లాహోర్ జిల్లానుండి చాలమంది సభ్యులెన్నుకొనబడెదరు. ఈసంఖ్యను మహమ్మదీయ పరగణా ప్రతినిధుల సంఖ్యతో కలిపినయెడల శాసనసభలో వారికి ఆధిక్యమే గలుగును.

ఈ సమస్యను ఇంకొకవిధమున విచారింప వచ్చును. డివిజనులవారీగా నాలోచింపక జిల్లాలవారీగా విచారింపవచ్చును. ఇట్లయినచో ఫలితములు మరింత స్పష్టముగా తెలియగలవు.

పాంచాలములో 29 జిల్లాలు గలవు. వీనిని నాల్గు పరగణాలుగా విభజింపవచ్చును (1) మహమ్మదీయులు అత్యధిక సంఖ్యాకులుగానున్న భాగము. మహమ్మదీయుల బలిమి యిచ్చట అభేద్యము; (2) రెండవవిభాగమున మహమ్మదీయులు హెచ్చుగా నున్నారు గాని మొదటివిభాగములో నున్నంత హెచ్చుగా లేరు; (3) ఈ విభాగమున నేసంఘమును ఆధిక్యము వహించియుండలేదు; (4) ఈ విభాగములో **హిందువులును** సిక్కులును మహమ్మదీయులకంటె హెచ్చుగా నున్నారు.

I మహమ్మదీయులు అత్యధికముగానున్న జిల్లాలు.



| జిల్లా | నూటికి మహమ్మదీయులసంఖ్య | శాసనసభలో సభ్యులు |
|---|---|---|
| (1) గుజ్రాత్ | 86.2 | 8 |
| (2) షాపూర్ | 82.8 | 7 |
| (3) జీలమ్ | 88.7 | 5 |
| (4) రావల్పిండి | 82.6 | 6 |
| (5) అటక్ | 90.9 | 5 |
| (6) మియాన్ వలి | 86.3 | 4 |
| (7) మాంటిగ్ జామరి | 71.8 | 7 |
| (8) లయల్పురము | 60.7 | 10 |
| (9) ఝుంకగ్ | 83.3 | 6 |
| (10) ముల్టాన్ | 82.2 | 9 |
| (11) ముజఫర్ ఘర్ | 86.8 | 5½ |
| (12) డేరాగాజీఖాన్ | 88.3 | 5 |
| (13) సెయిల్ కోట్ | 61.9 | 9½ |
| (14) గుజరన్ వాలా | 71.0 | 6 |
| (15) షేక్ పురా | 63.3 | 5 |
| | | 98 |

II. మహమ్మదీయులు అధికముగా నున్న జిల్లాలు

| | | |
|---|---|---|
| (1) లాహోర్ | | సభ్యుల |
| హిందువులు | 21.5 | |
| మహమ్మదీయులు | 57.3 | 11 |
| సిక్కులు | 15.9 | |
| ఇతరులు | 5.3 | |
| (2) గురుదాస్ పూర్ | | సభ్యుల |
| హిందువులు | 26.0 | |
| మహమ్మదీయులు | 49.6 | |
| సిక్కులు | 16.2 | 8½ |
| ఇతరులు | 8.2 | |
| | | 19½ |

III. ఎవరును అధికులుగా లేనివిభాగము

(1) జలంధర్

| | | సభ్యులు |
|---|---|---|
| హిందువులు | 29.4 | |
| సిక్కులు | 25.1 | 8 |
| మహమ్మదీయులు | 44.5 | |
| ఇతరులు | 1.0 | |

(2) ఫీరజ్ పూర్

| | | సభ్యులు |
|---|---|---|
| హిందువులు | 27.6 | |
| సిక్కులు | 27.6 | 11 |
| మహమ్మదీయులు | 43.9 | |
| ఇతరులు | 0.9 | |

(3) అమృతసరము

| | | సభ్యులు |
|---|---|---|
| హిందువులు | 21.6 | |
| సిక్కులు | 30.9 | 9 |
| మహమ్మదీయులు | 45.6 | |
| ఇతరులు | 1.8 | |
| | | 28 |

ఈమూడుజిల్లాలలోకూడ మహమ్మదీయులు హిందువులకన్నను సిక్కులకన్నను హెచ్చుగానున్నారు.



IV హిందువులును సిక్కులును చాల హెచ్చుగానున్న పరగణా

| | | | | |
|---|---|---|---|---|
| (1) | హిస్సార్ | హిందువులు | 66.1 | ... 7 |
| (2) | రోటక్ | " | 78.0 | ... 8 |
| (3) | జర్గాన్ | " | 66.7 | ... 8 |
| (4) | కార్నల్ | " | 67.5 | ... 8 |
| (5) | అంబాలా | " | 53.8 | ... 7 |
| (6) | సిమ్లా | " | 71.2 | ... $\frac{1}{2}$ |
| (7) | కంగ్రా | " | 94.0 | ... 8 |
| (8) | హోషియార్ పూర్ | " | 53.3 | ... 9 |
| (9) | లూధియానా | హిందువులు | 23.6 | |
| | | సిక్కులు | 41.5 | 6 |
| | | మహమ్మదీయులు | 34.0 | |
| | | ఇతరులు | .9 | |

దీని ప్రకారము మహమ్మదీయులు అత్యధికముగా నున్న 15 జిల్లాలనుండి వారికి లభించు స్థానములు 98

హిందువులకు హిందూపరగణానుండి లభించు స్థానములు $61\frac{1}{2}$

హెచ్చుగా మహమ్మదీయు లున్న రెండుజిల్లాలనుండి మొత్తము స్థానములు $19\frac{1}{2}$

హిందువులును మహమ్మదీయులును హెచ్చుతగ్గుగా సమానముగానున్నను ప్రత్యేకముగా హిందువులకన్నను సిక్కులకన్నను మహమ్మదీయులు కొంచెము హెచ్చుగానున్న జిల్లాలనుండి 28

వెరసి స్థానములు 207

ఈ మొత్తము 207 సభ్యులలో 104 సభ్యులున్న యెడల హెచ్చుసంఖ్య లభించును.

ఈ పై వివరములవలన తేలిన సారాంశ మీక్రింద పొందుపరుచుచున్నాము.

1. మహమ్మదీయులు చాల హెచ్చుగానున్న పరగణానుండి మహమ్మదీయులు 98 స్థానములు అనగా శాసనసభలోని మొత్తము స్థానములలో 47.3
2. హిందూ సిక్కులు హెచ్చుగానున్న విభాగమునుండి హిందువులకు సిక్కులకు కలసి సభలో మొత్తము స్థానములలో 29.8
3. మహమ్మదీయులు హెచ్చుగానున్న రెండు జిల్లాలలో సభలో మొత్తముస్థానముల సంఖ్య 19½ అనగా 9.4



4. వివిధ సంఘములవారు హెచ్చు తగ్గుగా సమానముగా నుండి మహమ్మదీయులే ప్రత్యేకముగాహిందువులకన్నను మహమ్మదీయులకన్నను హెచ్చుగానున్న మూడు జిల్లాలు కలసిన విభాగమునుండి సభలో మొత్తము స్థానములలో 28 స్థానములు అనగా 13.5

స్థానములు 100

మూడవవిభాగమునందుమహమ్మదీయులు హెచ్చుగానున్నారు గాన దానినుండి 19½ స్థానములలో పదియైనను మహమ్మదీయులకు లభించును. వారికి తప్పకుండ తమ పరగణానుండి వచ్చెడి 98 స్థానములతో కలిపిన యెడల 108 స్థానములు వారికి లభించును. హెచ్చు సంఖ్యకు రావలసినది 104 గనుక వారికి హెచ్చుసంఖ్య లభించినది. మూడవ విభాగమునందుగూడ వారు సిక్కులకంటెను హిందువులకంటెను హెచ్చుగాన వారికి కొన్ని స్థానములు లభింపవచ్చును. 28 స్థానములలో 12 స్థానములైనను వారు ఆశింపవచ్చును. వీనిని కలుపుకొనిన 120 స్థానములు వారికి లభించును. అనగా నూటికి 58% కావున నెంత తక్కువగా అంచనా వేసినను వారికి నూటికి 58 స్థానములు లభించును.

## పాంచాలము (బ్రిటిష్ పరిపాలితము) జనాభా వివరములు

### పాంచాలము

| | |
|---|---|
| మొత్తము జనాభా | 2,06, 85, 024... 100% |
| మహమ్మదీయులు | 1,14, 44, 321...55.3% |
| హిందువులు | 65, 79, 260...31.8% |
| సిక్కులు | 22, 94, 207...11.1% |
| ఇతరులు (ముఖ్యముగా క్రైస్తవులు) | 3, 67, 236...1.8% |

## పాంచాలములోని డివిజనులు (వేలలో జనాభా వివరములు)

| అంబాలాడివిజన్ | జనాభా | నూటికి | లక్షకొక సభ్యుడు చొప్పున సభ్యులు |
|---|---|---|---|
| మొత్తము | 3827 | 100 | |
| హిందువులు | 2556 | 66.6 | |
| మహమ్మదీయులు | 1006 | 26.3 | 38 |
| సిక్కులు | 158 | 4.2 | |
| ఇతరులు | 106 | 2.8 | |

| జలంధరుజిల్లా | | | |
|---|---|---|---|
| మొత్తము | 4128 | 100 | |
| హిందువులు | 1893 | 45.0 | |
| మహమ్మదీయులు | 1370 | 32.8 | 42 |
| సిక్కులు | 880 | 21.0 | |
| ఇతరులు | 40 | 0.9 | |



| జిల్లా | వేలలో జన సంఖ్య | నూటికి | శాసనసభల లో సభ్యులు |
|---|---|---|---|
| **లాహోర్ డివిజన్** | | | |
| మొత్తము | 4497 | 100 | |
| హిందువులు | 1033 | 20.7 | |
| మహమ్మదీయులు | 2849 | 57.0 | 50 |
| సిక్కులు | 813 | 16.2 | |
| ఇతరులు | 303 | 6.1 | |
| **రావల్పిండి డివిజన్** | | | |
| మొత్తము | 3461 | 100 | |
| హిందువులు | 296 | 8.5 | |
| మహమ్మదీయులు | 2973 | 86.0 | 35 |
| సిక్కులు | 153 | 4.4 | |
| ఇతరులు | 38 | 1.1 | |
| **ముల్టాన్ డివిజన్** | | | |
| మొత్తము | 4218 | 100 | |
| హిందువులు | 602 | 14.3 | |
| మహమ్మదీయులు | 3246 | 76.9 | 42 |
| సిక్కులు | 290 | 6.9 | |
| ఇతరులు | 80 | 1.9 | |

## I. పాంచాలములోని జిల్లాలు

### మహమ్మదీయులు చాల హెచ్చుగానున్న జిల్లాలు

| జిల్లా | వేలలో జన సంఖ్య | నూటికి | శాసనసభలలో సభ్యులు |
|---|---|---|---|
| (1) గుజ్రాత్ | | | |
| మొత్తము | 824 | 100 | |
| హిందువులు | 59 | 7.2 | |
| మహమ్మదీయులు | 710 | 86.2 | 8.2 |
| సిక్కులు | 49 | 6.0 | |
| ఇతరులు | 6 | 0.7 | |
| (2) షాపూర్ | | | |
| మొత్తము | 720 | 100 | |
| హిందువులు | 79 | 1.1 | |
| మహమ్మదీయులు | 596 | 82.8 | 7.2 |
| సిక్కులు | 30 | 4.2 | |
| ఇతరులు | 15 | 2.1 | |
| (3) జీలమ్ | | | |
| మొత్తము | 477 | 100 | |
| హిందువులు | 33 | 6.9 | |
| మహమ్మదీయులు | 423 | 88.7 | 4.8 |
| సిక్కులు | 19 | 4.0 | |
| ఇతరులు | 2 | 0.4 | |



| జిల్లా | వేలలో జన సంఖ్య | నూటికి | శాసనసభలలో సభ్యులు |
|---|---|---|---|
| (4) రావల్పిండి | | | |
| మొత్తము | 569 | 100 | |
| హిందువులు | 55 | 9.7 | |
| మహమ్మదీయులు | 470 | 82.6 | 5.7 |
| సిక్కులు | 32 | 5.6 | |
| ఇతరులు | 12 | 2.1 | |
| (5) అటక్ | | | |
| మొత్తము | 512 | 100 | |
| హిందువులు | 25.5 | 5.0 | |
| మహమ్మదీయులు | 465.5 | 90.9 | 5.1 |
| సిక్కులు | 20 | 3.9 | |
| ఇతరులు | 1 | 0.2 | |
| (6) మియాన్వలి | | | |
| మొత్తము | 358 | 100 | |
| హిందువులు | 45 | 12.6 | |
| మహమ్మదీయులు | 309 | 86.3 | 3.6 |
| సిక్కులు | 3 | 0.8 | |
| ఇతరులు | 1 | 0.3 | |

| జిల్లా | వేలలో జన సంఖ్య | నూటికి | శాసనసభలలో సభ్యులు |
|---|---|---|---|
| (7) మాంటుగోమరీ | | | |
| మొత్తము | 714 | 100 | |
| హిందువులు | 92 | 12.9 | |
| మహమ్మదీయులు | 513 | 71.8 | 7.1 |
| సిక్కులు | 96 | 13.4 | |
| ఇతరులు | 13 | 1.8 | |
| (8) లయల్‌పూర్ | | | |
| మొత్తము | 980 | 100 | |
| హిందువులు | 177 | 18.1 | |
| మహమ్మదీయులు | 595 | 60.7 | 9.8 |
| సిక్కులు | 161 | 16.4 | |
| ఇతరులు | 47 | 4.8 | |
| (9) జంగ్ | | | |
| మొత్తము | 570 | 100 | |
| హిందువులు | 84 | 14.7 | |
| మహమ్మదీయులు | 475 | 83.3 | 5.7 |
| సిక్కులు | 9 | 1.6 | |
| ఇతరులు | 2 | 0.4 | |



| జిల్లా | వేలలో జన సంఖ్య | నూటికి | శాసనసభలలో సభ్యులు |
|---|---|---|---|
| (10) ముల్తాన్ | | | |
| మొత్తము | 890 | 100 | |
| హిందువులు | 129 | 14.5 | |
| మహమ్మదీయులు | 732 | 82.2 | 8.9 |
| సిక్కులు | 18 | 2.0 | |
| ఇతరులు | 11 | 1.2 | |
| (11) ముజఫర్‌ఘర్ | | | |
| మొత్తము | 568 | 100 | |
| హిందువులు | 66 | 11.6 | |
| మహమ్మదీయులు | 493 | 86.8 | 5.7 |
| సిక్కులు | 5 | 0.9 | |
| ఇతరులు | 4 | 0.7 | |
| (12) డేరాగాజీఖాన్ (బిలోచ్ పరగణా కలుపుకొని) | | | |
| మొత్తము | 496 | 100 | |
| హిందువులు | 54 | 10.9 | |
| మహమ్మదీయులు | 438 | 88.3 | 5.0 |
| సిక్కులు | 1 | 0.2 | |
| ఇతరులు | 3 | 0.6 | |

| జిల్లా | వేలలో జన సంఖ్య | నూటికి | శాసనసభలలో సభ్యులు |
|---|---|---|---|
| (13) సైల్‌కోట్ | | | |
| మొత్తము | 938 | 100 | |
| హిందువులు | 183 | 19.5 | |
| మహమ్మదీయులు | 581 | 61.9 | 9.4 |
| సిక్కులు | 75 | 8.0 | |
| ఇతరులు | 99 | 10.5 | |
| (14) గుజరన్‌వాలా | | | |
| మొత్తము | 623 | 100 | |
| హిందువులు | 98 | 15.8 | |
| మహమ్మదీయులు | 443 | 71 | 6.2 |
| సిక్కులు | 51 | 8.2 | |
| ఇతరులు | 31 | 5.1 | |
| (15) షేక్‌పూరా | | | |
| మొత్తము | 523 | 100 | |
| హిందువులు | 84 | 16.0 | |
| మహమ్మదీయులు | 331 | 63.3 | 5.2 |
| సిక్కులు | 83 | 15.9 | |
| ఇతరులు | 25 | 4.8 | |
| 15) జిల్లా | | | 97.6 |



## II హెచ్చుగా మహమ్మదీయులున్న జిల్లాలు

ఈ పరగణాలలో మహమ్మదీయులు, హిందువులు సిక్కులు కలసిన జనాభాకంటె హెచ్చుగా నున్నారుగాని మొదటి భాగములో నున్నంతమంది లేరు.

| జిల్లా | వేలలో జన సంఖ్య | నూటికి | శాసనసభలలో సభ్యులు |
|---|---|---|---|
| (1) లాహోర్ | | | |
| మొత్తము | 1131 | 100 | |
| హిందువులు | 243 | 21.5 | |
| మహమ్మదీయులు | 648 | 57.3 | 11.3 |
| సిక్కులు | 180 | 15.9 | |
| ఇతరులు | 60 | 5.3 | |
| (2) గురుదాస్‌పూర్ | | | |
| మొత్తము | 852 | 100 | |
| హిందువులు | 222 | 26.0 | |
| మహమ్మదీయులు | 423 | 49.6 | 8.5 |
| సిక్కులు | 137.5 | 16 2 | |
| ఇతరులు | 69.5 | 8.2 | |
| 2 జిల్లాలు | | | 19.8 |

III ఏసంఘముగూడ హెచ్చుగా లేదుగాని ప్రత్యేకముగా హిందువులకంటె, సిక్కులకంటె మహమ్మదీయులు హెచ్చుగా నున్న జిల్లాలు

1 జలంధర్

| | | | సభ్యులు |
|---|---|---|---|
| మొత్తము | 822.5 | 100 | |
| హిందువులు | 242 | 29.4 | |
| మహమ్మదీయులు | 366.5 | 44.5 | 8.2 |
| సిక్కులు | 206 | 25.1 | |
| ఇతరులు | 8 | 1.0 | |

2. ఫిరోజ్‌పూర్

| | | | |
|---|---|---|---|
| మొత్తము | 1088 | 100 | |
| హిందువులు | 303 | 27.6 | |
| మహమ్మదీయులు | 482 | 43.9 | 11 |
| సిక్కులు | 303 | 27.6 | |
| ఇతరులు | 10 | 9 | |

3. అమృతసరము

| | | | |
|---|---|---|---|
| మొత్తము | 929 | 100 | |
| హిందువులు | 201 | 21.6 | |
| మహమ్మదీయులు | 424 | 45.6 | 9.3 |
| సిక్కులు | 287 | 30.9 | |
| ఇతరులు | 17 | 1.8 | |
| 3 జిల్లాలు | | | 28.5 |



IV. హిందువులు సిక్కులు చాల హెచ్చుగానున్న జిల్లాలు

1. హిస్సార్

| | | | సభ్యులు |
|---|---|---|---|
| మొత్తము | 817 | 100 | |
| హిందువులు | 540 | 66.1 | |
| మహమ్మదీయులు | 216 | 26.4 | 8.2 |
| సిక్కులు | 46 | 5.6 | |
| ఇతరులు | 15 | 1.8 | |

2. రోటక్

| | | | |
|---|---|---|---|
| మొత్తము | 772 | 100 | |
| హిందువులు | 602 | 78.0 | |
| మహమ్మదీయులు | 125 | 16.2 | 7.7 |
| సిక్కులు | 1 | .1 | |
| ఇతరులు | 44 | 5.7 | |

3. గూర్గాన్

| | | | |
|---|---|---|---|
| మొత్తము | 682 | 100 | |
| హిందువులు | 455 | 66.7 | |
| మహమ్మదీయులు | 217 | 31.8 | 6.8 |
| సిక్కులు | 1 | .1 | |
| ఇతరులు | 9 | 1.3 | |

4. కార్నల్

| | | | సభ్యులు |
|---|---|---|---|
| మొత్తము | 829 | 109 | |
| హిందువులు | 560 | 67.5 | |
| మహమ్మదీయులు | 236 | 28.5 | 8.3 |
| సిక్కులు | 12 | 1.4 | |
| ఇతరులు | 21 | 2.6 | |

5. అంబాలా

| | | | |
|---|---|---|---|
| మొత్తము | 682 | 100 | |
| హిందువులు | 367 | 53.8 | |
| మహమ్మదీయులు | 206 | 30.2 | 6.8 |
| సిక్కులు | 98 | 14.4 | |
| ఇతరులు | 11 | 1.6 | |

6. సిమ్లా

| | | | |
|---|---|---|---|
| మొత్తము | 45 | 100 | |
| హిందువులు | 32 | 71.2 | |
| మహమ్మదీయులు | 7 | 15.5 | 0.4 |
| సిక్కులు | 1 | 2.2 | |
| ఇతరులు | 5 | 11.1 | |



7. కంగ్రా

| | | | సభ్యులు |
|---|---|---|---|
| మొత్తము | 766 | 100 | |
| హిందువులు | 722.3 | 94.0 | |
| మహమ్మదీయులు | 38.3 | 5.0 | 7.7 |
| సిక్కులు | 2 | .3 | |
| ఇతరులు | 3.4 | .7 | |

8. హోషియార్ పూర్

| | | | |
|---|---|---|---|
| మొత్తము | 927 | 100 | |
| హిందువులు | 494 | 53.3 | |
| మహమ్మదీయులు | 289 | 31.2 | 9.3 |
| సిక్కులు | 133 | 14.3 | |
| ఇతరులు | 11 | 1.2 | |

9. లూధియానా

| | | | |
|---|---|---|---|
| మొత్తము | 568 | 100 | |
| హిందువులు | 134 | 23.6 | |
| మహమ్మదీయులు | 193 | 34.0 | 5.7 |
| సిక్కులు | 236 | 41.5 | |
| ఇతరులు | 5 | .9 | |
| 9 జిల్లాలు | | | 60.9 |

ఈ పైవివరములవలన కృత్రిమముగా స్థానములను ప్రత్యేకించుట యవసరము లేకయే పాంచాలములో $\frac{3}{4}$ వంతులకు స్వతస్సిద్ధమగు రక్షణము గల దని తెలియగలదు. $\frac{1}{4}$ కంటె తక్కువలో బహిరంగమైన పోటీ యుండును. జనాభా విభజన అధికసంఖ్యాకులగు మహమ్మదీయులకు హెచ్చు లాభకరము.




మొత్తము జనాభాలో అత్యధికసంఖ్యగల సంఘములవారు నూటి కెన్ని వంతు లున్నారో యీసంఖ్యలు సూచించును. పచ్చరంగు వేసిన మండలముల యందు మొత్తము జనాభాలో మహమ్మదీయులు నూటికెన్ని వంతు లున్నారో తెలియజేయబడినది. ఎఱ్ఱరంగు వేసిన మండలములలో హిందువులు నూటి కెన్ని వంతులని తెలియజేయబడినది.

# రెండవ అనుబంధము

---

మతము ననుసరించి బెంగాల్ జనాభా వివరములు

బెంగాల్ రాష్ట్రములో బ్రిటిష్‌పరిపాలిత భూమి యొక్క జనాభా, 1921వ సంవత్సరము జనాభా ననుసరించి 4, 66, 95, 536. ఈజనసంఖ్య మతములవారిగా నీక్రింది విధముగా విభజింపబడెను.

| | | |
|---|---|---|
| మహమ్మదీయులు | 2,52,10,802... | 54% |
| హిందువులు | 2,02,03,537... | 43.3% |
| ఇతరులు | 12,81,207... | 27% |

ఇతరులలో కొండజాతులవారు, క్రైస్తవులు కలసి యున్నారు. కొండజాతులవారు కొండప్రదేశములలో హెచ్చుగానున్నారు. జైనులు, బౌద్ధులుకూడ నీ సంఖ్య చేరియున్నారు కాని వీరు చాలమంది లేరు.

కావున. మహమ్మదీయులు ఇతరు లందరకంటె నూటికి నాల్గువంతులు హెచ్చుగా నున్నారు. ఈ ఆధిక్యము రాష్ట్రమంతటిలోను సమానముగా విభ

జింపబడియుండలేదు. హిందువులు [illegible] ఒకభాగ మునందే— బర్ద్వాన్ జిల్లా [illegible] లో చాల హెచ్చుగా నున్నారు. కా[illegible]యలయందు మహమ్మదీయులు నూటికి నా[illegible] హెచ్చుగా నున్నారు. పాంచాలమునందు [illegible]నందు హిందువులపరగణా యనియు మహమ్మ[illegible]గణా యనియు ప్రత్యేకవిభాగములు గలవు. మ[illegible]లో మహమ్మదీయులు చాల హెచ్చుగానున్న[illegible]కదారిలో హిందువులు చాల హెచ్చుగానున్నారు. [illegible]నిలో హిందువులును మహమ్మదీయులును సమానముగానేయున్నారు. కాని, నూటికి నాల్గువంతులు హిందువులే హెచ్చు.

మహమ్మదీయ పరగణా

| | | | లక్ష కొక సభ్యుని చొప్పున శాసనసభలో సభ్యులు |
|---|---|---|---|
| (1) చిట్టగాంగు డివిజన్ | | | 60 |
| మహమ్మదీయులు నూటికి | | 72.6 | |
| హిందువులు | ” | 23.8 | |
| (2) డక్కా డివిజన్ | | | 128 |
| మహమ్మదీయులు | ” | 69.7 | |
| హిందువులు | ” | 29.7 | |
| (3) రాజ[illegible]డివిజన్ | | | 103 |
| మహమ్మ[illegible]యులు | | 69.4 | |
| హిందువులు | | 33.7 | |
| II హిం[illegible]చ్చుగానున్న పరగణా | | | |
| (4) బర్ద్వాన్ | | | 80 |
| మహమ్మదీయులు | | 13.4 | |
| హిందువులు | | 82.4 | |
| హిందువులు కొద్దిగా హెచ్చుగానున్న పరగణా | | | |
| (5) రాజధాని డివిజన్ | | | 95 |
| మహమ్మదీయులు నూటికి | | 47.5 | |
| హిందువులు | ,, | 51.4 | |
| ఈదామాషాప్రకారము బెంగాలులో మొత్తము సభ్యులు | | | 466 |

మహమ్మదీయపరగణాలో 291 స్థానము లున్నవి. హిందువులు చాల హెచ్చుగానున్న పరగణాలో 80 స్థానము లున్నవి. హిందువులు కొంచెము హెచ్చుగానున్న పరగణాలో 95 స్థానము లున్నవి. లక్ష కొకసభ్యుని చొప్పున బెంగాల్ మొత్తముమీద శాసనసభలో 466 సభ్యు లుందురు. దీనిలో 234 స్థానముల నాక్రమించుకొనిన యెడల స్పష్టముగా ఆధిక్యముకలుగును. మహమ్మదీయపర

గణాలోనే 291 స్థానము లున్నవి. అనగా ఆధిక్యమున కవసరమైనదానికంటె 57 స్థానములు హెచ్చు. ఐనను రాజధాని డివిజనులో మహమ్మదీయులు నూటికి 47.5 ఉన్నారు. కావున వారి నిష్పత్తి గమనింపకుండజాలము. కొన్నిస్థానములు వారికి తప్పక లభించును. ఈజనాభా సంఖ్య ననుసరించి వారికి లభించు స్థానములకంటె నిజముగా హెచ్చుస్థానములు లభించునని జనాభావిభజనమువలన తెలిసికొనదగును. [illegible] హిందువులకంటె బీదవారు కావచ్చును. విద్యలో వెనుకబడియుండవచ్చును. కాని వీనివలన వారికి గలుగు నష్టము, మహమ్మదీయ పరగణాలో వారిజనసంఖ్యవలనగలుగులాభమునుమించిపోజాలదు.

జనాభాలెక్కలను ఎక్కువ వివరముగా జిల్లావారీగా పరీక్షింపదగును. ఈసంఖ్య లీ క్రిందివిధముగా విభజింపవచ్చును.

(అ) మహమ్మదీయులు చాల హెచ్చుగనున్న జిల్లా

| | శాసనసభ్యులసంఖ్య |
|---|---|
| చిట్టగాంగ్ | 16 |
| నోకహాల్లీ | 15 |
| టిప్పరా | 27 |



| | సభ్యులు |
|---|---|
| మైమెన్‌సింగ్ | 48 |
| బకర్‌జంగు | 26 |
| ఫరిద్‌పూర్ | 23 |
| డక్కా | 31 |
| పాబ్నా | 14 |
| బోగ్రా | 10 |
| రంగపూర్ | 25 |
| రాజషే | 15 |
| జెస్సోర్ | 17 |
| నాడియా | 15 |
| | 282 |

(ఆ) చాల హెచ్చుగా మహమ్మదీయులున్న జిల్లాలు

| | |
|---|---|
| ముర్షిడాబాదు | 13 |
| మాల్డా | 10 |
| | 23 |

(ఇ) చాల హెచ్చుగా హిందువులున్న జిల్లా

| | |
|---|---|
| జాలుపైగుం | 9 |

(ఈ) హిందువులు మహమ్మదీయులు సమానముగానున్న జిల్లాలు

| | సభ్యులు |
|---|---|
| కూల్నా | 14 |
| దినాజ్పూర్ | 17 |
| చిట్టగాంగు కొండప్రాంతములు | 2 |
| | 33 |

(ఉ) హిందువులు చాల హెచ్చుగానున్న జిల్లాలు

| | |
|---|---|
| బర్ద్వాన్ | 14 |
| బీర్భమ్ | 8 |
| బంకూరా | 10 |
| మిడ్నపూర్ | 27 |
| హుగ్లీ | 11 |
| హవ్రా | 10 |
| 24 పరగణాలు | 26 |
| కలకత్తా | 9 |
| డార్జిలింగు | 3 |
| | 118 |

జిల్లావారీగా నిచ్చిన పై వివరములవలన డివిజనుల వారీగా నిచ్చిన వివరములవలనవచ్చు ఫలితమే కలుగును.



ఎన్నికలు మతభేదముమీద నాధారపడునెడల హిందూ పరగణాలలో హిందువులకును, మహమ్మదీయపరగణాలలో మహమ్మదీయులకును కృత్రిమరక్షణలు లేకయే స్వాభావికముగా స్థానములు ప్రత్యేకింపబడును.

మహమ్మదీయ పరగణాలలో చేరిన (అ) (ఆ) లను విభాగములలోనే 305 స్థానములు గలవు. (ఆ) అను విభాగములోని జిల్లాలను వదలివేసినను మహమ్మదీయులకు 282 స్థానములు వచ్చును. ఆధిక్యము గలుగుట కవసరమగు సంఖ్యకంటె నిది చాల హెచ్చు.

మతములవారీగా బెంగాల్ దేశపు జనాభా

(అ) బెంగాల్ డివిజనులు

| | జనాభా వేలలో | నూటికి | లక్షకొకసభ్యుని చొప్పున సభ్యులసంఖ్య |
|---|---|---|---|
| బర్ద్వాన్ డివిజన్ | | | |
| మొత్తము | 8050 | 100 | |
| హిందువులు | 6607 | 82.1 | |
| మహమ్మదీయులు | 1082 | 13.4 | 80 |
| ఇతరులు | 361 | 4.5 | |

| జిల్లా | వేలలోజన సంఖ్య | నూటికి | శాసనసభల లోసభ్యులు |
|---|---|---|---|
| రాజధానిడివిజన్ | | | |
| మొత్తము | 9461 | 100 | |
| హిందువులు | 4864 | 51.4 | |
| మహమ్మదీయులు | 4476 | 47.5 | 95 |
| ఇతరులు | 120 | 1.2 | |
| రాజషేడివిజన్ | | | |
| మొత్తము | 10345 | 100 | |
| హిందువులు | 3487 | 33.71 | |
| మహమ్మదీయులు | 6349 | 61.4 | 103 |
| ఇతరులు | 508 | 4.9 | |
| డక్కా డివిజన్ | | | |
| మొత్తము | 12837 | 100 | |
| హిందువులు | 3813 | 29.7 | |
| మహమ్మదీయులు | 8946 | 69.7 | 128 |
| ఇతరులు | 78 | .6 | |
| చిట్టగాంగ్ డివిజను | | | |
| మొత్తను | 6000 | 100 | |
| హిందువులు | 1433 | 23.8 | |
| మహమ్మదీయులు | 4356 | 72.6 | 60 |
| ఇతరులు | 212 | 3.5 | |



| జిల్లా | వేలలోజన సంఖ్య | నూటికి | శాసనసభల లోసభ్యులు |
|---|---|---|---|
| బెంగాల్ మొత్తముమీద (బ్రిటిష్ దేశము) | | | |
| మొత్తము | 46695 | 100 | |
| హిందువులు | 20203 | 43.4 | |
| మహమ్మదీయులు | 25211 | 54.0 | 467 |
| ఇతరులు | 1281 | 2.7 | |

(ఆ) బెంగాల్ జిల్లాలు

| జిల్లాలు | జనాభా వేలలో | నూటికి | |
|---|---|---|---|
| బర్ద్వాన్ డివిజను | | | |
| 1. బర్ద్వాన్ | | | |
| మొత్తము | 1439 | 100 | |
| హిందువులు | 1122 | 78.0 | |
| మహమ్మదీయులు | 266 | 18.5 | 14 |
| ఇతరులు | 50 | 3.5 | |
| 2. బీర్భమ్ | | | |
| మొత్తము | 848 | 100 | |
| హిందువులు | 577 | 68.1 | |
| మహమ్మదీయులు | 213 | 25.1 | 8 |
| ఇతరులు | 58 | 6.8 | |

| | | | సభ్యులు |
|---|---|---|---|
| **3.** బాంకూరా | | | |
| మొత్తము | 1020 | 100 | |
| హిందువులు | 880 | 86.3 | |
| మహమ్మదీయులు | 47 | 4.6 | 10 |
| ఇతరులు | 93 | 9.1 | |
| **4.** మిడ్నపూర్ | | | |
| మొత్తము | 2667 | 100 | |
| హిందువులు | 2352 | 88.2 | |
| మహమ్మదీయులు | 181 | 6.8 | 27 |
| ఇతరులు | 134 | 5.9 | |
| **5.** హుగ్లీ | | | |
| మొత్తము | 1080 | 100 | |
| మహమ్మదీయులు | 885 | 81.9 | 11 |
| హిందువులు | 173 | 16 0 | |
| ఇతరులు | 22 | 2.1 | |
| **6.** [illegible]రా | | | |
| మొత్తము | 997 | 190 | |
| హిందువులు | 791 | 79.3 | |
| మహమ్మదీయులు | 202 | 20.3 | 10 |
| ఇతరులు | 4 | .4 | |



రాజధానిడివిజను

| | | | సభ్యులు |
|---|---|---|---|
| **7.** 24 పరగణాలు | | | |
| మొత్తము | 2628 | 100 | |
| హిందువులు | 1687 | 64.2 | |
| మహమ్మదీయులు | 209 | 34.6 | 26 |
| ఇతరులు | 31 | 1.1 | |
| ౮. కలకత్తా | | | |
| మొత్తము | 908 | 100 | |
| హిందువులు | 643 | 70.8 | |
| మహమ్మదీయులు | 209 | 23.0 | 9 |
| ఇతరులు | 56 | 6.2 | |
| 9. నాడియా | | | |
| మొత్తము | 1487 | 100 | |
| హిందువులు | 582 | 39.1 | |
| మహమ్మదీయులు | 895 | 60.2 | 15 |
| ఇతరులు | 10 | .7 | |
| 10. మూర్షిడాబాద్ | | | |
| మొత్తము | 1262 | 100 | |
| హిందువులు | 569 | 45.1 | |
| మహమ్మదీయులు | 676 | 53.6 | 13 |
| ఇతరులు | 17 | 1.3 | |

| | | | సభ్యులు |
|---|---|---|---|
| **11.** జస్సోర్ | | | |
| మొత్తము | 1722 | 100 | |
| హిందువులు | 656 | 38.2 | |
| మహమ్మదీయులు | 1063 | 61.7 | 17 |
| ఇతరులు | 2 | .1 | |
| **12.** కూల్నా | | | |
| మొత్తము | 1453 | 100 | |
| హిందువులు | 727 | 50.0 | |
| మహమ్మదీయులు | 723 | 49.8 | 14 |
| ఇతరులు | 3 | .2 | |
| రాజషేడివిజన్ | | | |
| **13.** దినాజ్ పూర్ | | | |
| మొత్తము | 1705 | 100 | |
| హిందువులు | 752 | 44.1 | |
| మహమ్మదీయులు | 837 | 49.1 | 17 |
| ఇతరులు | 116 | 6.8 | |
| **14.** రాజషే | | | |
| మొత్తము | 1489 | 100 | |
| హిందువులు | 318 | 21.3 | |
| మహమ్మదీయులు | 1140 | 76.6 | 15 |
| ఇతరులు | 31 | 2.1 | |



| జిల్లా | వేలలో జన సంఖ్య | నూటికి | శాసనసభలలో సభ్యులు |
|---|---|---|---|
| **15.** జాల్పైగురి | | | |
| మొత్తము | 936 | 100 | |
| హిందువులు | 515 | 55.0 | |
| మహమ్మదీయులు | 232 | 24.8 | 9 |
| ఇతరులు | 189 | 20.2 | |
| **16.** రంగపూర్ | | | |
| మొత్తము | 2507 | 100 | |
| హిందువులు | 791 | 31.5 | |
| మహమ్మదీయులు | 1706 | 68.1 | 25 |
| ఇతరులు | 10 | .4 | |
| **17.** బోగ్రా | | | |
| మొత్తము | 1048 | 100 | |
| హిందువులు | 174 | 16.6 | |
| మహమ్మదీయులు | 865 | 82.5 | 10 |
| ఇతరులు | 9 | .9 | |
| **18.** డార్జిలింగు | | | |
| మొత్తము | 283 | 100 | |
| హిందువులు | 201 | 71.0 | |
| మహమ్మదీయులు | 9 | 3.2 | 3 |
| ఇతరులు | 73 | 25.8 | |

| జిల్లా | వేలలో జనసంఖ్య | నూటికి | శాసనసభలలో సభ్యులు |
|---|---|---|---|
| **19.** పాబ్నా | | | |
| మొత్తము | 1389 | 100 | |
| హిందువులు | 334 | 24.1 | |
| మహమ్మదీయులు | 1055 | 75.8 | 14 |
| ఇతరులు | 1 | .1 | |
| **20.** మాల్డా | | | |
| మొత్తము | 985 | 100 | |
| హిందువులు | 400 | 40.6 | |
| మహమ్మదీయులు | 508 | 51.6 | 10 |
| ఇతరులు | 77 | 7.8 | |
| **21.** డక్కా_డివిజన్ | | | |
| మొత్తము | 3125 | 100 | |
| హిందువులు | 1069 | 34.2 | |
| మహమ్మదీయులు | 2043 | 65.4 | 31 |
| ఇతరులు | 13 | .4 | |
| **22.** ఫరీద్‌పూర్ | | | |
| మొత్తము | 2250 | 100 | |
| హిందువులు | 816 | 36.3 | |
| మహమ్మదీయులు | 1428 | 63.5 | 23 |
| ఇతరులు | 6 | .3 | |



| జిల్లా | వేలలో జనసంఖ్య | నూటికి | శాసనసభలలో సభ్యులు |
|---|---|---|---|
| **23.** బకర్‌జంగు | | | |
| మొత్తము | 2623 | 100 | |
| హిందువులు | 754 | 28.7 | |
| మహమ్మదీయులు | 1851 | 70.6 | 26 |
| ఇతరులు | 18 | .7 | |
| **24.** మైమెన్‌సింగు | | | |
| మొత్తము | 4838 | 100 | |
| హిందువులు | 1174 | 24.3 | |
| మహమ్మదీయులు | 3624 | 74.9 | 48 |
| ఇతరులు | 40 | .8 | |
| చిట్టగాంగుడివిజన్ | | | |
| **25.** టిప్పరా | | | |
| మొత్తము | 2743 | 100 | |
| హిందువులు | 708 | 25.8 | |
| మహమ్మదీయులు | 2033 | 74.1 | 27 |
| ఇతరులు | 1 | 1 | |
| **26.** నోకహల్లి | | | |
| మొత్తము | 1471 | 100 | |
| హిందువులు | 329 | 22.3 | |
| మహమ్మదీయులు | 1142 | 77.6 | 15 |
| ఇతరులు | 1 | .1 | |

| జిల్లా | వేలలోజన సంఖ్య | నూటికి | శాసనసభల లోసభ్యులు |
|---|---|---|---|
| **27. చిట్టగాంగ్** | | | |
| మొత్తము | 1611 | 100 | |
| హిందువులు | 364 | 22.6 | |
| మహమ్మదీయులు | 1172 | 72.8 | 16 |
| ఇతరులు | 74 | 4.6 | |
| **28. చిట్టగాంగ్ కొండప్రదేశములు** | | | |
| మొత్తము | 173 | 100 | |
| హిందువులు | 32 | 18.5 | |
| మహమ్మదీయులు | 7 | 1.4 | 2 |
| ఇతరులు | 134 | 77.4 | |
| | | మొత్తము | 465 |

---

# మూడవ అనుబంధము

---

వంగదేశమునందు జిల్లాబోర్డులలోని ఎన్నికసభ్యుల వివరములు

## 1927—1928

| జిల్లాపేరు | మొత్తము స్థానములసంఖ్య | హిందూ సభ్యులసంఖ్య | మహమ్మదీయ సభ్యులసంఖ్య |
|---|---|---|---|
| 1. 24 పరగణాలు | 20 | 16(64.2) | 4 (34.6) |
| 2. బోగ్రా | 15 | 4(16.6) | 11 (82.5) |
| 3. బకర్ జంగు | 20 | 5(ఒక క్రైస్తవుడు) 28.7 | 15 (70.6) |
| 4. మిడ్నపూర్ | 22 | 21(88.2) | 1 (6.8 |
| 5. రాజషే | 18 | 7(21.3) | 11 (76.6) |
| 6. రంగపూర్ | 18 | 7(31.5) | 11 (68.1) |
| 7. ఖుల్నా | 16 | 11(50.0) | 5 (49.8) |
| 8. హుగ్లీ | 20 | 17(81.9) | 3 (16.0) |

| | | | |
|---|---|---|---|
| 9. డార్జిలింగ్ | 20 | 18(మహమ్మదీయేతర) ఇతరులు 15.8 | 2 (3.2) |
| 10. మైమన్‌సింగ్ | 22 | లేదు (24.3) | 22(74.9) |
| 11. పాభ్నా | 16 | 3(24.1) | 13 (75.8) |
| 12. నోకహాల్లీ | 16 | 6(22.3) | 10 (77.6) |
| 13. జాల్‌పైగురి | 16 | 14(55.0) ఇతరులు 20.2 | 2 (24.8) |
| 14. టిప్పర | 19 | 13(25.8) (చాంద్‌పూరు సబ్ డివిజనులో ఎన్నికలకు నిలిచి ఓడిపోయిన వారిలో ముగ్గురు నియోజింపబడిరి) | 9 (74.1) ఇద్దరు నియోజిత భ్యులు |
| 15. నాడియా | 20 | 15(39.1) | 5 (60.1) |
| 16. బర్ద్వాన్ | 16 | 14(78.0) | 2 (18.5) |
| 17. మూషిడాబాద్ | 15 | 7(45.1) | 8 (53.6) |
| 18. ఫరీద్‌పూర్ | 20 | 8(36.3) | 12 (63.5) |
| 19. మాల్డా | 15 | 8(40.6) | 7 (15.6) |

ఎన్నికలకు నిలిచిన సభ్యులందరు ఓడిపోయిరి. అందరు ప్రభుత్వనియోజితసభ్యులే.



| | | | |
|---|---|---|---|
| 20. హజారా | 12 | 10(79.3) | 2 (20.3) |
| 21. బిర్‌భమ్ | 16 | 15(68.1) | 1 (25.1) |
| 22. బాంకూరా | 10 | 9(86.3) | 1 (4.6) |
| 23. జస్సోర్ | 16 | 1 (38.2) | 15 (61.7) |
| 24. డక్కా | 22 | 16(34.2) | 6 (65.4) |
| 25. చిట్టగాంగ్ | 20 | + (22.6) | 20 (72.8) |
| 26. దినాజ్‌పూర్ | 18 | 4(44.1) | 14 (49.1) |

వివరము: (వాంసపాదులోనున్న సంఖ్యలు మొత్తము జనాభాలో నూటి కిన్నివంతులని తెలియజేయును.

లక్నో అఖిలపక్ష మహాసభవారి

కార్యక్రమము

[redacted] ఆగస్టు 28 నుండి 31 తారీఖు వరకు

# అఖిలపక్షమహాసభ

---

## లక్ష్మణపురి, 1928 ఆగస్టు 29 నుండి 31 తారీఖు వరకు జరిగిన సభావృత్తాంతము

### కార్యక్రమసంగ్రహము

అఖిలపక్ష మహాసభయొక్క నాల్గవసమావేశము లక్ష్మణపురమున కెయిజరీబాగ్‌లో 1928 సం॥ ఆగస్టు28 తారీఖునుండి 31 తారీఖువరకు జరిగెను. జాతీయమహాసభా కార్యనిర్వాహకవర్గము గాక యీక్రింది సంస్థలు సభలో పాల్గొనెను.

అఖిలభారత మితవాదులసభ

అఖిలభారత ముస్లిమ్‌సమితి

హిందూమహాసభ

కేంద్ర ఖిలాఫతు సంఘము

కేంద్ర సిక్కు సంఘము

హోంరూల్ సమితి

అఖిలభారత క్రైస్తవమహాసభ

జమైతుల్—ఉలేమా

అఖిలభారత సంస్థానప్రజలసభ

భారతశాసనసభలో కాంగ్రెస్‌వాదులపార్టీ

భారతశాసనసభలో జాతీయవాదులపార్టీ

అయోధ్యా బ్రిటిష్ ఇండియన్ సంఘము

కలకత్తా భారతసంఘము

మహారాష్ట్రవాణిజ్యసంఘము

సింధుజాతీయ సమితి

డక్కన్‌సభ

స్వాధీనభారతసంఘము

ఆజ్మీర్, ఆంధ్ర, బీహార్, బెంగాల్, బర్మా, మధ్యపరగణాలు (హిందూస్థానీ) మధ్యపరగణాలు (మరాటీ) ఢిల్లీ, కర్ణాటక, కేరళ, పాంచాల, సింధు, సంయుక్త, ఉత్కళరాష్ట్రీయ సంఘములు.

సభకు రాజాలనందుకు చింతించుచు, సభ జయప్రదముగా జరుగుగాక యని చాలమంది ప్రతినిధులు సభవారికి సందేశముల నంపిరి. దేశములో నన్నిప్రాంతములనుండియు సభ జయప్రదముగా జరుగుగాక యని తంతివార్త లంపబడెను.



ఆగస్టు 28 వ తారీఖుమధ్యాహ్నము సభాధ్యక్షులగు డాక్టర్ అన్సారీగారియాధిపత్యమున సభ ప్రారంభమయ్యెను.

మహమ్మదాబాదు మహారాజాగారు ప్రతినిధుల నాహ్వానించిరి. 1916 సంవత్సరమున చేసికొనబడిన లక్నో ఒడంబడికను గూర్చి సభ్యులకు జ్ఞాపకము చేసి ఆ సమయమున ప్రకటింపబడిన సఖ్యమును సద్భావమును ప్రస్తుత సమయమున గూడ ప్రకటింపబడు గాక యని వారు కోరిరి. నెహ్రూసంఘమువారి నివేదికకు దేశములోని పార్టీ లన్నియు సంపూర్ణామోదము దెల్పునని యత డాసించెను.

అనంతరము మహాసభాధ్యక్షులగు డా. అన్సారిగారు ముచ్చటించిరి. నెహ్రూసంఘసభ్యులను వారు మిక్కిలి ప్రశంసించిరి. మరియు రాజ్యాంగనిర్మాణ మహాకార్యమున నెహ్రూపండితుడును, ఇతరసంఘ సభ్యులును ఎట్లు శ్రద్ధవహించి పాటుపడిరో వారు వివరించిరి. నివేదికా ప్రాధాన్యమును గూర్చి వా రీక్రిందివిధముగా నుడివిరి.

'భారతస్వాతంత్ర్యోద్యమము పలువిధము లగు మార్పులకు లోనైనది. కాని యీ స్వాతంత్ర్యచరిత్రయందెప్పుడును భారతదేశమున కొక రాజ్యాంగ విధానమును నిర్ణయించుటకు దేశములోనున్న అన్ని రాజకీయపక్ష

ముల ప్రతినిధులును సమావేశమై యుండలేదు. నెహ్రూ సంఘ మొకరాజ్యాంగ విధానమును నిర్మించినది. ఇది చాల గొప్ప విషయము. ఇటీవల దేశమునందలి పరివర్తనములను గమనించినచో నీనివేదికయొక్క ప్రాముఖ్యము ఇనుమడించును. కొన్ని సంవత్సరములనుండి దేశములో విషాదకరములగు వైషమ్యములు ప్రబలిపోయినవి. ఈ దుస్స్థితి నంత మొందించుటకు అప్పుడప్పుడు చేయబడిన ప్రయత్నములు గూడ విఫలములైనవి. భారతరాజకీయాకాశమును దట్టముగా నావరించియున్న గాఢాంధకార నిచయములను భేదించుట యసాధ్యమయ్యెను. వివిధ సంఘముల యుద్దేశములలోను, ఆదర్శములలోను వ్యక్తమయిన తీవ్రభేదములు మనకు మనోవైకల్యమును గలుగజేసి దిక్కుతోచనివారినిగా జేసెను. మన వైషమ్యముల నాధారము చేసికొని భారతదేశములో మన ప్రతిపక్షులును, సప్తసముద్రముల యావలి ప్రజలును మనలను సవాలు చేయుచుండిరి. ఈ విషయముల నన్నిటిని విచారించినచో నెహ్రూనివేదిక మిక్కిలి చరిత్రాత్మక మైన దని వేరుగా చెప్పనవసరముండదు. సభాసదులారా, మనము నేడు చేయబూనుకొనిన మహాకార్యముయొక్క ఫలితము లాచంద్రతారార్కముగా నుండునవి గాని, రేపో మాపో నశించు



నవిగావు. మనభావిసౌఖ్యమునకు గాని, కష్టములకు గాని కర్తలము మనమే యగుదుము. మన మీనాడు చేయబూనుకొనిన దానిఫలితములను మీరు సరిగా గ్రహింతురుగాక!'

మరియు దుస్సహమగు విదేశీయప్రభుత్వాధికారమునకులోనై పలువిధములగు కష్టముల నందుటయే కాక, జాతిమత వైషమ్యములచే పీడింపబడిన 30 కోట్ల భారత ప్రజలకు నెహ్రూనివేదికయే తారక మని వారు నుడివిరి. కాని వా రది లోపరహిత మని చెప్పలేదు.

వారీక్రిందివిన్నపముతో తమయుపన్యాసమును విరమించిరి.

'భారతదేశమునకు శాంతి సౌఖ్యము లొనగూర్చుటకు గాని, అతిశయించుచున్న కష్టపరంపరలను వృద్ధి చేయుటకు గాని యీనాడు ఇచ్చట చేరియున్న ప్రతినిధులే సమర్థులు. ఈ రెండు పద్ధతులలో నొకదానిని నిర్ణయించుబాధ్యత మీయం దున్నది. ఈనిర్ణయముమీద నే భారతదేశముయొక్క భావిచరిత్ర యాధారపడియుండును. సవ్య మగు మార్గము నవలంబించి ధన్యు లగుదురుగాక!'

పిమ్మట, నివేదికను సభవారికి సమర్పింపవలసిన దని సభాధ్యక్షులు పండిత మోతీలాలు నెహ్రూగారిని కోరిరి. పండితు డట్లు చేసెను.

## 1. ప్రశంసా తీర్మానము

అంతట లజపతిరాయిగారు ఈక్రింది తీర్మానము నుపపాదించిరి.

"భారతరాజ్యాంగ సూత్రములను నిర్ణయించుటకు అఖిలపక్ష మహాసభవారిచే నియమింపబడిన సంఘసభ్యులగు పండిత మోతీలాల్ నెహ్రూ (అధ్యక్షుడు,) సర్ ఆలీఇమామ్, సర్ తేజబహదూర్ సప్రూ, ఆనే, సర్దార్ మంగళసింగ్, షుఆబ్ ఖురేషీ, సుభాష్‌చంద్రబోస్, జి. ప్రధాన్ గారులు చేసిన కృషికి ఈ మహాసభవారు కృతజ్ఞతా సూచక ప్రశంసను దెల్పుచున్నారు."

ఈ తీర్మానమును మౌలానా అబ్దుల్ కలమ్ అజద్ గారు ఆమోదించిరి. శ్రీయుత పండిత మదనమోహనమాలవ్యా మౌలానాషౌకతాలీ, డాక్టరు ఆనీబెసంటు, జే. యం. సేన్‌గుప్త, మౌల్వీమహమ్మద్ యాకూబ్, శ్రీమతి సరోజినీదేవి, సి. విజయరాఘవాచారి, జ్ఞానిషేర్ సింగు, రాజా సర్ రాంపాల్‌సింగు, మౌలానా అహమ్మద్ సయ్యద్, సి. వై. చింతామణి, యమ్. చగ్లా, చౌదరీ బీహారీ లాల్, తుఫెయిల్ అహమ్మద్ గార్లు తీర్మానమును బలపరుచుచు నుపన్యసించిరి.

ఒక్క హజరత్ మోహానీగారుమాత్రము తీర్మానమున కభ్యంతరము చెప్పిరి. వారు తప్ప తక్కినవారందరును సమ్మతుల నిచ్చుటచే సభవారిచే తీర్మాన మంగీకరింపబడెను.



సంఘమువారిపక్షమున పండితమోతీలాల్ నెహ్రూగారును, సర్ ఆలీ ఇమామ్‌గారును మహాసభవారికి వందనము లర్పించిరి.

## 2. బాధ్యతాయుత ప్రభుత్వము

రెండవ తీర్మానమును పండిత మదనమోహన మాలవ్యాగా రుపపాదించిరి. అది యిట్లున్నది.

"సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతీయుల గమ్యస్థానముగా నుండ దగునని వచించు రాజకీయ పార్టీల కృషికి ఆటంకము లేమియు కలుగ జేయకుండ ౧. భారతదేశములో స్థాపింపబడబోవు ప్రభుత్వము బాధ్యతాయుతప్రభుత్వమై యుండవలె ననియు, అనగా సంపూర్ణాధికారము గలిగిన ప్రజానియోజిత శాసనసభలకు బాధ్యత వహించిన ప్రభుత్వముగా నుండవలయు ననియు, ౨. అధినివేశస్వతంత్రరాజ్యముల యందలి ప్రభుత్వవిధానమునకే ప్రభుత్వవిధాన మెన్నికకిని కోరవలరా దనియు ఈ మహాసభవారు ప్రకటించుచున్నారు."

ఈ తీర్మానమును సర్ సి. పి. రామస్వామిఅయ్యరుగారు బలపరిచిరి. ఈ తీర్మానముపై చర్చ ముగియక పూర్వమే సభ ఆనాటికి విరమింపబడెను.

### రెండవనాటి కార్యక్రమము—ఆగష్టు 29

పండిత మదనమోహన మాలవ్యాగారితీర్మానముపై చర్చ ప్రారంభమయ్యెను.

పండిత జవాహర్లాల్ గారు అధినివేశప్రతిపత్తి నాక్షే పించి సంపూర్ణస్వాతంత్ర్యమే భారతీయుల గమ్యస్థానముగా నుండదగు నని వచించిరి. సంపూర్ణస్వాతంత్ర్యవాదులపక్షమున వారీక్రిందిప్రకటన గావించిరి.

"భారత రాజ్యాంగవిధానము సంపూర్ణస్వాతంత్ర్యాదర్శముపై నాధారపడి యుండవలె నని ఈ ప్రకటనలో సంతకములు చేసిన మేము అభిప్రాయపడుచున్నాము. అఖిలపక్షసమావేశమువారియెదుట నుంచబడిన రాజ్యాంగవిధానము నొప్పుకొనినవారు అధినివేశస్వాతంత్ర్యము నొప్పుకొని తీరవలె నని మాకు తోచుచున్నది. దీని నొప్పుకొనుటకు మేము సంసిద్ధులముగ లేము. కావున మా కీతీర్మానము నంగీకరించుటగాని, ఆమోదించుటగాని వలనుపడదు. తీర్మానముయొక్క అవతారిక సంపూర్ణస్వాతంత్ర్యమునకై మా కార్యక్రమమును మేము సాగించుకొనుటకు హక్కు నొసంగుచున్న దని యొప్పుకొందుము. కాని తీర్మానముయొక్క రెండవభాగమునందు అధినివేశస్వాతంత్ర్యము నంగీకరించితీరవలె నని యున్న నియమమును అవతారిక యే విధముగాను తగ్గించుటలేదు.

ఐనను ఈ మహాసభాకార్యక్రమమున కేవిధమైన యాటంకములు కలుగజేయుటకు మేము తలపలేదు.



కాని యీ సమస్యపై మా నిశ్చితాభిప్రాయమును వెలిబుచ్చి, అధినివేశ ప్రతిపత్తి నంగీకరించితీరవలె నను ఈ తీర్మానభాగముతో మాత్రము మా కేసంబంధమును లేదని ప్రకటింప నిచ్ఛగించుచున్నాము. ఈ తీర్మానమునకు సంబంధించినచర్చలో గాని, వోటింగులో గాని మేము పాల్గొనము. సంపూర్ణస్వాతంత్ర్యకార్యక్రమమును ప్రచారమును కొనసాగించుటకు మా కుచితమని తోచిన పద్ధతుల నవలంబింతుము"

మౌలానా కిఫాయతుల్లా, మౌల్వీమహమ్మద్ షాఫీ,సుభాష్ చంద్రబోసు,పండితహృదయ నాథకుంజ్రూ, డాక్టరు కిచ్లూ, డాక్టరు అహమ్మదుఆలమ్, టి. విశ్వనాథం, సర్దార్ శార్దూలసింగు గార్లు చర్చలో పాల్గొనిరి.

తీర్మానములోని రెండవ భాగమును తీసివేయవలసిన దని హజరత్ మోహానీగారు సవరణను ప్రతిపాదించిరి కాని ఆసవరణను ఆమోదించువా రైనను లేకపోయిరి.

అసలు తీర్మానమునకు పండిత మదనమోహన మాలవ్యాగారుప్రత్యుత్తర మొసంగిరి.తరువాత తీర్మానము వోటునకు పెట్టబడగా నేకగ్రీవముగా జయజయధ్వానములతో నంగీకరింపబడెను. అంతట సభ ఆనాటికి ముగిసెను.

మూడవరోజు—ఆగష్టు 30.

మూడవ తీర్మానము మణిలాల్ కొఠారీగారిచే నుపపాదింపబడెను. భారత సంస్థానములకు సంబంధించిన యీ తీర్మాన మిట్లున్నది.

## 3. భారత సంస్థానములు

“భారతసంస్థానములవిషయమున సంఘమువా రొసంగిన సలహాలను మహాసభవా రంగీకరించుచున్నారు.”

ఈ తీర్మానమును షఫిక్ గారు ఆమోదించిరి. సర్ తేజ బహద్దూర్ సప్రూ, మౌలానాజఫర్ ఆలీఖాన్, పండిత మదనమోహన మాలవ్యాగార్లుగూడ తీర్మానమును గూర్చి ముచ్చటించిరి. తీర్మాన మేకగ్రీవముగా నంగీకరింపబడెను.

ఈసమయమున సింధుసమస్యనుగూర్చి సభవారికి ఒడంబడిక కుదిరిన దని అధ్యక్షుడు తెల్పెను. ఈ ప్రకటనను సభ్యులు మిక్కిలి సంతోషముతో నంగీకరించిరి. ఈ యొడంబడికను తీర్మానరూపమున అధ్యక్షుడే ప్రతిపాదించెను. అది యిట్లున్నది.

## 4. సింధు సమస్య

“1. (అ) విచారణ జరపినమీదట నూతనరాష్ట్రనిర్మాణమున కవసరములగు ఖర్చులను సింధురాష్ట్రము భరింపగలుగు నని తేలినచో



(ఆ) అథవా నూతనరాష్ట్రనిర్మాణమున కవసరమగు ఖర్చును సింధుదేశము భరింపజాల దని తేలి విచారణసంఘమువారు రాజకీయ ఆర్థిక సాధక బాధకములతో సూచించు ఒకానొకపద్ధతి కవసరమగు ఖర్చులను సింధుదేశమునందు వసించు అధికసంఖ్యాకు లామోదించుచో, నెహ్రూసంఘమువారి నివేదికయందు ప్రతిపాదితమైన ప్రభుత్వవిధానమములలోనికి వచ్చినతోడనే. సింధుదేశమును బొంబాయిరాజధానినుంచి విడదీసి ప్రత్యేకరాష్ట్రముగా చేయవలెను.

2. సింధురాష్ట్రములో నేర్పాటు గావింపబడు ప్రభుత్వవిధానము ఈ రాజ్యాంగవిధానము ననుసరించి యితర రాష్ట్రములలో నేర్పరుపబడు ప్రభుత్వమునంటిదే యై యుండవలెను.

3. మహమ్మదీయులు అల్పసంఖ్యాకులుగా నున్న రాష్ట్రములయందు భారతశాసనసభలోను, రాష్ట్రీయశాసనసభలలోను నెహ్రూనివేదికయందు మహమ్మదీయుల కెట్టి ప్రాతినిధ్య మొసంగబడెనో అట్టి ప్రాతినిధ్యమే సింధురాష్ట్రమునందలి మహమ్మదీయేతరాల్పసంఖ్యాకుల కొసంగబడవలెను.”

తీర్మాన మేకగ్రీవముగా సంతోషపూర్వకముగా నామోదింపబడెను.

ఐదవతీర్మానము రాష్ట్రపునర్విభజనమును గూర్చియైయుండెను. ఈ తీర్మానమును పండిత ద్వారకాప్రసాదు మిశ్రగారు ప్రతిపాదించిరి. మౌల్వీ అబ్దుల్ మజీద్ గారు ఆమోదించిరి.

తీర్మానమునకు చాల సవరణలు ప్రతిపాదింపబడెను. చిట్టచివరకు సవరణలలోని భావమును అసలు

తీర్మానములో నిమిడ్చి సభవా రా తీర్మానము నేకగ్రీవ ముగా నంగీకరించిరి. ఆ తీర్మాన మిట్లున్నది.

## 5. రాష్ట్రపునర్విభజనము

"రాష్ట్రపునర్విభజనమును గూర్చియు, రాష్ట్రముల ప్రతిపత్తిని గూర్చియు నివేదికా నిర్మాతలొసంగిన సలహాలను సభవారు విచారించి ఆమోదింపబడిన రాజ్యాంగవిధానములో నంతర్భాగముగా వానిని చేర్చుకొనుట కంగీకరించుచున్నారు.

మరియు రాష్ట్రవిభజనమును గురించి యొసంగబడిన సలహాలలో ప్రతిపాదింపబడిన సూత్రముల ననుసరించియు, తమ కవసరమని తోచిన ఉపసంఘముయొక్క కాని, ఉపసంఘములయొక్క కాని సాహాయ్యము గైకొనియు, చిత్తురాజ్యాంగవిధానమునందు 72 క్లాజులో నేర్పరుపబడిన సంఘము ఈక్రింద నిర్వచింపబడిన కార్యములను నిర్వహింపవలెను.

(అ) కర్ణాటకమును, ఆంధ్రదేశమును ప్రత్యేక రాష్ట్రములుగా విభజించుటకు అవసరమగు చర్య గైకొనుట.

(ఆ) వివిధరాష్ట్రములలో చెదరియున్న ఓఢ్రభాష మాటాడు భాగములను ఏకము చేసి, వారు నూతనరాష్ట్రనిర్మాణమున కవసరమగు వ్యయమును భరింపగలిగియున్న గాని, భరింప సంసిద్ధులైయున్న గాని, అట్లేకము చేసిన ప్రాంతముల నన్నిటిని ఒక్క రాష్ట్రముగా జేయుటకు చర్య గైకొనుట.

(ఇ) మధ్య పరగణాలు [హిందూస్థానీ] కేరళ, మరియు ప్రత్యేక రాష్ట్రముగా విభజింపబడ నిచ్ఛగించు నితర భాషా ప్రయుక్తవిభాగముల స్థితిగతులను నివేదించుట.



(ఈ) సంఘమువారు నివేదికయందు ప్రతిపాదించిన సూత్రముల ననుసరించి. ఆసామ్ బెంగాల్ దేశములయొక్కయు, బీహారు ఒరిస్సాల యొక్కయు, మధ్యరాష్ట్రములు [హిందూస్థానీ] కేరళ, కర్ణాటకముల యొక్కయు సరిహద్దులను మరల నిర్ణయించుట."

అధ్యక్షుడు దీనిని స్వయముగా ప్రతిపాదించెను. తీర్మాన మేకగ్రీవముగా నంగీకరింపబడెను.

అనంతరము నెహ్రూనివేదికలో ప్రతిపాదింపబడిన రాజ్యాంగసూత్రముల నొప్పుకొనుచు లాలాలజపతిరాయిగా రొకతీర్మానము నుపపాదించిరి. శ్రీమాన్ ఏ రంగస్వామి అయ్యంగారు దాని నామోదించిరి. బిపిన చంద్రపాలుగారు బలపరచిరి. చగ్లాగారు రాజ్యాంగవిధానమును సవరించుటనుగూర్చి యొక సవరణను ప్రతిపాదించిరి. చగ్లాగారి సవరణ దరిమిలాను మార్చబడి ఆగస్టు 31 వ తారీఖున సభవారిచే నామోదింపబడెను. నాల్గవనాటి కార్యక్రమమునందు ఈ తీర్మానము పొందుపరుపబడినది.

### సభ ఆనాటికి ముగిసెను

### నాల్గవనాటి కార్యక్రమము—ఆగస్టు 31 వ తారీఖు

### లాలాలజపతిరాయల తీర్మానముపై చర్చ

ప్రారంభమయ్యెను. నివేదికలోని సూత్రముల నంగీకరించుటకు మారుగా, ప్రతిక్లాజును చర్చింపవలెనని శ్రీమాన్

విజయరాఘవాచారిగారు చెప్పిరి. శ్రీయుత విశ్వనాథం గారు దానిని ఆమోదించిరి. బిపినచంద్రపాలుగారు అభ్యంతరము చెప్పిరి.

ఈ సమయమున, పాంచాలదేశప్రతినిధులు సాంఘికసమస్యావిషయమున ఏకాభిప్రాయమునకు వచ్చిరను సువార్త సభవారికి దెలియగా లాలాలజపతిరాయల తీర్మానముపై చర్చ అప్పటికి విరమింపబడెను. తరువాత కొంత కాలమునకు లాలాలజపతిరాయిగారి తీర్మానమునకు సవరణలు చేర్చి సభవారు చర్చించిరి.

పాంచాలమునందలిసాంఘికసమస్యావిషయమున ప్రతినిధుల నైకమత్యము కుదిరిన దని అధ్యక్షుడు చెప్పగానే సభవారి కత్యంతానందము గలిగెను. సంతోషపరవశులై వారు పెద్దప్రొద్దు హర్ష సూచకములగు కరతాళధ్వనులు గావించిరి. ఈయొడంబడికలో, డా. యస్. డి. కిచ్లూ, మౌలానా జఫర్ ఆలీఖాన్, డా. మహమ్మద్ ఆలమ్, అబ్దుర్ రహమాన్ గాజీ, యమ్. దావుద్ గజ్‌నవీ, అఫ్‌జల్ హక్, సిరాజ్‌ద్దీన్‌పిరాచా, అబ్దుల్ కాదర్, యస్. హుసమద్దీన్, సర్దార్ శార్దూల్‌సింగ్ కావషర్, లాలా లజపతిరాయలు, లాలాధునీచందు, పండిత హరదత్తశర్మ, డాక్టరు సత్యపాల్, లాలా గిరిధర్ లాల్ గార్లు సంతకములు చేసిరి.



తారాసింగుగారును, జ్ఞానీ షేర్‌సింగు గారును ఒడంబడికను కొన్ని షరతులతో నంగీకరించిరి. ఒడంబడికయు, తారాసింగు షేర్‌సింగుగార్ల షరతులును ఈక్రింద పొందుపరుపబడినవి.

### 6. పంజాబు ఒడంబడిక

"మైనారిటీ వెళ్లినవారందరకు ఎన్నికాధికార ముండునెడల, నెహ్రూ సంఘ నివేదకలో సిఫారసు చేయబడినపద్ధతి అమలులోనికి వచ్చినప్పుడు, సాంఘిక ప్రాతినిధ్యమునుగూర్చి తత్సంఘమువారి సిఫారసులను పాంచాలమునందలి మహమ్మదీయు లంగీకరించెదరు. మరియు పాంచాలములో సంయుక్త నియోజకవర్గము లుండవలె ననియు, ఏసంఘమునకును సభ్యత్వస్థానములను ప్రత్యేకించుట యుండరా దనియు వారొప్పుకొందురు.

ఐనను, నెహ్రూనివేదికానిర్మాతలు సిఫారసు చేసినపద్ధతిని పాంచాలమునందు 10 సంవత్సరములపాటు పరీక్షించినమీదట, ఏ సంఘమైనను పునర్విమర్శింపవలసిన దని కోరినయెడల, సాంఘికప్రాతినిధ్యసమస్య పునర్విమర్శ చేయబడవలెను."

తారాసింగు జ్ఞానసింగుల షరతులు.

(1)పాంచాలములో ఎన్నికపద్ధతి దామాషాపద్ధతి ప్రాతినిధ్యమునననుసరించియున్న యెడల ఈక్రిందసంతకములుచేసిన సిక్కులము నెహ్రూసంఘనివేదిక నామోదించెదము.

(2) మైనారిటీ వెళ్లిన వారందరకు ఎన్నికాధికారమొసంగుట ప్రజాపరిపాలనాసూత్రములలో మిక్కిలి యుత్కృష్టసూత్ర మని మే మొప్పుకొనుచున్నాము. ఐనను

ప్రస్తుతసమయమున ఆచరణయోగ్యము కా దనియు, ఇంకకొంతకాలము గడచినగాని యీ హక్కును ప్రజల కియ్య వీలు లేదనియు తలచుచున్నాము.

(3) మైనారిటీ వెళ్లిన ప్రజలందరకు ఎన్నికాధికారము నిప్పుడే యిచ్చుటకు సభవారు తీర్మానించినయెడల మాపై యభిప్రాయమును నమోదుచేసికొనవలెను.

ఐనను మైనారిటీ వెళ్లినవా రందరకు ఎన్నికాధికార మొసంగుట మిక్కిలి ఉత్కృష్ట ప్రజాప్రతినిధిప్రభుత్వ సూత్రముంపై నాధారపడియున్నది గాన దానిని ప్రవేశ పెట్ట నిశ్చయించుట మా కపచార మొనర్చుట యని మేము భావింప మని స్పష్టముగా తెలియజేయుచున్నాము. ఈ యెన్నికాధికార మొసంగుటచే ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని సాంఘికప్రాతినిధ్య సిద్ధాంత మొప్పుకొనబడుట లేదని మే మూహించుచున్నాము. సాంఘిక ప్రాతినిధ్యమును మే మెన్నటికిని అంగీకరింపజాలము.

షౌకతాలీగారి ప్రకటన

పంజాబు ఒడంబడికలో వివరింపబడిన విషయమును గూర్చి కేంద్రఖిలాఫతుసంఘమువారు మొదట చేసికొనినతీర్మానము నింకను మార్చుకొనలే దని మౌలానా షౌకతాలీగారు తెలియజేసిరి. కేంద్ర ఖిలాఫతుసంఘము వారు ఢిల్లీ ముస్లీమ్ షరతుల నామోదించిరనియు, అప్పటి



కిని సంఘమువా రా యభిప్రాయమునే కలిగియున్నారు కాని మార్చుకొన లేదనియు షౌకతాలీగా రనిరి. డాక్టరు మహామ్మదు ఆలమ్, అబ్దుల్ కాదరుగార్లు షౌకతాలీ గారి యభిప్రాయముతో నేకీభవింపలేదు. ఈ ప్రకటన చేయుటకు కేంద్రఖిలాఫతు సంఘమువారు షౌకతాలీగారికి అధికారమిచ్చి యుండలేదని వారు చెప్పిరి. మరియు పంజాబు సాంఘిక సమస్యాపరిష్కారమును సంఘమువారు పంజాబు ప్రతినిధులకు వదలివేసిరనియు, ఆ ప్రతినిధులుచేసినతీర్మానములు సంఘమువారి తీర్మానములుగా భావింపబడవలెననియు వారు చెప్పిరి.

పిమ్మట అఖిలపక్ష మహాసభవారు పంజాబు ఒడంబడికయెడల తమసమ్మతిని సంతోషపూర్వకముగా వెల్లడించిరి.

అనంతరము డాక్టరు ఆనిబిసెంటు, శ్రీమతి సరోజినీదేవిగార్లు ప్రసంగించిరి. పురాతనమగు నీ. తగాదాను పరిష్కరింపగలిగినందులకు దేశములోని వివిధపక్షములవారిని వా రభినందించిరి. భారతదేశమునందు సాంఘికపక్షపాతమును, శాఖాపక్షపాతమును, నశించినవనియు, భారతస్వాతంత్ర్యమునెడలను, ఐకమత్యము నెడలను ప్రజలకు గాఢానురక్తి యుదయించిన దనియు డాక్టరు ఆనిబిసెంటుగారు చెప్పిరి.

బెంగాల్ దేశమును గురించి నివేదికలో నొసంగబడిన సలహాలను జే. యమ్. సేన్‌గుప్తాగారును, అక్రమ్‌ఖాన్ గారును, హిందూ మహమ్మదీయులపక్షమున నామోదించిరి.

రాజ్యాంగవిధానమును సవరించుటకు చగ్లాగారు చేసిన సూచనవిషయమున కొంత చర్చ జరిగెను. తుట్టతుద కీ క్రిందితీర్మాన మేకగ్రీవముగా నామోదింపబడెను,

## 7. రాజ్యాంగవిధానమును సవరించుట

"స్నేహసంఘమువా రొసంగినసలహాలలో 87 క్లాజు ను సంఘమువారు మరల నాలోచించి, రాజ్యాంగవిధానమును సవరించు విషయమున భారతశాసనసభలో వివిధాల్పజనసంఖ్యాక సంఘముల హక్కులను శ్రేయములను రక్షించు విధమున దానిని మార్చవలసినదిగా మహాసభవారు స్నేహసంఘమువారిని కోరుచున్నారు."

తరువాత మహాసభవారు ఈ క్రింది తీర్మానమును ఏకగ్రీవముగా నామోదించిరి.

## 8. భారత సంస్థాన పౌరులు

"సాధారణముగా భారతప్రజాస్వామ్యముతో వర్తకవ్యాపారములు చేయునట్టియు, ప్రజాస్వామ్యముయొక్క సరిహద్దులలో నివసించునట్టియు భారతసంస్థానపౌరులు భారతప్రజాస్వామ్య పౌరహక్కు లన్నియు గలిగియుందురు."

అనంతరము భారత ప్రజాస్వామ్యభాష హిందూస్థానీయై యుండవలె ననియు, దానిని హిందీలిపిలో గాని,



ఉర్దూలిపిలో గాని వ్రాయవచ్చు ననియు మౌల్వీ షాఫీ దావూదీగారు ప్రతిపాదించిరి.

ఈ ప్రతిపాదననుగూర్చి కొంత చర్చ జరిగెను. అనేక సవరణలు సూచింపబడెను. ఆఖరుకు ఈ క్రింది తీర్మాన మేకగ్రీవముగా నామోదింపబడెను.

## 9. భాష

"అఖిలపక్షసమావేశమువారిచే నియమింపబడినసంఘమువా రిందువిషయములను గూర్చి విచారించి సభవారికి నివేదిక నంపవలెను.

(1) స్వభాషామూలకముగాను, వారికి అలవాటైన లిపిలోను తమ బాలురు పాఠశాలలయందు విద్యాభ్యాసము చేయుటకు అల్పజనసంఖ్యాకసంఘములకు గల హక్కును రక్షించుట.

(2) భారత ప్రజాస్వామ్యభాష హిందూస్థానీగానుండి ఆ భాషను ఉర్దూలిపిలో గాని హిందీలిపిలోగాని వ్రాయుట; ఆంగ్లముగూడ వాడుటకు స్వేచ్ఛ నిచ్చుట.

(౩) ప్రతిరాష్ట్రమునందును ఆ యా రాష్ట్రభాష రాజభాషగానుండుట. హిందూస్థానీభాష గాని, ఆంగ్లముగాని వాడుటకు స్వేచ్ఛ నిచ్చుట."

తరువాత నీ క్రిందిషరతును సార్వజనిక హక్కులకు చేర్చవలసిన దని పండిత మదనమోహనమాలవ్యాగారు ప్రతిపాదించిరి.

## 10. ఆస్తి

"ప్రజాస్వామ్య స్థాపనాసమయమున న్యాయసమ్మతముగా సంపాదింపబడినట్టియు, భుక్తమనుచున్నట్టియు, సొంత ఆస్తికి గల హక్కు లిందుమూలకముగా గారంటీ చేయబడినవి."

దీనికి కొంద రభ్యంతరములను జెప్పిరిగాని కొంత చర్చయైన తరువాత నధికసంఖ్యాకులచే తీర్మాన మామోదింపబడెను.

సభలో నధిక సంఖ్యాకులచే నీక్రింది తీర్మానము గూడ ఆమోదింపబడెను.

## 11. కవులుదారులకు స్థిరత్వము

సార్వజనిక హక్కులలో 17వ క్లాజునందు 'నిరుద్యోగమువలన కలిగిన దారిద్ర్యమును నివారించుటకు' అనువాక్యముతరువాత ఈ క్రిందిమాటలను కలుపవలెను.

"కవులుదార్లకు సరసమగు కవులును, స్థిరత్వమును ఏర్పరుచుటకు భారతపార్లమెంటువారు తగిన చట్టములను చేయవలెను."

సభవా రేకగ్రీవముగా నీక్రిందిసవరణ నామోదించిరి.

"280-వ పుటలో VII సిఫారసులో 'పశ్చిమోత్తరసరిహద్దు రాష్ట్రమునకును' అనుమాటలతరువాత 'బెలుచిస్థానము' అనుపదము కలుపవలెను."

## 12. బెలుచిస్థానము

అనంతరము నెహ్రూనివేదికయందలి సూత్రముల నంగీకరింపవలె నని లాలాలజపతిరాయలతీర్మానము పై



చర్చ మరల ప్రారంభమయ్యెను. తీర్మానమునకు చాల విషయములు చేర్చబడెను. అనేకసవరణలు నిరాకరింపబడెను. తుట్టతుదకు క్రిందితీర్మానము ఒక్కవ్యతిరేక వోటుతో నామోదింపబడెను.

## 13. సంఘమును మరల నియమించుట

"నెహ్రూసంఘమువారు సమర్పించిన నివేదిక నాలోచించి ఆ నివేదికలోని సూత్రములను మహాసభవా రంగీకరించుచున్నారు.

ఇతరులను గూడ తమసంఘములో కలుపుకొనుటకు అధికారమొసంగుచు మహాసభవారు నెహ్రూసంఘమును మరల నియమించుటకు తీర్మానించుచున్నారు. మరియు, నెహ్రూసంఘమువారిచే అఖిలపక్షమహాసభవారికి నివేదింపబడి, తత్సభవారిచే నంగీకరింపబడిన రాజ్యాంగవిధానమును చట్టరూపమున వ్రాయుటకు నిపుణుడగు లేఖకుని నియమించుటకు మహాసభవారు నెహ్రూసంఘమున కధికార మొసంగుచున్నారు. చట్టమున కవసరమగు వివరముల నన్నింటిని గల్గి, సమగ్రముగా నున్న రాజ్యాంగవిధానము దేశములోనున్న రాజకీయ, వాణిజ్య, కార్మిక ప్రతిష్ఠాపనల ప్రతినిధులును, అధమపక్షము రెండు సంవత్సరములక్రిందట స్థాపింపబడిన యితర ప్రతిష్ఠాపనల ప్రతినిధులును చేరియున్న అఖిల పక్షమహాసభా (కన్వెన్షను) ముఖమున చర్చింపబడవలెను. ఈసభలో చేయబడిన యొడంబడికలకును తీర్మానములకును వ్యతిరేకమైన షరతులను చేర్చుటగాని, వ్యతిరేకార్థము నిచ్చు మార్పులను జేయుటగాని వలనుపడదు.

పైని జెప్పబడిన కన్వెన్షను జరుగవలసిన తారీఖును నిర్ణయించి, ఆ సభను జరుపుట కవసరమగు నేర్పాటుల నన్నిటిని సంఘమువారు చేయవలెను.

చట్టమును వ్రాయునప్పుడు రెండు షెడ్యూళ్లను మరల విచారించి, వానిలో తమ కవసర మని తోచినమార్పులను సంఘమువారు చేయవలెను.”

ఈ తీర్మానమునుగూర్చి తారాసింగు, జ్ఞానసింగుగార్లీక్రింది ప్రకటన గావించిరి.

‘పంజాబు ఒడంబడిక’ సందర్భమున మేము చేసిన ప్రకటనకు లోబడి యీతీర్మానమును మే మంగీకరించుచున్నాము.

అఖిలభారత క్రైస్తవ మహాసభాపక్షమున ఇ. అహమ్మద్ షాగారీ క్రింది ప్రకటనను గావించిరి.

పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రములలో బలీయమగు అల్పజనసంఖ్యాకసంఘమగు హిందువులకును, మహమ్మదీయులు స్వల్పసంఖ్యాకులుగా నున్న యితరరాష్ట్రములన్నిటియందు మహమ్మదీయులకును, శాసనసభాప్రాతినిధ్యమున ప్రత్యేకాభిమానము చూపబడినది గనుకను, * పాంచాలములోని సిక్కులకుగూడ వారి జనాభాదామాషాను ప్రాతినిధ్య మియ్యబడినది గనుకను, భారతదేశమునందలి జనాభాలో మూడవస్థానము నాక్రమించుభా

* అ.భా.కా. కార్యదర్శి వ్రాసినది: ఈమాట సత్యముగాదు. పాంచాలములోని సిక్కులకు వారి జనాభాదామాషాను ప్రత్యేక ప్రాతినిధ్య మియ్యబడలేదు.



రత క్రైస్తవసంఘమునకుగూడ శాసనసభలలో ప్రత్యేక ప్రాతినిధ్య మిచ్చుట సమంజసమును, ధర్మమును అని మనవిచేయుచున్నాము. ఈ ముఖ్యవిషయమును పరిష్కరించుటకై మా వాదమును అఖిలపక్షమహాసభవారికి నివేదించుచున్నాము.

తరువాత అధ్యక్షు డీ క్రింది తీర్మానమును ప్రతిపాదించెను.

## 14. నివేదిక పూర్తిగా నామోదించుట

“నెహ్రూ నివేదికలోని వివిధషరతులు పరస్పరసంబంధముగలిగియున్నవి గనుక పైతీర్మానములలోని యొడంబడికలన్నియు, నెహ్రూ నివేదిక ఆమోదింపబడినయెడల సంపూర్ణముగా నామోదింపబడవలెనను ఊహామీద నాధారపడియున్న వని ఈ సభవారు ప్రకటించుచున్నారు. మరియు నెహ్రూనివేదికను సంపూర్ణముగా నామోదించెదము గాని, దానిలో నేదో ఒకభాగమునుమాత్రమే ఆమోదించమని ఈ అఖిలపక్ష మహాసభలో హాజరయిన అన్ని పక్షములవారము ఒప్పుకొనుచున్నాము.

అన్ని పక్షములవారును సమ్మతించినయెడల నీరాజ్యాంగవిధానమునం దేమార్పులైనను చేయవచ్చును.”

ఈ తీర్మానమును ఒక్క సభ్యుడు మాత్రము అంగీకరింపలేదు. తక్కినవా రందరును ఆమోదించిరి.

15. ఆఖరుతీర్మానమును అధ్యక్షు డుపపాదించెను. ఇ ట్లున్నది.

“భారతీయులసందేశమును పాశ్చాత్త్యప్రజల కెరుకపరచవలసిన దని పాశ్చాత్త్యదేశములను సందర్శించుటకు వెడలనున్న శ్రీమతి సరోజినీదేవిగారిని అఖిలపక్షమహాసభవారు కోరుచున్నారు. ఇంకియు స్వాతంత్ర్యమును గడించి ప్రపంచశాంతికి కారణ భూతులగుటకు భారతీయుల కృతనిశ్చయతను గూడ చాటవలసిన దని దేవిగారిని ప్రార్థించుచున్నారు.”

ముగింపు

పండిత మదనమోహనమాలవ్యాగా రంతట అధ్యక్షునకు వందనము లర్పించిరి. మహమ్మదాబాదు మహారాజాగా రామోదించినమీదట మహాసభవారు సంతోషపూర్వకముగా తీర్మానము నామోదించిరి. అధ్యక్షు డుచితరీతిని ప్రత్యుత్తర మిచ్చెను.

సభను జయప్రదముగా నిర్వహించుటకు తోడ్పడిన లక్ష్మణపురవాసులను, శాంతిసైనికులను, ఇతరులను అభినందించుచు పండిత మోతీలాలు నెహ్రూగారు తీర్మానము నుపపాదించిరి. శ్రీమతి సరోజినీదేవిగారు తీర్మానము నామోదించిరి. కరతాళధ్వనులతో తీర్మాన మంగీకరింపబడెను.

అంతట అధ్యక్షుడు మహాసభను సమాప్తిచేసెను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

